శ్రీ:

శ్రీ మదాంధ్ర మహాభారతంబున గల

# ద్రోణపర్వము

## (జంగంకథ)


రచయిత:

అడిగోపుల వెంకటరంగకవి



కృతిభర్త:

చప్పిడి పున్నయ్యచౌదరి

పుల్చిగ్రామం

ఒంగోలు తాలూకా

(గుంటూరు జిల్లా.)

1956

వెల రెండు రూపాయలు.



కృతిభర్త:
చప్పిడి పున్నయ్యా చౌదరిగారు

శ్రీ ర స్తు

వి జ యో స్తు

శ్రీ శారదాంబాయైనమః

# శ్రీ ద్రోణపర్వము

## జంగంకథ

శ్రీగంగాధర వుల్చిపురివరా । శ్రితజనమందారా ।
భోగిభూషణా పూజితచరణా । పురహరభవతరణా ।
నాగాసురమద భంగశుభాంగా । నగసుత వామాంగా ।
ఆగమవందిత సకలామరనుత । యభవభువనవిహితా ।
దివ్యవేషముని మానసతోషా । దేవసుజనపోషా ।
అవ్యయశివభవశరధి తూణయన । లాక్షభక్తరక్షా ।
మోక్షాన్విత భువనైకరక్షసం । పూజితమునిపక్షా ।
దాక్షాయణిహృద్వనజపతంగా । దనుజాన్వయభంగా ।
సర్వభువనముల మూర్తిత్రయమున । చాకుచుండువీశా ।
నిర్వికార ఘనకలుష విదూరా । నిటలనయనరారా ।
యిందుధరా వృషభేంద్ర గమన వి । శ్వేశశైలవాసా ।
ముందుగ నీపద నీరేజములకు । మ్రొక్కి వినుతిజేసీ ।
సృష్టిస్థితికర్తల నామనమున । చింతన మొనరించీ ।
అష్టదిక్పతుల నాహృదయంబున । నభిమతులొనరించీ ।
పొలుపుగ శ్రీగణనాథుని చరణాం । భోరుహములు దలచీ ।
చలిమల సుతరమ భారతిదేవుల । సన్నుతు లొనరించీ ।

ఆదిమహాకవి వాల్మీకుని నా । యాత్మను గొనియాడీ ।
వేదవిదుండగు వ్యాసమునీంద్రుని । వినుతుల నొనరించీ ।
కాళిదాస కవిరాట్టుల నాహ్వా । త్కములంబుననిల్పి
చాలగతిక్కన పోతనాదికవి । చంద్రుల ప్రార్థించీ ।
సారగుణుడు కంకటిపోలయ కవి । చాలగనుతి యించీ ।
కోరిక కార్యమపూడి రాజ మ । న్నారు కవిని దలచీ ।
సద్గుణుండు కాండూరి కులాంబుధి । చంద్రుండన బరగూ ।
మద్గురుండు శ్రీసింగర దేశికు । మానసమున నిల్పి ।
శ్రీకరమగు ధరనుల్చిపురీశా । నీకంకితముగనూ ।
ప్రాకటముగ నొకకథ రచించెద । భవహార యెట్లనినా ।
సకలసంపదల కాలమన । జాలు నుల్చిపురినీ ।
సుకముగ మనుచాతుర్వర్ణములలో । జూడ నేటి యనగా ।
పరగ కమ్మకుల పుంగవుండు కొర । పాల గోత్రజుండూ ।
అరయగ చప్పిడి వంశాంబుధి కమ । లారి యనగమించీ ।
పొలుపుగ లింగయనామ ధేయుడను । పుణ్యుడు జనియించీ।
అలరుచు లక్ష్మీనరసమాంబయను । యతివను పెండ్లాడీ ।
అంచితముగ చంచయ్యసోదరిని । గాంచె నామెయందూ।
యెంచగ భూతదయార్ద్రిపరుడు భూ । తేశునిభక్తుండూ ।
పున్నమాంబయను నుత్తమకన్యను । పొలుపుగ పెండ్లాడీ ।
అన్నళినాన నయంబుడసెతా । పున్నయ శేషయలూ ।
అందు జ్యేష్ఠుడౌ పున్నయసోదరి । హరుపదభక్తుండూ ।
పొందుగ పున్నమ యనుకన్యనుతా । పొలుపుగవరియించే ।
ఆ సత్పుణ్యుడు సద్గుణశోభి క । లను దీర్చెడిఘనుడూ ।
వాసవాదినుతుడౌ పరమేశుని । నాసగొల్చువాడూ ।
అలరారుచు సతతకొక్కనాడు న । న్నాదరమున బిలిచీ ।
విలసితమగు శ్రీ భారతమందున । వెలయు పర్వములలో ।
సలలితమగు శ్రీ ద్రోణపర్వము । జంగముకథగాగా ।
పొలుపుగ నాకంకితముగ వ్రాయగ । బూనుమనుచుబలికె ।

చందన తాంబూలాది వస్త్రముల । సరసమతిని నొసగీ ।
అందినేను రచియింపగ బూనితి । నమలమానసమునా ।
అడిగోపుల వంశార్ణవమున విధు । డనగజన్మమందీ ।
కడలిశయను హితుభక్తుండను వేం । కట రంగాఖ్యుడనూ ।
పరమపవిత్రుండౌ శ్రీ ద్రోణుని । పర్వంబంతయునూ ।
పరశివు కంకితముగ రచియించెద । ధరజంగముకథగా ।
మానితముగ సుకవీంద్రులకెల్లను । మనవిజేతునయ్యా ।
దీనియందు యేతప్పులున్నగని । దిద్దుకావ్యలారా ।
ధర నా చంద్రార్కముగా నీ చరి । తము నిల్పుముయభవా ।
కరమరుదుగ నీకృతిభర్తనుయే । కాలంబులయందూ ।
శిరిసంపద లొసగియు బ్రోచును శం । కరుజేవేళలనూ ।
సరసనాయురారోగ్యము లిచ్చియు । చాకుచుండుగాక ॥

వ చ న ము —

అని యిష్టదేవతా వందనంబును సంస్కృతాంధ్ర కవిస్తోత్రంబును కృతిభర్త వంశప్రస్తావనంబును గావించి నేవ్రాయుంబూనిన శ్రీమదాంధ్ర మహాభారతంబున ద్రోణపర్వంబునకు కథాక్రమం బెట్టిదనిన ॥

శ్రీరస్తు

# కథా ప్రారంభము

జనమే జయుడొకనాడొలగమున । తనపరివారముతో
మునులు మంత్రి సామంతులు భటజన । ములతో గొలువుండీ
మానవనాథుడు వైశంపాయున । కానికిట్లులనియే
కానిరాయ భీష్ముడుననిబడు డె । ల్లను వివరించితివీ
తదుపరియేమి యొనర్చెనో దెల్పుము । తపసిరాయయనినా
హృదయోత్సాహంబున జనమేజయ । విభునకిట్లులనియే
నరవర భీష్ముడు శరతల్పంబున । నొరిగిన కథనెల్లా
విని ధృతరాష్ట్రుడు మనమున బొగలుచు । కనుల నీరునింపీ
సమరవిజయ కాంక్షకు రణభూమికి । సంజయునంపియునూ
అమరన దీసుతుమరణంబునకై । యంతరాత్మలో నా
పనివి పనివి దుఃఖించి సుయోధను । ప్రల్లదమును దలచీ
చెప్పిన బుద్ధులు వినక మూర్ఖుడై । చేటుదెచ్చె వాడూ
తల్లియైన గాంధారిదెల్పగా । ధర్మము వినడాయే
యిందిర నాథుడు సంధికివచ్చియు । వివిధగతుల దెల్పె
విదురాదులు దెల్పిన విజ్ఞానము । వినక నింత దెచ్చె
యీ కురువంశము గూల్చగ బుట్టెనో । యీ దుర్యోధనుడూ
అనుచునిటుల చింతాభర స్వాంతుం । డై యుండగ నపుడూ
కురుక్షేత్రమునకు జనిన సంజయుడు । కొన్ని దినంబులకూ
సాత్యవతేయుని వరప్రభావమున । సంగరంబులో నా
వుభయ బలంబులగల విశేషములు । నొప్పుగ గ్రహియించీ
ఒక్కనాటినిశి వెడలి సంజయుం । డక్కురి పురిజేరీ
అంతఃపురమున ధృతరాష్ట్రునికడ । కతివేగమె జనియూ
ఉచితరీతిగనినంత భూవిభుం । డుల్లము ఝల్లనగా
మనమునకేటు దోచక సంజయునిం । దన చేరువనిల్పీ
ఆదరించి యిట్లనియె సంజయున । కా ధృతరాష్ట్రుండూ

వ చ న ము —

సంజయూ సంగరభూమినుండి వచ్చితివిగదా అచ్చట సమర నధీనందను గోల్పడిన పిమ్మట కౌరవులెవ్వరి ప్రాపున పోరుసాగించిరో దెల్పుమన ధృతరాష్ట్రునకా సంజయుం డిట్లనియె॥

(కీర్తన) కాంభోదిరాగం [అటతాళం]

యేమని వచియింతును । యిందుకులోత్తమ
రామరామా యంతటి । రణమెన్నడుగన నైతినీ యే॥
దేవనదినందనుడు । దివిభావము నొందగనె
భావముల నడలుచును । పాండవులు కౌరవులు యే॥
అతనికడ కొచ్చుటయు । నచ్చటి విశేషములు
క్షితిపాలకనీతో ఘును । జెప్పియుంటినిగద యే॥
అపుడు శరతల్పగతు । డైనా గంగాత్మజుడు
నెపమెన్నక నీతనయుల । కెంతో హితవూదెల్పెను యే॥
ఆపుణ్యుని భోధ విన । డాయె సుయోధనుడు
పాపమతియాట ని । ప్పాటువాటిల్లెగద ॥యే॥
పోలుపుమీరా చప్పిడి । పున్నయాఖ్యునేలిన ।
వులిచీపురీశ్వరుడు । నుమావరుసాక్షిగ ॥యే॥

వ చ న ము —

అంతదుర్యోధనుండు రోషసంరక్తనయనుండై అచ్చట వీటొ్కని వెడలి పోయిన,

గీ॥ నాటివేకువ నేను యిచ్చోటు నుండి
వెడలి కౌరవ శిబిరము కేగినంత
నీకొమారులు సమరంపు నిశ్చయంబు
సేనలకు హెచ్చరించి రశేషముగను.

# రగడ

నిస్సాణాదివరంబులు మ్రోయగ ! నిఖిలసేనలెల్లా
వారణాది చతురంగ బలముతో । వచ్చిమూగియుండి
సకలబలము సన్నద్ధులగుచువడి సమరమునకు నడువా
భీష్ముడు లేమికి వగచివగచి నతి । భీతినిసైన్యములూ
కన్నులనీరిడి యెవ్వరు దిక్కని । కలవరపడుచుండా
సకలరాజవరు లందరు నీసుతు । సమ్ముఖమున జేరీ
కర్ణుడు రాదగదా సుయోధనా । కర్యమునకు నేడూ
భర్త లేమిసతి బ్రతుకయ్యెను మన । పాలితాతలేమీ
గోపాలక వర్గము రహితంబా । గోమందలరీతీ
పైరులేని ధరచాట్పుననుండెను । బలములెల్ల నేడూ
సింగహీనమౌ శైలగుహాంతర । చెలువునుండెబలమూ
భీష్మరహితమౌ సర్వసైన్యములు । బెదరిచూచుచుండే
తన నాథుని దిగ్భ్రమింగువృకావళి । తనను జుట్టుకొనగా
దిక్కులేక నలుదిక్కులజూచెడి । యక్కురంగమటులా
యేమిదోచకను జూచుచుండిరో । సామజపురిపాలా
మన సేనలు యీరీతి నుండగా । గని పాండవ బలమూ
వారివారి శౌర్యోద్రేకంబుల । భేరులుమ్రోయుచునూ
వచ్చుచుండగా మనవారలుగని హెచ్చు తాపములతో
గుములుగట్టి మన సేనలొక్కటిగ । గోడుజెందుచుండీ॥

వచనము —

మరియు సర్వసేన లొక్కటియై కేకలు వేయుచుండి రెట్లనిన

(కీర్తన) యెరుకుల కాంభోది [ఆట]

గావా । రావా కర్ణా కర్ణా
దేవవ్రతు డాలమున బడనిట । దిక్కులేమిని సర్వసేనలు
భావముల బెగడొందు చున్నవి । పాండవులుపై బడగవచ్చె ౧

దీనులా । సైతిమిరాధా తనయా ది॥
మానధనుడగు భీష్ముడాలము । లోననిల్చిన పది దినంబులు
మానితిని సమరంబు సేయుట । మానదగదిక లెమ్ము రమ్మా గావ॥
భూరి । విక్రమమూలాతోడా భూ॥
భోగీ ఫణావనినాదములతో । భోరుగొల్పుచు జలధిబొంగెడి ।
తీరునను సమరమున బోచ్చిరి । వేరె యెవరున్నారు కర్ణా గా॥
ధరను శ్రీ । పుష్పపురిని వెలసీ ధ॥
సరసచప్పిడి పున్నయాఖ్యా । చౌదరిని రక్షించు శంకరు
కరుణని సుమంతియును లేకయే । కష్టముల పాలైతిమయ్యా గా॥

వ చ న ము —

అని కౌరవులును తక్కటి జనపతులకర్ణుపైనాసను బలుకుచుండి రాతని తెరంగునీకు విన్నవించవిని యుంటివది యెయ్యది యంటేని భీష్ముండు॥

## ర గ డ

కర్ణుని యర్ధరథుండని బలికిన కనివి। రాధసుతుడూ
కోపంబున భీష్మునకిట్లనె నీ । కొడుకులు వినుచుండా
అర్ధరథుండని నిందగయొనర్చితి । సమరనదీ తనయా
నీవుసమరమున నిలుచునంతకును । విల్లు బట్టననుచూ
శపథ మొనర్చిన కథ వినియుంటివి । నృపవర యిదివరకూ
అట్టికర్ణుపై నాశజనించియు । నఖిలబలము లెల్లా
గావుకావుమని యరచుచుండిరో । కౌరవరాజేంద్రా
అని సంజయుడిటు చెల్పినవినియపు । డాంబికేయుడనియే
సంజయుమనసే నలునా కర్ణుని । సమరమునకు బిలువా
వచ్చిగా సేనారాజును బలముల । వసుధీశుల నెల్లా
అనియడిగిన ధృతరాష్ట్ర మహీపతి । కాసంజయుడనియే
ప్రజల రోదనమువిని కర్ణుమసం । బరమున వెడలియునూ
వచ్చినగని దుర్యోధనుండు తానచ్చె । రు వందుచునూ
అభినందించిన నర్కనందనుడు । నవనీశులగాంచీ

సత్యనీతి ధర్మములు నెరింగిన । శంతనాత్మజుండూ
అస్త్రవీర్య శౌర్యంబులు భీష్ముని । యందుగలవుసుమ్మా
అట్టి మహాత్ముండని లోగూలెని । కెట్టిగతియు గలదో
అనుచు విన్నవదనుండై కన్నుల । నశ్రులు జారగనూ
యేడ్వగమరి సకలావనీశ్వరులు । నేప్పుట గనుగొనియూ
తన్ను దాను శాంతించుకకర్ణుడు । తగనిట్టుల బలికే
కలవరమందకుడింక మీరునే । గాచెద బలములనూ
సలిపెదసమరము నర్జునుకడకును । నిలిపెద తృటిలోనా
పాండవులన నాకెంతమాత్రమిూ । భండనంబులోనా
సాత్యకిమొదలగు వీరులందరి । సమయజేతువినుడీ
రాజ్యరమను యెటులైనను మనకురు । రాజునకర్పింతూ
లేకున్నను నర్జును చెజచ్చియు । నాకము జేరెదనూ
అనియిటు బల్కుచు కర్ణుడు తనరధ । మచటికి దెప్పించీ
ఆరోహకుడైభీష్ముని సన్నిధి । కతివేగమె జనియూ
శరతల్పుండై యున్నమహాత్ముని । చరణంబుల బడియూ
కనుల భాష్పములు జలజలరాలగ । కరములు ముకుళించీ
ఘోరముగా దుఃఖించుచు నిట్లనె । నారాధాత్మజుడూ ॥

వ చ న ము —

కనులు మూసుకొని శరతల్పంబున శయనించి యున్న భీష్మున కిట్లని విన్నవించె॥

(కీర్తన) ముఖారి [ఆట]

వచ్చితిని రాధేయుడనుకను । విచ్చిచూడు మహాత్మదయాళో
ధీవరా ॥ భారత భూవరా ॥ వ ॥
దేవవ్రతని న్నిట్లొనర్చిన । యావిధాతను నేమనగనే
నేర్తునూ ॥ వగపెటులోర్తునూ ॥ వ॥
పావనంబగు నీదుయమృతపు । పలుకులను సన్మానరించుము ॥
శ్రీకరా ॥ వరమ దయాకరా ॥వ ॥

భండనంబున దండిమగడో । పార్థుకో త్తల మాన్ననెవ్వడు
లేడుగా । సేనలజూడగా ॥ వ॥
ధరనుచప్పిడిపున్న యాఖ్యుని । కరుణసేలెడి హాయనిక్రుపసుం
గైనమా॥ లేకిటులాయెనూ ॥

వచనము: —

అని పెక్కులాడి కర్ణుండు భీష్ముని పదంబులకు దండ ప్రణామం బాచరించి మరియు నిట్లనియె ॥

## రగడ

దేవా నేనొక మనవి జేసెదను । దేవనదీ తనయా
ఆ విజయుని నేనొక్కండనె తగు । దస్త్రవిద్యచేతా
గెలువగలను నీవంపించినయా । కలనిలోనవానీ
అన విని గాంగేయుండాకర్ణున । కనియె నిట్టులనుచూ
ఆ సుయోధనుండెట్టి బాంధవుడో । యట్టివాడవీవూ
బంధుకోటులకు నక్కరునాథుని । పాటివాడవీవూ
కావున నరపతి రాజ్యభారమును । కర్ణా నీయుదిగా
తలచి సర్వరాజన్యులగూడుక । కలనికిజనివేగా
సర్వకార్యభారంబు వహించియు । సమరములోనిలిచీ
కౌరవరాజుకు విజయము గూర్చుము । కర్ణా పొమ్మనినా
సంతసమందుచు సూతనందనుడు । శంతన నందనునీ
చరణంబులు తనశిరమున సోకగ । సాష్టాంగ మొనర్చి
అచ్చట వెడలి రథారూఢుండై । యతివేగము వచ్చీ
తమ సైన్యంబుల మనములగలిగిన । దైన్యంబులు వాపీ
కలనిలోనన్నృపులాది బలంబుల । కలయగనుంగొనియూ
కురునాథుండుప్పొంగగ రథకరి । హరి బృందంబులతో
దర్పము మెరయభటాళితోడరా । భాత్మజుండు వెడలా
హేమరథంబున నీ రణాశ్వంబులు । వేదికాధ్వజమునూ
భాసురమగుబంధుర కవచంబును । బాగుగధరియించీ
... వచ్చెడి ద్రోణుని । తిరగల్లను గాంచీ ।

భూపతులును కురువీరులబోగడిరి । పూర్ణప్రమోదము లా
అట్టితరిని నీ యగ్రనందనుం । డరదముదోలించి
కర్ణురథంబును జేరబోయిమది । కౌతుకంబుతోడా ।
రాధేయా నీ వలన గదా మన । రాణువంతనేడూ
అనదతనము వీడెను నాధత్వము । నమరెనిప్పటికినీ
గాన మనమునికగావింపగదగు । కార్యంబెయ్యదియో
వచియింపుము నీ వన విని కౌరవ । వల్లభుడిట్లనియే ॥

వ చ న ము—

కురువరా బహుజనరక్షకులైన రాజులు సద్బుద్ధులు గావున వారలలో నెవ్వరినైన నీవు నిర్ణయించుము నేవినియెదనన విని దుర్యోధనుండిట్లనియే ॥

# ర గ డ

రాధాత్మజ మనపక్షంబునగల । రాణువనంతయునూ
నాయకుడై తన బాహులమాటున । నడిపె సైన్యములనూ
అట్టి వీరుడౌ గంగానందను । డనిలోపదినాళ్లూ
ఘోరరణంబొనరించి తుదకు తను । జేరె నమరపురికీ
సేనకర్తృడెవడోనిక మీదట । జెప్పుమ రాధేయా
అని యడిగిన గాంధారేయునకా । యర్కసుతుండనియే
మన యోధులనసమర్ధతగల్గిన । మనుజపతియు గలడా
గావున ద్రోణుని సేనాపతిగా । గావింపుము రాజా
అన విని దుర్యోధనుడు మనంబున । కాహ్లాదంబుననూ
కొందరి రాజుల గూర్చుకతాశర । గురుసన్నిధికేగీ
సవినయంబుగా భక్తితో నిట్లని । సాగిలి మ్రొక్కియు నూ

వ చ న ము—

మఱియు దుర్యోధనుండు ద్రోణాచార్యునకు వినయవిధేయుండై యిట్లని విన్నవించె ॥

(కీర్తన ॥ ధన్యాసి ॥ ఆదితాళము ॥

కరుణింపుమా । శరగురువర్యాసుధైర్య ॥ క ॥
పరమపావనానీ । ప్రాపుగోరినాము
దురమునాసేనకూ । దొరవై మమ్మేలవయ్యా ॥ క॥
ప్రాయము కల్మియు । భద్రశీలముల
సాయూకాసంపదల్ । నీ యందెగలిగి యుండె ॥ క॥
నీదుమహిమసొంపు । నీనుయస్త్రపెంపు
సాదువైన భీష్మా । చార్యుడూ మునుదెల్పెనాకు ॥ క॥
ధరనునుల్చిపురి । ధామడౌగారిశు
కరుణలేక నిట్టి । కాలము సమకూరెనేడు ॥ క॥

వ చ న ము—

గావున మహాత్మా మాసేనల కధినేతవై మమ్ముల గాపాడుమని ప్రార్థింప నయ్యాందరగలయుంగనుంగొని యూచార్యుండిట్లనియె ॥

## రగడ

వేదములన్ వేదాంగములను మరి ! నెరుగుదు కొంతైనా
యింతవానిగా నను దలచియు మీా । రిచ్చోటికి వచ్చి
నన్ప్రార్థించిన వెనుదీయుదునే । నరవర యీా వేళా
నీ బలంబులకు నన్నధిపునిగా । నియమించుమురాజా
పట్టముగట్టుము నీ సేనకునధి । పతినై నడిపెదనూ
అనవినిసంతోషాంతరంగుడై । యుధిపా నీ కొడుకూ
కనకకలశముల పావనజలములు । కడువడి దెప్పించీ
మంగళోపకరణంబులచేతను । శృంగారించియునూ
పుణ్యాహవాచనములొనర్చిరి । భూసురవరులెల్లా
వందిజనంబులు స్తోత్రంబులునా । నందంబునజేయూ
సకల రాజవరులాసుయోధనుడు । సంతసములబొంగీ
శరగురునకు పట్టాభిషేకమును । జరిపించినయంతా

రథికులుశంఖంబులు పూరించిన । రయమున భటులెల్లా
భేరిపణవవాద్యాదితూర్యములు । ఘోరున మ్రోయగనూ
కౌరవయోధులకును నాయకుడై । కలశసంభవుండూ
రాధేయాది కుమారవర్గముల । రయమున జేకొనియూ
పాండుకుమారబలంబులపై జని । భారద్వాజుండూ
శస్త్రాస్త్రంబుల ప్రౌఢిమచేతను । చతురంగంబులనూ
నేలకుగూలకుదెచ్చి గూల్చెనా । నిజసైన్యంబులనూ
సురలునుతింపగ విహరించెనుయూ । దురమునశరగురుడూ
శిఖపరికొనియడవిని దహియించెడి । చెలువునకలశజుడూ
సేనలెల్ల సమయించి తుదకుత । త్సేనానాయకుడూ
అగ్నిమండి చల్లారిన తెరగున । నా మహనీయుండూ
ద్రుపదనందనులు సంతసింపగా । ద్రుంగెసమరముననూ
అప్పుడు ధృష్టద్యుమ్నుడు దక్కగ । నఖిలసేనలపుడూ
ద్రోణాచార్యుడు దెగుటగనుంగొని । దుఃఖంబులమున్గె ॥
సంక్షోభించెను సర్వభూతములు । సామజపురిపాలా ॥

వచనము—

అనినవిని యాంబికేయుండు హృదయంబుజెదర వదనంబువెల్లనై మగుడ నివ్వెరగంది కొండొకసేపు నిశ్చేష్టితుండై యుండి గద్గద వికల కంఠుండగుచు సంజయుతో నిట్లనియె ॥

(కీర్తన) ముఖారి [అటతాళం]

అనిగూలినాడా । ద్రోణాచార్య ॥ప॥
అనిగూలినాడాస । ధ్ఘనుడుపగతురచేత
యనఘునిశరదాడి । కినివ్వరోర్చిరా ॥య॥
అట్టివీరుని ద్రుపద । పట్టి ధృష్టద్యుమ్ను
డెట్టులగొట్టెనో । నేడ్తెరవిడనాడి ॥య॥
చాపమువిరిగెనో । సారథిదెగెనో

యేపగిదిరథ్యము । విలకునోరగెనోగాని ॥య॥
కేతుస్యందనములిం । కేరీతిబడియెనో
ధాతకుసరిబోల్చ । దగునుయాగమమున ॥య॥
అరయచప్పిడిపున । యాఖ్యుని నేలిన
ధరనుల్చుపురిచంద్ర । ధరుకరుణలేమిని ॥య॥

వ చ న ము—

ధృతరాష్ట్రుండు పొగలిపొగలి శోకించుచు మరియు నిట్లనియె ॥

గీ॥ విల్లుబట్టెడువారెల్ల । వెరపుగరచి
పోవనేలవైన ద్రోణుని । భుజమునిలువ
రించిపాంచాలనందను । బంచిపార్థు
డిట్లుజేయించెగాకొరు । డేలచాలు.

వ చ న ము—

అని మరియు నిట్లనియె

# ర గ డ

పామును గ్రమ్మినచీమలగమియటు । పాండవసైన్యములూ
జుట్టుముట్టియాద్రోణునిగూల్చెను । యెట్టులనగవచ్చూ
యికమనవారలకెవ్వరుదిక్కో । యెరుగరాదుసూతా
అనిపలురీతులమాటలాడుచును । యాలోననృపుడూ
కొంతదెప్పిరిలి తనువణంకుచును । యంతరంగమదరా
సంజయుతోనిట్లనుచుండెనుయా । పామజపురవరుడూ
తూరుపుగిరిపైనుండివచ్చియా । తోయజాప్తుకరణి
వచ్చుధర్మజునిగని మనసేనలు । రిచ్చవడరెయపుడూ
అట్టిసమయమునధర్మజునెదిరెడి । యవనీశులుగలరే
మదసింధురమౌయనగవచ్చునా । మారుతనందనునీ
గాండీవము శరజాలంబులుగొని । కవ్వడువచ్చిననూ
మార్కొనువారలులేరై రేమో । మనబలములలోనా
శరపరంపరలు ద్రోణురథముపై । బరపించెడివేళా

అట్టి కిరీటిని మాన్పింపగనొక । డైన వేడ దేమో
యెవ్వడు దెరలెనో తిరుగక నెవ్వడు । నెదిరించెనో చెపుమా
బిరుదుమగండై యెవ్వడుగూలెనో । భీభత్సునిచే తా
శరగురు నెవ్వరుగావకుండిరా । సమరావనిలోనా
కుంభజుండు బడినంత నె సర్వము । గూలెనిక్కముగనూ
ధర్మపుత్రు భాగ్యంబేమనిమది । దలచవచ్చునూ తా
తండ్రిగూలు సమయంబుననశ్వ । ద్ధామ లేడ దేమో
యేదిశబోరుచు నుండెనో యాతడు । నెరుగడుగా బోలూ
అశ్వద్ధామ యటుండిన ద్రోణుం । డడగకుండు నెమో
అని పలువిధముల పనివిపనివియూ । యవనీశుండప్పుడూ

వ చ న ము—

తన కొడుకులు గెలువరను నిరాశం జేసీ

ఆ॥ సొమ్మవోయి పడిన । సుదతులాక్రందన
రవముతోడసత్వ । రముగ నెత్తి
యూ నృపాలు సెజ్జ । యందిడి మెలపున
శిశిరవిధులుసేయ । సేదదేరి ॥

వ చ న ము—

మరియు నా సీనుండై కురువిభుండు సంజయునకిట్లనియె ॥

## ర గ డ

హరినరు లిరువురు రధిసారధులై । నట్టిరధోత్తమమూ
అరధమొందును సిద్ధమనోరధ । మగుటకు సందియమే
కవలు సమరరంగంబున మగటిమి । గలుగు వీరవరులూ
సత్యపరాక్రమ సీలుండగుయూ । సాత్యకినసదుండే
పాంచాలోత్తముడుత్తమరాజుడును । బాహుబలులుసుమ్మా
ధృష్టకేతు డతివీరుడు రణమున । ధీరోదాత్తుండూ
అమరనదీసుతు కొరకై బుట్టిన । యలశిఖండినసదే
అభిమన్యునిగన రెండవరుద్రుం । డనగసందియంబే

యాదవకులుడగుచేకితానుగన । నతి పరాక్రముండూ
ద్రౌపది నందనులందరిజేయులు । దనరగ కేకయులూ
నేపురగ సనేక వెయిరథికులకు । నెనయబోల్పవచ్చూ
పరగయు యుయుత్సుండన సామాన్యుడె । బహుళమత్సరుండూ
ద్రోణవధకు జన్మించిన దృష్ట । ద్యుమ్ను నెన్నదరమే
ఘోరమూర్తియైనట్టి ఘటోత్కచు । వేరె జెప్పనేలా
హరి యాశ్రయమున వచ్చిన యాదవ । వరులు తక్కువానే
భీమగదాధరుడైన భీమునా । భీమపరాక్రమమూ
చెప్పుట కలవియె వినుము సంజయా । సేనలగావగనూ
ధర్మదేవతాత్మజుడైనట్టియు । ధర్మరహితుడతడూ
సత్యశీలశౌచాది ధర్మమూల । సరిగ నడుచువాడూ
అట్టి ధర్మజుని గెలువ దేవతుల । కైన నలవిగాదూ
యిందీవరశ్యాముని యనుగ్రహము । బొందియున్నవారూ
ఆ పాండవులను గెలువగ సాధ్యమె । నవనినెవరికైనా
ద్రోణుడు సంగర మెటులొనరించెనో । దోర్బలముననతడూ
యెవ్వరెవ్వరిని బలిమిని గొట్టిరో । యెరుగబలుకుమయ్యా

వచనము—

అని యడుగుచున్న ధృతరాష్ట్రునకా సంజయుండిట్లనియె ॥

(కీర్తన) ముఖారి [ఆట] (యిది[illegible])

వినుమా కౌరవరాజా । వినిపించెద ॥ వినులార్థి కల్పభూజా॥
వినుము కౌరవ భూప ద్రోణుడు । మనబలంబుల కాధిపత్యము
గనిమనంబున మోదమునసనీ । తనయుగని నిట్లనియె నతడూ ॥వి॥
శంతన నందనునీ । యనంతర । మెంతో ధైర్యమునూ నీ
మంతనము నందెంతో వేడుక । నెంతగా బూజించితివి నను
సంతసంబున వరమొసంగెద । జనవరానివు గోరుమెదియనే ॥వి॥
తల్వ్రాత యెటులున్నదో । యటులే గాక
తప్పింపా ధాతావశమా

యిలను నుల్చిపురీశుడా (శ్రీ) । విశ్వనాథుని కరుణనేవిధి
గలుగునో మనపైన దెలియగ । వలనుపడునాకురువిభోయనే॥వి॥

వచనము—

వరమిచ్చెదగోరు మనవిని శకుని కర్ణ దుశ్శాసనులతో నాలో
చించి దుర్యోధనుండా ద్రోణాచార్యున కిట్లనియె ॥

## రగడ

వరము గోరెదను శరగురువర్యా । వాత్సల్యంబుననూ
పరమపవిత్రా గోరునదేమన । పాండవాగ్రసుతునీ
ఖండనంబులో ప్రాణము తోడుత । బట్టినాదు కడకూ
గొనివచ్చియు నా కొప్పగించుటయె । గురువరవరమనినా
అని యిటుగోరిన ద్రోణాచార్యుం । డధిపుమోముగాంచీ
ఆయుధిష్ఠిరుని దెగజూడకని । ట్లాజిబట్టుకొనియూ
రమ్మని దెల్పితివా పాండవులను । రణములోన గెల్చి
నగపాలియగదలచితివేమో । నరగదెల్పుమయ్యా
యిపుడు ధర్మజుని బట్టితెచ్చినను । యేమి సేయగలవో
నీదు నిశ్చయము దెల్పుమనినవిని । యా దుర్యోధనుడూ
పొంగిపొరలుచును తన మానసమున । బుట్టిన కార్యమునూ
శరగురునకు తక్కిన రాజులకును । నెరిగింపగదలచీ
అందరు వినుచుండగ నిట్లనియెను । నవనీ నాథుండూ
కయ్యంబున ధర్మజు దెగటార్చిన । కవ్వడు కోపించీ
కౌరవులను నంతంబొనరించును । గావున మనమనిలో
పాండవులందరి గూల్చ నెరింగియు । పద్మాక్షుండొకడే
కౌంతేయులు లేకుండిన గానీ । కౌరవులను గూల్చి
సర్వ రాజ్యమును కుంతికైనదా । సమర్పించగలడూ
గావున ప్రాణంబులతో ధర్మజు । గట్టి తెచ్చిమనమూ
వానిచేత జూదం బాడించియు । వనులకు బంపించీ
సర్వరాజ్య మాచంద్రస్థాయిగ । చక్కగ పాలింతూ
ననవిని యాస్త్రగురుండావరమున । కతియేహ్యాముబొందీ

కౌరవేశ్వరా ధర్మజుబట్టెద । గాని యొకటి గలదూ
పార్థుండడ్డము జొచ్చిన ధర్మజు । బట్టగ నాకగునే
నేనొకడననేలను సురలందరు । బూని గెల్వగలరా
అతడు లేకుండిన ధర్మాత్మజు । నాద్రుపదాత్మజులా
నేలకుగోలకు దెచ్చి ధర్మజుని । నేను బట్టగలనూ
అనుటయు విని నీతనయు లందరును । యతి బాలిశులగుటా
ధర్మనందనుడుజిక్కనటంచుచు । దలచి రాజరాజూ
సర్వసేనలకు దెలియునట్టులను । చాటింపగ బంపా
విని సేనలుసకలావనీశులను । వివిధవాద్యములనూ
మ్రోయించినను బలమంతయు స । మ్మోదంబులబొంగే
ఆ వృద్యమంతయు చారులవల । ననువిని ధర్మజుడూ
తమ్ములకందరికిని వినిపించియు । ధనంజయునిజూచీ
అనుజా ద్రోణుని ప్రతిన వింటివే । యది యసాధ్యమయ్యా
దానిబొంకుసేయంగ వలయునేడు । లైన పార్థమరియూ
సావ్యసాచియడ జొచ్చినపట్టుట । సాధ్యముగాదదియూ
ప్రతినజేసె ద్రోణాచార్యుండా । ప్రతినేడు మాన్పదవో
గావున ననునేవేళను బాయక । గాచియుండ వలయూ
నేనుండెడి చోటను నీవెప్పుడు । నిలిచి యుండవలయూ
కౌరవపతి కోరిక నటవిఫలము । గావింపగ వలయూ

వచనము —

అని ధర్మజుండు బలుకుచున్న విని పార్థుం డగ్రజున కిట్లనియె

(కీర్తన) శహాన [ఆదితాళం]

అన్నా భయమందనేలా । యలద్రోణు ప్రతినవిని నీ
కన్నాకుగాగ నిన్నూ । గాపాడ పార్థుడుండా అ॥
గురుసీనధి యించుటయును । నరనాథా నీవు నొవ్వ
పరికింపా నొక్కరూప । దురమూనా విడుతునే నిను అ॥

క్షోణీ వల్లభ సేనూ । ప్రాణామూలాతో నుండా
స్థాణూనమైన వశమూ । జననాథా నిన్ను బట్ట అ॥
మాశక్తి దెలియక దు । రాశాను ధార్తరాష్ట్రులు
లేశామైనాను దలప । రేమీా మూర్ఖమొగాని అ॥
మాడూలోకాము లొక్క । మొత్తామూలై వచ్చిన
చూడాగలుగుదురే నన్నూ । రేడాయడలూన నేల అ॥
చప్పిడి పున్నయాఖ్యా । చౌదరి నేలుచుండిన
యప్పరమేశు కరుణ । దప్పదు జయము మనకు అ॥

వ చ న ము —

అనినవిని యుధిష్ఠిరుండు సంతుష్టాంత రంగుండై శంఖభేరీ మృదంగాది మంగళతూర్య స్వనంబులు జెలంగ సకల సైన్య సమేతంబుగా వెడలి నడచి మొగంబున చిరునవ్వాల యక్రౌంచ వ్యూహంబమర్చి నందగ్ర భాగంబున॥

## రగడ

అర్జునుండు శ్వేతాశ్వంబులు తన । యరదమునకు బూన్చి
కపికేతన మమరించిన కాంతులు । గ్రిమ్మె నాల్గు దిశలా
రెండవ మార్తాండుండోయన గను । నిండె కిరణ సమితీ
హరి నరులును రథిసారథులై యా । యరదమధిష్టింపా
పగతుర గుండెలు ఝల్లనంగ బల్ । భయముగూరి యుండే
అరదము కేల నను ధృష్టద్యుమ్నుని । యరదము బరిపింపా
మరియు భీమపాంచాలాదులు నభి । మన్య ప్రభృతులెల్లా
దండనాయకులు పరివారంబులు । దగనయ్యెయ్యెడలా
నిలిపి యుధిష్ఠిరు డమ్మోహరమున । నిలిచె ధీరుడగుచూ
అంతకుమున్నక్కడ మనవారలు । నతికౌతుకముంలతో
సమరకుతూహల జనితోద్యములై । శకటవ్యూహమునూ
బన్నిరి దర్పమెలర్పగ మనబల । మన్ని దిశలనిండే
అందువలపటను సింధురాజుతో । నమరే వికర్ణుండూ

చటులహయంబులతో నక్కనలను ॥ సాబలుండునిలిచే
చాపటకృతవర్మాది బలముతో । తగుదుశ్శాసనుడూ
అతనికి బ్రాపై తత్పార్శ్వంబుల । యవనమహీశ్వరుడూ
నడుమ త్రిగర్తయు మద్రేశుడుశిబి । నాయకులందరునూ
కుంభసంభవుని వెనువెంటనుయూ । కురు భూపాలుండూ
కరితురంగ సంఘముతో ముందుగ । కర్ణుడుదాత్తుండై
నిలిచినంత పెర్సైన్యము లెల్లను । నిలిచిరచ్చటచటా
ఆ రాధేయుని దర్పొద్ధతిగని । యఖిల సేనలెల్లా
పరమానందంబుల ననుచుండిరి । పాండునందనులనూ
బాహాశక్తినినొంచగలడు యీ । భాను నందనుండూ
అని యబ్బుచు కేకలు నిడుచుండిరి । యఖిలసైన్యములునూ
అటులుండగ గురుడుగ్రతేజుడై । యరదమునడుపగనూ
గగనతలంబున మేఘము లేకయె । కండలురక్తమునూ
నెమ్ములుగురిసెను మొత్తముల్తై నో । క్కుమ్మడిగానచటా
సైన్యంబులపై గ్రద్దలాడెనట । జంబుకములుగూసే
నలుడిక్కుల తారాగణమెల్లను ।జలజలమని వ్రాలే
అట్టిమహోత్పాతంబులకును భయ । మందక కౌరవులూ
శంఖభేరినినదంబులు జేయుచు । జనిరి సమరమునకూ
అదిగనిపాండవబలములు నడిచిరి । యారణభూమికినీ

వ చ న ము—

ఇట్లుభయబలంబులు యుద్ధసన్నద్ధులై యున్నశరి నచ్చట

(కీర్తన) బిల్హరి [ఆదితాళం]

నరుడారాధేయుడు సం । గరభూమినిరధికులగుచు
దురమునవొండొరులుజెనగు । తోరపుచూపుల నిలిచిరి ॥న॥
యిరువాగులసేనలు సం । బరములతో నేడ్త్రరలన్
కరితురంగబృందములోఁ । గదిసిరి నొకరొకరువడిగ ॥న॥
పలువిధ వాద్యములు మ్రోయ । పరివా । రముసింహనాద

ములుజేయుచు సింజినిమ్రోా । తలు సల్పుచు నుండిరపుడు ॥న॥
అప్పుడుసమరావనిపైను । జప్పుడెక్కువైజలంగె
చప్పిడిపున్న యనేడి । స్మరహరుమనముల దలచుచు ॥న॥

వచనము—

మరియు నుభయసేనలు మార్కొనసున్న సమయంబున ద్రోణాచార్యుండు దివాకరతేజుండై వెలుగుచు కనకరథకాంతు లన్నిదిశల బర్వసర్వసేనా సమేతుండై సమరావనికిం జనినంత

## రగడ

మనసేనలు దర్పంబుల మార్కొను । టనుగని యర్జునుడూ
తోలుతను దాకిని వారి సైన్యములు । దోర్బలమునదాకా
వినువీధిని నిర్జరబృందంబులు । వేడ్కచూచు చుండ
ఉభయ బలంబుల పాదపరాగము । నుప్పరమునసిండా
పోరుచుండి రిరివాగులుమార్కొని । భూరిపౌరుషములా
కరితురంగరథభటసంఘంబులు । దొరగుచుండెమరియూ
వివిధసేన లద్భుతముగ బోరెడి । వేళశోణితంబూ
గ్రమ్మగజూచిన తంగెడులోయన । కయ్యంబుననిలువా
గురుడంతట చెలరేగి రథంబును । బిరబిరదోలించీ
కౌరవి ద్రిప్పుచుందంబున పగతుర । గుండె లవియునటులా
దిరుగుచు పెక్కురథంబులు గూల్చుచు । కరితురగంబులనూ
భటజనులను నాయకులను ద్రుంచుచు । భారద్వాజుండూ
యెటుజూచిన ద్రోణాచార్యునిరథ । మే మెరయుచునుండే
తన నెదిరించెడి వీరుడు లేకయె । ననిసేయుచునుండా
అప్పుడు పాండవబలముల జూడగ । నలవిగాక యుండే
గురుశరదాడిని దెగినయోధులును । గుజ్జుపు ధళములునూ
శితఛత్రంబులు చామరంబులును । సింధుర తండములూ
అరవరలై పడియున్న స్యందనము । లనని నిండియుండే
రక్తమేరులై పారుచుండగా । రణక్షితి నెల్లెడలా

భూతజాలములు ఫలలము మెసవుచు । పొంగుచునుండగనూ
ఆసమయంబున ద్రోణాచార్యుని । యద్భుత వేగమునా
దేరిచూడ రాకుండె నెవ్వరికి । కౌరవకులనాథా
అదిగని ధర్మజుడు రవడించి ధృ । ష్టద్యుమ్నుని నరుసీ
వీక్షించియు కుంభజువారింపగ । వేగనియోగింపా
ద్రుపద రాజనందనుడగు ధృష్ట । ద్యుమ్నుడు కోపమునా
చతురంగంబులతోడ వెడలి శర । చాపధరుండగుచూ
జవమున జనిశస్త్రాస్త్రంబుల నా । చార్యుని బొదువగనూ
రభసంబున పార్థుడు తనబలముల । రయమును బురికొల్పా
జనియాసేనల ధృష్టద్యుమ్నుని । స్యందనంబు గడిచీ
అత్యుగ్రంబుగ జుట్టుముట్టగా । నాచార్యుండపుడూ
ఉన్మత్తుని రీతిగ చెలరేగియు । నోహారి సాహారిగా
పాండవసేన గలంచుచుండనా । భారద్వాజునిపై
అప్పుడు ధృష్టద్యుమ్నుడు కన్నుల । నిప్పులు గురియుచునూ
నిశితాస్త్రంబులు శరగురుమేనను । నింపిధీరుడగుచూ
ద్రోణునిసేనగలంచు చుండెనా । ద్రుపదనందనుండూ
అంతటద్రోణుడు పదిబాణంబులు । నతనిమేనవేయూ
అడలకనన్నిటి మరలించుచుతా । నతిధీరుండగుచూ
కరితురగాళిని రథకేతనముల । నరుకుచుండునంతా
సౌబలుడతికుపితుండై వచ్చియు । సహదేవునిదాకీ
విశిఖచయంబుల సారథిద్రుంచియు । విరథునిగావింపా
సహదేవుడు విరథుండైగదగొని । శకునిపైనదరీ
సేనలపైవిసరిన యాబలములు । చెదిరిబారుచుండే
అదిగని శల్యుడు నవ్వుచు నకులుని । గదిసినొవ్వనేయూ
ఆతనికేతనమూత పత్రమును । నవనీడొల్లనేసీ
సారథిద్రుంచియు విరథుజేయగా ॥ జనె మద్రేశుండూ
యుట్లాసైన్యము లొకరినొకరితో । విడిబడిపోరగనూ
తురగంబులు కేతనములు రథములు । శరచాపంబులునూ

కరులుసారథులు వీరలు నాయకులు। నొరగుచుండెధరనూ
కనుగొన ఘోరంబై యుండెను యని। కరిపురి పరిపాలా
అంత ధృష్టద్యుమ్నుడు సుశర్మమే। నమ్ములనొంచిననూ
ఆతండాతడు జత్రు దేశమును। నడలగొట్టినంతా
మత్స్యపాలుడాకర్ణుని డాకియు। మార్గణములువైవా
ఆరాధాత్మజుడాతని బలముల। నారసముల ముంపా
పౌరవు డభిమన్యుని మార్కొనియును। బాణంబులు నింపా
ఆసౌభద్రుడు గినిసి మార్గణము। లద్భుతముగ వేయా
రథకేతనసిత ఛత్రంబుల సా। రథుల గూల్చుచు డా
గనిసైంధవుడు కృపాణపాణియై। మనమునకుత్సించీ
అరదమునుండియు డిగ్గనురికి ప్రజ। నడలించుటగనియూ
అభిమన్యుడు రోషంబునురికియు। నతని సేనగూల్పా
సైంధవుడొక భల్లంబునగొట్టిన। సౌభద్రుండపుడూ
అతని సేనలను నతనిని వడి భ। ల్లంబులు ముంచిననూ
సింధుపురీశుడు బెదరి పారమన। సేనలు బెగడొందే
పాండవబలము నార్భిరెంతయొన। పారవారముగనూ

వచనము: —

అయ్యవసరంబున పాండవ బలంబులు సౌభద్రునిం బొగడు నెలుంగులు సింహనాదంబులు నింగిముట్ట నభిమన్యున కుల్లాసంబును నీకొడుకులకు రోసంబును జనియింపనతనిం బరివేష్టించిన నవ్విజయంబు సైరింపక నీ కొడుకు లతనిపై పటుశరంబులు గురియ నీ కుమార సంతతికి సంతసంబుగా శల్యుండుగదగొని యభిమన్యున కభిముఖుండై గవిసెననిన విని ధృతరాష్ట్రుండా సంజయున కిట్లనియె॥

(కీర్తన) బేగడ ఆదితాళం [తగునాజాలి]

వినిపింపుమా సంజయా। సమరగాధ ॥వి॥
వినిపింపుపాండవ। వీరులు కౌరవులు
ననికిదార్కొనియెట్లు। నడిచిరో యవలను ॥వి॥

యెవరెవ్వారెట్లు । నేపూన జెనగిరో
వివరించు మానేడు । వీరారణమూలోన ॥వి॥
వినియుంటె నిప్పటి । కిని జరుగు సమరాము
తనివీసనదూనాకు । వినవాలె హేహ్యము ॥వి॥
నరనందన మద్ర । నాధులకయ్యాము
తేరగెల్ల వివరింపు । తేటతెల్లముగాగ ॥వి॥
అరయచప్పిడి వున్న । యాఖ్యాచొదరినేలు
హాసుని సత్కారుణమున । యందెటులున్నదో ॥వి॥

వచనము—

యివ్విధంబున నడుగుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె
(కందార్థము)

మనుజేశసూతు డీల్గుట। గని మద్రవిభుండు రోషకలితుండై సా
ధనములకు మేటియాగద । గొనివచ్చెడు శల్యుగాంచి ।
కోయానియారొచ్చె
భీషణకారుడౌచు నెదిర్చి । జనవరయాతని । సైన్యములనుదూరి
వెనుకముందుగాన । కనుగొట్టుచుండెను ॥కో॥

వచనము—

అభిమన్యుండా మద్రనాథు సైన్యంబుల గలంచుచున్నంత

## రగడ

గని భీముడుకా్ౖరద్రాకృతితోడుత । గదచేతంగొనియూ
అతిరయమున వెడలియు సౌభద్రుని । కడ్డముగా జనియూ
వీరావేశుండై గద ద్రిప్పుచు । ఘోరావనిలోనా
కాలాంతకుడోయన నిల్చిననా । కదువలినందునునీ
శల్యుడు మారొ్కనె బలములార్వగను । సమరావనిలోనా
పోరిరి శల్యసమీరనందనులు । భూరిరోషములనూ
గదలవ్రేటులను చిత్రవిచిత్రము । గా విహరించుచునూ

గదాప్రహారణంబులద త్తనువుల । గాయంబులనుండీ
శోణితధారలుగురియుచుండ గా । శూలులువిడవకనూ
తనువులయాసలుపీడిగదల చే । దర్పంబులబోరా
తనువులుజెదరియు కండలు రక్తము । ధరణిదొరగుచుండా
యిరువురుతరుచుగబోరిపోరి స । త్వరనుస్పృహలుదప్పి
పడిరాయిర్వురు సంగరభూమిని । పడినవారిగాంచీ
కృతవర్మ డువచ్చియు మద్రేశుని । గృచ్చిపట్టియెత్తీ
సమరములోనుండక దొలగించుక । జనినయంతలోనా
భీముడుదెలివందియుధీరుండై । బిగ్గరపి చియునూ
గదసారించుచు నిలిచియుండెనట । గంభీరోన్నతుడై
యుండునంతనీకొడుకులు మనముల । రోార్వనికోపములా
శస్త్రాస్త్రంబులు వేయుచు బాదివిన । సక్రోధంబుననూ
కవలగూడుకొని కౌరవబలముల । గదిసినారసములా
గొట్టుచుచీకాకొనరించుచుమరి । కోయునియూడ్చుచునూ
సకలబలంబులపాయగొట్ట గా । సమసిరికొందరునూ
అట్టితరిని నపరాహ్ణంబగుటయు । నాసేనలలోనా
సకలవాద్యములు మ్రోయుచుండగా । సమయంబునగురుడూ
పాండవసేనా సంరంభమునకు । బలములుదెరలుటయూ
గని కోపావేశుండై బలు వి । క్రమమునకుంభజుడూ
వెరపునజనుసేనల నదలించుచు । వెనుమరలించియునూ
తూణీరముబిగియించి వేట్కవిలు । బాణంబులుబూనీ
నారిమ్రోసిత త్సారధిగనుగొని । యతనికిట్టులనియే

వచనము—

మరియుశరగురుండిట్లనియె॥

(కీర్తన ॥ ఆరభి ॥ ఆది ॥

కంటివేసారధి । కౌరవసేనల ॥కం॥
వెంటనంటి పాండవులుదరుముటయు ॥కం॥

కంటునూనిధర్మజుడు రథికుడై । యంటివచ్చెనుద్దండతయాతని
వెంటవచ్చుచతురంగబలంబుల । కంటకశరముల । గర్వంబణచెద॥గం॥
చలముమెరయభీముడుపాంచాలురు
సాత్యకియును మత్స్యాధినాథుడును
తలపగవారల । తనయులొక్కమొగి
కలనికిజనలెక్ఖసేయువాడనె ॥గం॥
నరుడుజాపధరుడైవచ్చిన నా
వెరవు బాహుబలముజూపుటరుదా
నరయగనుల్చి పురీశుడైన శం
కరుడొచ్చిన భయమందు వాడనే ॥గం॥

వ చ న ము—

ద్రోణాచార్యం డిట్లనుచున్నవిని సూతుండు

## ర గ డ

ఆచార్యుండాడిన వాక్యంబుల । కాత్మబొంగిమరియూ
సారధికడుధీరుండైవేగమె । తేరుబరిపినంతా
గనిధర్మజుడెదిరించి మార్కొనిన । గనితత్సైనికులూ
గని యుధిష్టిరుని తేరుగడిచియుట । కయ్యమునకు జొరగా
శరగురుడుద్ధురలీలసేనలను । దరిమిగొట్టిమరియూ
మార్గణములుసంధించిగొట్టెనా । మనుజాధిపుమేనా
దాకినంతధర్మజుడు కోపమున । తచ్ఛరములుద్రుంచీ
తోనశస్త్రాస్త్రంబులముంచిన । ద్రోణాచార్యుండూ
ఒకభల్లమునధర్మజుచాపం । బొయ్యననరికియునూ
ఆత్మలోనసంకల్పముచేతను । నతనిబట్టగదియా
ధర్మనందనునిచక్రరక్షకులు । ధైర్యసాహసములా
కడలికిచెలియలికట్టతెరంగున । గడగినిలువరించీ
శితశరములుశరగురుని వక్షమున । చెచ్చెరగీలింపా

పాంచాలవరుశ్లాఘించిరియా । పాండవ బలమెల్లా
అప్పుడు యాప్పులునింగిముట్టనా । యవనీసురుడంతా
కనలునసుకుమారుని కాంచనపుం । ఖంబులచేగొట్టీ
తరిమివేసి వీరావేశంబున । ధర్మజునింగదియా
అదిగనిపాండవ యోధులొక్కమొగి । నద్భుతరోషము లా
వెడలి ధర్మజుని ముందుకజొచ్చియు । విశిఖపరంపరలా
జట్టుముట్టగా ద్రోణాచార్యుం । డట్టహాసమునమా
బలములపై చెలరేగియు నకులుని । బాణపంచకమునా
స్రుక్కించియు సహదేవుని నేడిట । చొక్కగొట్టిమరియా
నవనారసముల మత్స్యాధీశుని । నడరించియువేగా
సాత్యకినేపును మాయించెనునట । సప్తసాయకములా
మార్గణత్రయముల ద్రౌపదేయులను । మరలించియునపుడూ
వింశతిరముల నుత్తమౌజుని । హృదయచలముమాన్పి
పదిరెండమ్ముల పాండవాగ్రజుని । బడల్పడగనేసీ
వెంటశిఖండిని నిరునారమ్ముల । నేసిగలంచుచునూ
మరియుదారసీలు రథికులనెల్లను । మర్దించుచుగురుడూ
వాలికతూపులు ధర్మజుమేనను । దూలించుచునున్నా
గనియుగంధరుండడ్డపడిననా । జననాథునిజూచీ
నవ్వుచు వైకొని నొకనారసమున । నతని డొల్లనేయా
అట్టి తరిని కేకయపాంచాలురు । నతని జ్ఞాతులైనా
సింహసేనుడా వ్యాఘ్రదత్తుడును । చెలగు తక్కబలమూ
బాహుబలంబుల శస్త్రాచార్యుని । పైగమ్మినయంతా
వ్యాఘ్రదత్తుడాసింహసేనులతి । శీఘ్రంబునగదిసీ
శాతశరంబులగొట్టి నంతనా । శరగురుండుగినిసీ
లోచనముల గెంపొదవగదిసియా । లోన గారవులకూ
చిత్తమురంజిల వ్యాఘ్రదత్తసింహ । సేనుల నిర్వురనూ
కుండలములతో రెండుశిరంబులు । గూలనేసె ధరనూ
తక్కటిరథికుల యోధుల నెల్లర । జిక్కువడగజేసీ

పురుషవరేణ్యుడు గర్వోద్రేకం । బున ధర్మజు బొదివీ
పట్టుటకై యంకించుచున్న మన । బలములుగనుగొనియూ

వ చ న ము—

మనసేనలు సమరంబు జాలించి నిలిచి గుంపులుగట్టి వకరితో
నొకరు జెప్పుకొను చుండిరెట్లనిన॥

(కీర్తన) మోహన [చాపుతాళం]

అల్లదె గనుడీ ధర్మజుండు పట్టుబడియె ॥న॥
ఫుల్లము రంజిల్ల గురుం । డల్లన తన స్యందనమును
చల్లగదోలుచు యావిభు । జాడనేగుచున్న వాడు ।అ॥
యింతయేల సాయకగురు । డిపుడుబట్టి యిచ్చెనేని
పంతము నెరవేరెననుచు । పరుగిడజే తండ్రి కడకు ॥అ॥
మరలనేమి జేయునోయీ । మానవేసు నీ కురుపతి
పెనువక పదిరెండేడులు । దగుమునేము కానలకును॥
యిలను నుల్చిపురిని వెలయు । యిందుధరుని కరుణయెటుల
గలుగునో యీకురుపతిపై । తెలియరాదు హేంష్యంబును ॥అ॥

వ చ న ము—

సైన్యంబు లిట్లనుకొనుచు సంభ్రమాయత్తచిత్తులై యున్నంత॥

## రగడ

అప్పుడురథకాంతులు నల్దిశలను । నంబరమునగప్ప
గాండీవ కపికేతన కాంతులు । కనులకుభ్రమగొల్పా
బాణజ్వాలలు నభముగప్పగా । పాండవమధ్యముడూ
సింజినిటంకారము జేసినది । క్సింధురములు నొరగే
దర్పోజ్వలుడైవచ్చి యర్జునుడు । దాకెనుశరగురునీ
కుంభజుదాకిన యంతలోనగని । కురుపతిసైన్యములూ
ద్రోణాచార్యులకును బాసటయై । దోతెంచిరి వేగా

వచ్చినసేనలు జుట్టుముట్టవి । వ్వచ్చుచుకోపమునా
గాండీవధ్వనిదిక్కులునిండగ । కదువడిమ్రోయించీ
అవ్వీరుడు ఘోరాకారుండై । నఖిలశస్త్రసమితీ
పగరసైన్యములపైబరపించియు । బడల్పడగగొట్టా
శిరములుబగిలియు మేదోమాంసము । చిందిపడుచునుండా
పంకంబైసమరావనినిండిన ఫల్గునుండు వికశా
పక్కలుచెక్కులుడొక్కలు నరికెను । పగరసైన్యములనూ
కొందరినెమ్ములు చూర్ణంబగునటు । గొట్టుచుండెనరుడూ
అప్పుడేరులైబారెరక్తమూ । యవనితలంబెల్లా
యెవరికైన గనరాదా ఘోరము । యిభపురిపరిపాలా
అట్టిసమయమున భానుడు గ్రుంకిన । నంధకారమయ్యే
యెదిరిబలంబులు తమబలంబులని । నెఱుగరాకయున్నా
గని దుర్యోధనద్రోణాచార్యులు । కయ్యముజాలించీ
సేనల డివియించిన శిబిరములకు । జేరబోవుచున్నా
స్థిరుడైపార్థుడు జయతూర్యంబులు । సేనల్మ్రోయించీ
నిడియించిన తమసేనలెల్ల తమ । విడిదలకుంజనిరీ
రెండుదెరంగులవారు శిబిరముల । నుండెకౌరవేశా
పాండవులారాతిరి సంతసములనుండిరి భూపాలా

వ చ న ము—

ఆనాటిరాత్రినంతయు యథోచిత వ్యాపారములనుండి రాత్రిచనిన మరునటిదిన సూర్యోదయంబున నుభయబలంబులు నేపుసంగదవిరణ సన్నాహంబుల బయలుదేరుచున్న సమయంబున లజ్జావిషాదంబులు మనంబునం దోప ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె॥

(కీర్తన) శేఘష్టిరాగం [అటతాళం]

జనవరమునుసీతో । జెప్పగ లేదే ॥జ॥
అనిలోనరుడుండునపు । డాధర్మజుజిక్కడని ॥జ॥
పాండవాగ్రనందను । బట్టుటకు నర్జునుడు

భండనముఃలోనలే । కుండినను సాధ్యమగు ॥జ॥
నరుడులేనట్టి తరి । సురలడ్డమువచ్చినను
దుర్గమున యుధిష్టిరుని । తరిమి పట్టెదనని ॥జ॥

వచనము—

మరియు ద్రోణాచార్యంశా దుర్యోధనున కిట్లనియె॥

## రగడ

యిదియునుగాక మరియొక్కటి దెల్పెద । వినుమురాజరాజా
నరుడులేని చోవేవురుమార్కొన । దురమున గూల్చెదనూ
పాండవాగ్రజుడు నని వెన్నిచ్చియు ! బారకుండెనేనీ
నాచే జిక్కెనటంచు దలంచుము । నరవర యీవేళా
అది కాకుండిన బారజొచ్చినను । యదియు కొంతమేలూ
అనియిటు శరగురుడాడుచున్న విని । యాసుశర్మవేగా
తొందరపాటున లేచి బల్కెయా । దుర్యోధనుతోడా
మనుజనాధనరుడెప్పుడు మమ్మావ । మానించుచు నుండూ
ఆతనిపై మాకెప్పుడు కోపం । బగ్గలమోరాజా
మానసమందున యాతని మార్కొన । బూనియుందుమెపుడూ
బాసయిచ్చితిని నర్జునుబోరగ । పార్థివ వరతనయా
ఆజ్ఞయొసంగిన సమరంబుననే । నర్జునుతో గదిసీ
యిచ్చటపోరున బాపికొంచునే । నచ్చటికేగదనూ
అని త్రిగర్తపతి బల్కుచుండగా । నాతని సోదరులూ
అందర మొకమొత్తముగా బోరెద । మనుచు వెడలినంతా
పదివేవురు దొరలెల్ల గడంగిరి । బంధుసహితముగనూ
అఖిల దేశనాయకులు రథోత్తము । లందరు గడగియునూ
పంతము లాడుచు నుబ్బునబొంగిరి । యంతరంగములనూ
అర్జును ననిలో జంపకున్న మే । మందరమొక్కటనూ
గోవధ మొనరించిన పాతకమున । బోవువారమునుచూ
శపథంబులు గావించి రణమునకు । సంసిద్ధత నున్నా

సంశప్తకులు ననేకబలంబులు । సమరమునకు వెడలా
కురుపతి యానందంబున నుండగ । శరధనుర్గురుండూ
సన్నుతశీలుడు గరుడవ్యూహము । సమకట్టియు నతడూ
దానికి ముందుగ చంచువుగాగను । బూని నిలిచియుండా
కురుపతి తనతమ్ములతో గూడుక । శిరముగాగనిలిచే
కడువడి కృపకృతవర్మ లిద్దరును । కన్నులుగా నిలిచే
కేరళ సింహాళదేశాధీశులు । కేకయనృపవరులూ
కంఠముగా నిలిచిరి వారందరు । కడుధీరత్వములా
భూరిశ్రవబాహ్లీక శల్యులతి । భూరిప్రతాపములా
వలపలి పక్షముగాగ నిలిచిరతి । చలములు బూనియునూ
అశ్వద్ధామ సుదక్షుణులాదిగ । నటదాపటనిల్చె
మాగధయంబిష్టక కాళింగులు । మరివెన్ను ననిలిచే
సర్వసేనసహితుండై కర్ణుడు । గర్వోద్రేకమునా
పృచ్ఛంబుగనిలిచినగని తక్కిన । పృథివీపతులెల్లా
అచ్చటచ్చటను నిలిచినంతగని । యాచార్యుండపుడూ
సంతోషంబుననుండునప్పు డట । సకలకౌరవులునూ
పౌరుషములనమరావని నిలిచిన । భగదత్తుండపుడూ
గజారూఢుడై మధ్యభాగమున । కయ్యమునకు నిలిచే

వచనము—

ఇట్లుభగదత్తుండు గజారూఢుండై మధ్యప్రదేశంబున నుదయాచలంబున వెలుంగుభానుండునుంబోలె దేజరిల్లుచుండెనంత నక్కడ త్రిగర్తాదులు పాండవసేన దక్షిణదిక్కున కుంజనిసవ్యసాచింగని సమరంబునకు దోలంగ బిలుచుచున్న త్రిగర్తాదులంగని పాండవమధ్యముం డన్న కిట్లనియె॥

కీర్తన ॥ మధ్యమావతి ॥ ఆట ॥ (తమ్ములారా)

జాగరూకతతోడ మెలగుము । సమరమందున నగ్రజా
ఆగమాదివిదుండుశరగురు । డమితశౌర్యప్రతాపుడూ ॥జా॥

అల్ల త్రిగర్తాధిపుడు నాతని । యనుజులందరుగూడియూ
కలనికిని ననురమ్మటంచును । బిలుచుచుండిరి ధర్మజా ॥జా॥
పగరబిలిచిన నీమొగంగని । వాని తెరువుననుండగా
మగతనంబేరాజులకు నిల । మార్కొనగ శలవొసగుమా ॥జా॥
సరసచప్పిడి పున్నయాఖ్యా । చోదరిని రక్షించెడీ
హారునికృపమనపైనయుండగ । వెరపువలదిక ధర్మజా ॥జా॥
వచనము—

అర్జునుం డివ్విధంబున బల్కుటవిని ధర్మజుండతని కిట్లనియె॥

# రగడ

చాపాచార్యుని బలశౌర్యంబులు । సాహససంపదయూ
మనమెరింగియున్నాముగదా యా । మాన్యుని పూనికనూ
యేవిధినైనను బొంకుసేయవలె । నేమియుపాయంబో
తలపోయుము కార్యంబెయ్యదియో । ధనంజయా యనినా
అన్నా భయపడవలదు గురుసకై । యది యెట్లంటే నీ
పిలిచినరణమున కేగకుండుటను । బీదతనముగాదా
లోకముమెచ్చగ నరివధకై నే । నేకరథస్థుడనై
బోయెదనిట పాంచాలనందనుడు । భూరిపరాక్రముడూ
సత్యజిత్తునిను రక్షణసేయగ । జాలినధీరుండూ
యీతడుండు నంతకు సమరంబున । వెరపు జెందవలదూ
పగతురచే నీతడు బడెనేనియు । పాండవాగ్రతనయా
క్షయ్యమందు నిలువక జనవలయును । కడు వేగంబుననూ
అని దెల్పిన విని సంతసింపగా । నమరేశ్వర సుతుడూ
అగ్రజునకు కడు భక్తి ప్రమొక్కగా । ధర్మజు డపుడూ
ఆశీర్వాదము జేసినంత తా । నతి సంతోషమునా
అన్నయానతిని గైకొని పగ వా । రున్న యెడకు జనియే
అర్జునుండు ధర్మాత్మజు విడిచియు । నట త్రిగర్తబలమూ
చేరబోయినంతనె యిచ్చట మన । సేనలుగనియుచ్చే

అది యంతయు దెలుసుక కౌంతేయుం । డాతుర భావమునా
ధృష్టద్యుమ్నుని గని యిట్లనియెను । ధీరవరానేడూ
గరుడ వ్యూహము బన్నుక నిలిచిరి । కౌరవులీవేళా
అందుకు సమముగ నుండ లార్థ వ్యూ । హంబన్నుమయ్యా
విని ద్రుపదాత్మజు డట్లొనర్చగా । వివిధ బలముగనియూ
గాఢతరంబగు సన్నాహంబుల । కయ్యమునకు గదిసీ
శంఖభేరి కాహళ తూర్యంబులు । సరభసమున మ్రోయా
వుభయబలంబులు మార్కొన దలచిన । యుద్రేకము గాంచీ
కౌంతేయాగ్రజు డా ద్రుపదాత్మజు । గనుగొని యిట్లనియే
పాంచాలాత్మజు గురుల ప్రతాపము । బాగుగ గాంచితిరే
గావున నాతనిచేత జిక్కకను । గాపాడగవలయూ
శరవేగంబున నాతని మగటిమి । సమయింపగ వలయూ
శమననందనుం డిట్లు బల్కగా । సత్యజిత్తుండనియే

వ చ న ము.—

ధర్మనందనా భయంబు జెందవలదు నే దెల్పునది వినుమని యిట్లనియే

(శ్రీరాగం) [ఆదితాళం]

ధర్మనందనా । దెల్పెద వినుమయ్యా ॥ధ॥
నిర్మలాత్మ నీ । ధర్మమే గాపాడగలదు ॥ధ॥
శరగురుండు నిను । జేరవచ్చినను । ధరణీవరనే జిక్కనిత్తునే
నరుడు జెప్పిపోయినట్టి మాటలు । మరతుననుచు నెంచబోకుమది॥ధ॥
నిన్నుగడియు నంతశక్తిగలదే । నీరజారి వంశోత్తమయతనికి
నన్నుగెలువ జాలునె ద్రోణుండని । నామాటలు నమ్మిమునిక్కము్గ ॥ధ॥
యింతయేల చప్పెడి పున్నయ్య క । నంత శిరుల నొసగి బ్రోచుగౌరీ
కాంతుని కృపని మేనగల్గయే । చింతలేదు నినుమంతయైన ॥ధ॥

వచనము—

ఇట్లు సత్యజిత్తు ధర్మజునకు ధైర్యంబు గరపుచున్న విని ధృష్ట ద్యుమ్నుండు

## రగడ

పారావతవర్ణాశ్వంబులుఁ గల । తేరుఁ బూన్చుకొనియూ
అతిరథుఁడగు ధృష్టద్యుమ్నుండ పు । డాగ్రహమున గదిసీ
వడయుఁడు ద్రోణాచార్యున కెదురుగ । నడచుచుండుటయునూ
ధృష్టద్యుమ్నుని దరిశనమునను య । శిష్టంబని దలచీ
వానిమోహముగాంచుటకు విన్ననై । భారద్వాజుండూ
ఆతని దిక్కునజూడజాలకను । నచ్చటగ్రేడించీ
పాంచాలసైన్యంబుల జొచ్చియు । పరవళ్ళను జూచీ
శరపరంపరల బలములనెల్లను । నురుమాడుచునుండా
అచ్చుటనరుడు త్రిగర్తులంబుల । నతిశయమీక్షించీ
ఆకలిగొను కేసరి హరిణంబుల । మూకజొచ్చి నటురా
సంశప్తకబలములపైజొచ్చియు । సవ్యసాచి యపుడూ
కోపంబున రెండేసి సాయకము । వేపునసంధింపా
కంజాక్షునికో నిట్లనిబల్కెను । గంటివె యెదువర్యా
ఆత్రిగర్తవిటసర్థ చంద్రవ్యూ । హంబు బన్నుకొనియూ
మోహరించియున్నారా బలములు । ముందువెనక గనకా
వీరుద్రొవ్వి సమరమునకురమ్మని । వేడిరి నన్నకటా
అనుచు సేనలను గదియనడచి నరు । డద్భుతవేగమునా
దేవదత్తమును బూరించిన నా । దివ్యనినాదంబూ
భువియాకాశమునిండి దిక్కులను । భోరుకొలుపునంతా
ఆనినదమువిని పగర బలంబులు । మానసముల నదరీ
గుండెలుజెదరియు మూర్ఛంగూరియు । కొంతదడవునకునూ
ఆరవమణగిన మూర్ఛదేరియు । నాసంశప్తకులూ
ఒకరినొకరు బురికొల్పుకబలములు । నొక్కపెట్టునడలీ
పటుగతిశరములు బరగించి ననా । ఫల్గునుండుగని యూ

దవ్వులనుండిన సంశప్తకులను । తరిమి తరిమి గదిసీ
పదియునైదువేల్లరిధములవారిని । కదనంబునగూల్చా
తక్కినబలములు పెలుచనీడరి యా । ధనంజయునిదాకీ
ఒక్కొక్కరు పదిపదిబాణంబుల । చొక్కించిన యంతా
అర్జునుండు మూడేసిశరంబుల । నందరి నృక్కింపా
సంశప్తకులైదేసి శరంబులు । సంధించిననరుడూ
కోపంబున రెండేసి సాయకము । వేపుననసంధింపా
అట్టితరిని సుబాహుండనువా । డట్టహాసమునను
పార్థుకిరీటముపై శితశరములు । పదిబరపినయంతా
నరుడనేక శరములు వారలపై । బరగించిన యపుడూ
అలసుశర్మసురథాదులు బాసట । యైన రుదాకిననూ
గనికిరీటి వారలకేతనములు । ఖండించియు మరియూ
ఆ సుధన్వాహ్వయచాపశరంబుల । నవని డొల్లనేసీ
దివ్యశరంబుల నాతని శిరమును । తీవ్రత ఖండించీ
అరదంబుల గమికురికి రెండు వే । ల రదంబుల గూల్చి
పగరబలంబులు గుంపులు గ । ట్టుక బారజొచ్చి వారూ
కురుపతి సైన్యంబుల కడకేగిరి । వెరపు జెందివారూ
సేనలు భయమున బరులిడుటయు గని । చిత్తంబున నడలీ
అత్తరి బోవలదని సుశర్మ వెలు । గెత్తి కేకలిడుచూ

వ చ న ము—

అంత నా త్రిగర్తాధీశ్వరుం డుభయ భ్రాంతులై గుంపులుగట్టి పోవు చున్న సేనలం గని యిట్లనియె

ముఖారి రాగం [అటతాళం] (వలదుతా)

వెరపుజెందగా । నేల సైనికులారా
దురమునను పౌరుషములను దిగ । ద్రోచిపోవుట రాజధర్మమె ॥వె॥
నరునికోల్తలా । నెరుగారే యెన్నడూ
మరచితిరె కురువిభునిశోనా । డరసిపల్కిన పంతములనూ ॥వె॥
మరలిపోయిన । మనకూ బ్రతుకుగలదే

స్థిరులమై మనతనువులను న । గ్గింపపలదే కయ్యమందున ॥వె॥
వులిచిపురమునా । వెలయుశంకరు కరుణా
గలిగియుండినమనకు భయమే । వలను గలుగదు కలనికింతా ॥వె॥

వ చ న ము —

త్రిగర్తాధీశ్వరుం డిట్లనుచున్న విని సైన్యంబులు మరలివచ్చి నారాయణ గోపాలురెక్కడెక్కడయని వారింగూడిన గని పార్థుండా నారాయణున కిట్లనియె॥

## రగడ

పంకజనాభ త్రిగర్తల తనువుల । ప్రాణములుండగనూ
రాకయుందురే సమరమునకు వీ । రా వేశంబులనూ
వారలనిప్పుడు నుకుమాడియు పో । వలదెగానలోలా
మనరథమటు బోవగనిమ్మిప్పుడు । మాధవయనినంతా
నరుని వీక్షణం బెక్కడనుండి నో । నక్కడికా రథమూ
రథికావళిపైబరుముచుండెనా । రాజీవాక్షుండూ
ఆలోననగని నారాయణ గో । పాలురు కోపమునా
అందరొక్కమొత్తముౖలై జాపము । లందుకొనియువేగా
నరనరాయణు లిరువురితనువుల నానాస్త్రము లేయా
గని ఫల్గునుడట దేవగత్తమును । కడువడి బూరించీ
బ్రహ్మాదత్తమైనట్టి మహాస్త్రము । ప్రయోగించినంతా
ఆమహిమను సంశప్తక బలములు । నని గూలుచునుండా
తక్కిన బలములు నర్జును పైపడి । తరిమి కొట్టుచుండా
అట్టహాసమున విజృంభించియు । నా త్రిగర్తబలమూ
నుకుమాడుచునుండగ సంశప్తకు । లురువడి మొత్తమురై
పార్థు తేరి పై జుట్టుముట్టి రథి । బాహుగర్వములనూ
వాహనంబులను కపి కేతనమును । వారిజాక్షు తనువూ
నిండగశరములు గుచ్చి నార్పులను । నింగి ముట్టజేసీ
హరినరులకు జేయార్పకుండగను । నందరు మూగియునూ
పెరయీగలు ముసరిన చందంబున । హరినరులను జుట్టా

అప్పుడు సంశప్తక సైన్యంబులు । నాహావంబులోనా
అర్జునుడా హరిగానకుండుటకు । నాహాకారములా
మడిసిరి తేగిరా కృష్ణులర్యరని । మ్రగ్గిరనుచు వారూ
సంతోషంబున సింహనాదములు । సల్పుచుండునంతా
భేరిపటహ ఢక్కాతూర్యంబులు । భోరున మ్రోయగనూ
అట్టిసమయమున పార్థునిగానక । నంబుజోదరుండూ
యేమైతివో ప్రాణానముంటివో । యింద్రదాత్మజనీవూ
నీజాడనుగన రాకున్నది యిపుడే । జాడరిగితివో
విజయా నీవెచటున్నవాడవో । వెలుగుజూపుమనుచూ
కేకలు వేసిన హరివాక్యములను । క్రీడిగ్రహించియునూ
వాతూలహతిచదల మేఘములు । బాయుచందమునను
అనిలాస్త్రంబువ సంశప్తకబల । మడలగొట్టినంతా
నలుదిశలకు బారెను సైన్యంబులు । నానావిధగతులా
అంతట కృష్ణుడు మెచ్చుచుండగని ॥ యర్జునుండునడిగా
సేనలపైబడి శస్త్రాస్త్రంబుల । శిరముల నురములనూ
కరచరణంబులు నరుకుచుచుండె నా । కదనభూమి బడగా
కరితురగంబుల యోధులరథముల । దొరగజేయుచుండా
ఘోరభంగియై గనుపించెను రణ । ధారుణి నెల్లెడలా
యీవిధిపగతుర గూల్చికూల్చి యా । బావయుమురదియునూ
స్థిరులైయుండగ నచ్చట ధర్మజు । సేనలెల్లదలకా
ద్రోణాచార్యుడు దుర్ముఖుండు కడు । దోర్బలమున గదిసీ
అలధృష్టద్యుమ్నునిపై దలపడి । రద్భుతసాహసులై
అంతకౌరవులు పాంచాలాదులు । నగ్గలికలగదిసీ
పోరుచుండిరతి బంధురంబుగా । భూపతిమెచ్చగనూ
యిరువాగుల చతురంగబలంబులు । విడుకబోరగనూ
పదఘట్టనలను లేచు ధూళియం । బరమున గప్పగనూ
వుభయసైన్యములు నొకరినొకరు బల్ । నుద్దండశబోరా
శరవ్రేటుల బడు కరితండంబులు । తురగసమూహములూ

రథచయములు భటసందోహంబులు । రణభూమిని బడియే
య్యుర్విధి చతురసగంబులు దెగుటయు । నెరిగి శరగురుండూ
సేనల కుందల కడచి యుగ్రుడై । శీఘ్రమె జనుదెంచీ
తరిమి ధర్మజుని గదిసినంత నా । తడు కుపితాత్ముడై
శరనికరంబుల గొట్టినంత గని । గురుడు కోపముననూ
వాలిక తూపులు బరపినంత పాం । చాల సుతుడు గనియూ

వచనము——

అంత ద్రుపదాత్మజుండగు సత్యజిత్తు రోషావేశుండై ద్రోణాచార్యున కిట్లనియె

(మధ్యమావతి) ఆటతాళం [యిదిరోమన్యా]

నిలు నిలు నిలు నిలుమా । ద్రోణాచార్య ॥ని॥
నిలు నిలు నిలుమింక । నే వచ్చుచున్నాడ । కలనిలో ధర్మజుని గదిసి పట్టగ దలచి
చలము చేవలు రీతులను ని । టలుగులను సమయించుచుంటివి
దెలియవో నే సత్యజిత్తును । దొలగవలదిక దుర్బలుడవై ॥ని॥
నరుడిట లేడనియూ । నీ శపథము । నెర వేర్పదలచినావో
పెరయాస లేలను । విరమించుకొను మీవు
కురుపతికి నొసగిన । వరము సాగుటకల్ల
దురములో నొంటరిగ ధర్మజు । దరయు నాచే జిక్కనని మది
పరమ సంతోషాన్వితుడవై । బట్టనగునా నేను గలుగగ ॥ని॥
శరగురునను కొంటివో । నీ చూట్కికి । పరీవహాలసిదోచెనో
ధరనునుల్చి పురిని సు । స్థిరముగ వెలసియు
అరయచప్పిడిపున్న । యాఖ్య చొదరినేలు
హరుని సత్కృపగలుగ మాకే । పెరపు గలుగదు ధర్మజుని నే
తెరపునను జిక్కించుకొన నీ । యరదమును నిటుబరపుచుంటివి ॥ని॥

వచనము——

యిట్లా సత్యజిత్తు బీరంబులాడుట విని చాపాచార్యుండు

# రగడ

సత్యజిత్తు బీరములాడుట విని । సాయక గురువరుడూ
క్రోధమానసుండై తన కరమున । కోదండము బూనీ
సింజిని టంకార ధ్వని జేసియు । శితసాయకములనూ
ధీరుండై సంధించి విడువనవి । తీవ్రముగా జనియూ
సత్యజిత్తుధనువల్లన నరికిన । సమరధరణి బడియె
చాపము రెండగుటను మరియొక ఘన । చాపముగైకొనియూ
క్రూరభల్లముల ద్రోణాచార్యుని । గొట్టెముప్పదింటా
అంతవృకుండను పాంచాలాత్మజు । డతనికి దోడ్పడియూ
అరువదిశరములు గొట్టినంతగని । శరకోవిదుడపుడూ
అపుడాకుంభజు డాగ్రహమునవృకు । నవనిడొల్లనేసీ
సత్యజిత్తు సారథిని హయంబుల । సమరభూమిగూర్చి
అతనిచేతిధనువల్లన ద్రుంచియు । క్షితినింబడవైవా
ఆవీరుండునవేకవిండ్లుగొన । నన్నిటిద్రుంచియునూ
అర్ధచంద్రబాణంబు నమస్తక । మవనిడొల్లనే యా
గురుకోల్తలకోర్వక ధర్మాత్మజు । డరదమువాహములా
మరలించుక జనుచుండగగని శర । గరుడట వేనుకొనియూ
తరుముచుండగని పాండవసేనలు । శరగురుమార్కొనియూ
బలములపైజోరబారి దూది తి । ట్టలనునగ్నిగ్రాకీ
క్రుగ్గించెడిగతి పాండవసేనల । క్రుగజేయుచున్నా
రక్తమేరులైబారుచుండెనా । రణమున భూపాలా
అప్పుడు ధర్మజుబట్టుకొనగ గురు । డప్పళించు వేళా
గనుగొనివసుధానుండు శిఖండియు । గలరా జన్యులునూ
మార్కొనివారైదైదు శరము లా । మాన్యునిపై వేయా
క్షత్రధర్మసాత్యకు లిర్వురు బల్ । సాహసములగదిసీ
నూటయిర్వదమ్ముల పదిశరముల । నొప్పించిన యంతా
అయ్యుధిష్ఠిరుడు మరలి ధృష్టద్యు । మ్నాదులతోగలిసీ
పదిరెండలుగుల నొప్పించిన నా । భారద్వాజుండూ
కన్నులనగ్నికణంబులు గ్రాలగ । కౌంతేయునిజూచీ

వెంటనె పాండవవీరులందరా । వీరునిగవియుగనూ
అలిగిద్రోణుడాధికవనులపై । చలమున ధుమికియునూ
క్రూరశరంబున వసుధానుని రణ । ధారుణిబడగూల్చె
తక్కరధికులను సితసాయకముల । నొక్కగొట్టినంతా
గని కౌంతేయుని రధమును మరల్చక । జనియె కలనిదాలగి
ధర్మజుగని ధృష్టద్యుమ్నాదులు । దలగిచనిరి ననికీ
అని చెప్పినవిని సంతోషాన్వితు । డై ధృతరాష్ట్రుండూ
సంజయు ద్రోణాచార్యుని చేర్చిన । సాహసమున కెవడూ
సైరించెడివీరుడు లేడయ్యెనే । సమరభూమిలోనా
అనియడిగిన వైచిత్రవీర్యునకు । నాసంజయుడనియే

వచనము:—

కురువరా కలంగిన కౌంతేయ సేనంగనుంగొని కలకల నవ్వుచు నీకొడుకా కర్ణునితో నిట్లనియే

(ఆరభిరాగం) ఆటతాళం [సారథి]

కంటివా । కయ్యంబు తెరగిట । కన్నులార ॥కం॥
కంటివా రాధాత్మజాయా । కంటకులు కౌంతేయ బలములు
జంటజంటలు గూడి బారెద । రొంటిరై జనుచుండె కొందరు ॥కం॥
ఘనుడు ద్రోణుని శరపరంపర । కడిమికిని నోర్వంగ జాలక
అనిల వేగంబునకు గూలిన । వనము తీరున గూలె సేనలు ॥కం॥
అదియె గనుమా భీమసేను । డదరదమున నేకాంగివై బల
మదమునను తమవారెవ్వరు । నదమున లేకున్న వాడదే ॥కం॥
కురుబలంబులు నొక్కపైన । ంగరమునకు నత్యుగ్రభంగిని
తమముటను గని వాయుజుండదె । వెరపునను బరతెంచుచుండుట ॥కం॥
కయ్యమున నాచార్యుంకోల్తల । కడిమి కోర్వగలేక ధర్మజు
డియ్యెడను రాజ్యంబుపై భ్రమ । వీడి బరువిడుచుండె నాతని
ధరను నుల్చి పుకేశుడౌ శం । కరుని కరుణను ధరణి రాజ్యము
సిరియు గూడ లభించ గలదా । పిరికి పందలు పాండవులగతి ॥కం॥

వ చ న ము—

యివ్విధంబున దెల్పుచున్న దుర్యోధను వాక్యంబులు విని కర్ణుం డిట్లనియె

రగడ

కురువర భీముడు వెరపు జెందునను। కొంటివేమొగానీ
అరిభయంకరుం డద్భుతకాయుం। డమిత పరాక్రముడూ
తనువున ప్రాణములుండగ నోర్చునె। మనజయంబతండూ
పాండునందనులు విక్రమ శాలురు। బాహుబలులుసుమ్మా
కయ్యమునకు వెనుదీయువారలే। కౌంతేయులు మున్నూ
నీచే బడు పాట్లన్నియు మరువగ। నేర్తురే పాండవులూ
అనదల తీరున నెంతువేమొ నీ। మనమున కురుభూపా
గావువారలు యోధుల దోడ్కొని। కరువలినందనునీ
మున్నిడుకొని ద్రోణాచార్యునిపై। మూగక యుందురరే
గావున మనమీచాపాచార్యుని। గాపాడగవలయూ
లేకుండిన మనమోడుట నిశ్చయ। మోకురుభూపాలా
యేమోమాటము లేక జెప్పితిని। యిది నిక్కముురాజా
అని యిటు కర్ణుడు దుర్యోధనునకు। వినిపించెడి వేళా
అంచవర్ణ హయములబూన్చిన రథ। మందున ధర్మజుడూ
యిందుని భాశ్వంబులు బూన్చినరథ। మందున వాయుజుడూ
చిలకవర్ణతురంగములు బూన్చిన। తేరువనకులుండూ
మేఘవర్ణహరులను బూన్చిన రథ। మెక్కి మాద్రి సుతుడూ
వెడలిరి తమ తమ శిడములు మెరయగ। వీరావేశములా
పాంచాలమూత్స్యాది సాత్యకుల। బరువడి దోడ్కొనిచూ
సాయకగురుపై మూర్కొనిరందరు। సామజపురిపాలా

వ చ న ము —

భూవరా యిదియునుంగాక॥

పాండురాజు కుమారుల। బలము లెల్ల
గ[illegible]పై [illegible]బుదంబులు। గప్పుకరణి

కుంభజునిజుట్టు ముట్టిన । కురువరేణ్యా
మనబలంబుల దృష్టికి । మరుగువడిన

వచనము—

ఇట్లాయోధవీరులెల్లమూగిన ఆచార్యుండు గానరామికి గురుండు దెగియుననని మనసైన్యంబులు దిగులొంది యున్నయది॥

## రగడ

కురువరసీకొండు కలిమోదంబున । నరదమెక్కి గడగీ
సేనలకుంజేయివిచి బిలిచి త । త్సేన ముందు నిలిచీ
ధీరులైబలముల బురికొల్పియు । తీవ్రత నడిపించీ
వాయునందనుని మారొ్కనినంత నె । వారక సాత్యకినీ
దాకెను కృతవర్మయు నిట్లందను । దాకె నొకరినొకరూ
తలపడి కయ్యమొనర్చుచుండెనది । దలపనలవిగాదూ
అప్పుడు ద్రోణుని బరిమార్చెదమని । యలపాండవ బలమూ
కుంభజాగాపాడగ వలెనని ఘన । కురుబలంబులెల్లా
యిట్లియవాగులు దలపడిరప్పుడు । నిభపురిపతిపాలా
ఉక్కుమిగిలి నొకరొకరి రథంబులు । చెక్కలు జేయుచునూ
కేతనములు నిలగూల్చుచు తురగ । వ్రాతము నరుకుచునూ
సామజముల ధరడొల్లసేయుచును । సారథులనుగూల్చి
ఛత్రచామరంబులు పొడిజేయుచు । చాపంబులు విరిచీ
కత్తళంబులనుజించి తనువులను । నెత్తురులు [illegible]
సంగ్రామము ఘోరంబైగన్పడె । నాగపురిపాలా
అప్పటికిని మధ్యాహ్న[illegible] । యటనీశా వినుమా
అని దెల్పిన సంజయునితో ఈ కురు । జనవిభు డిట్లనియె
అచ్చట సంశప్తకబలములు నె । ట్లైరో దెల్పుమనినా
దేవా తదుపరి వినిపించెదనిట । తెరగును వినుమయ్యా
పాండవబలములు కౌరవరాజును । బడల్పడగజేయా
నొచ్చినంతగని యంగాధీశ్వరు । డచ్చ[illegible]

తనగజమును భీమునిపైద్రోలియు । తత్కాండంబులదే
నొప్పించినగని వాయునందనుడు । నుగ్రాకారుండై
దంతినిగూలగనేసిన యాతడు । ధరణికొరగినంతా
వానిశిరంబొకకోలను నరికిన । వ్రాలె రణస్థలినీ
అతనిపాటుగని భగదత్తుడు తా । నాగ్రహమున వెడలీ
కడువేగంబున సుప్రతీకమును । గజము నెక్కియతడూ
మారుతాత్మజునిడెరకు గొల్పనది । మదమెలరారగనూ
కనులకెంపుగదురగ శ్రవణంబులు । గక్కునక్కించీ
ఘీంకారముజేయుచు తుండమునుపై । కెత్తి యాగ్రహమునా
కాలుదండమూమున తుండమును । గగనంబునకెత్తీ
అతియాగ్రహమున ఘీంకరించుచును । నవనీస్థలిగదలా
పదఘట్టనజేయుచు రౌద్రంబున । పవనజుపైధుముకా
ధర్మరాజుసేనలు గని మనముల । తల్లడమందుచునూ
చంపె చంపె సామజము భీముననీ । సరగ కేకవేయా
ఆలకించి ధర్మజుడు మనంబున । యాతురతనుననియె

వచనము—

మరియు సేనలంగని ధర్మనందనుం డిట్లనియె॥

కీర్తన ॥ మోహన ॥ ఆది ॥ (సర్వమంగళ)

సైనికులారా యుపేక్షసేయుగా । సమయంబిదియా

వచనము—

ఇట్లు ధర్మజుండు సేనల హెచ్చరించి మరియు॥

## రగడ

సేనలబురికొల్పియు భగదత్తుని । సిలుగులగప్పిననూ
భగదత్తుండొక శూలంబున నా । పాండవబలములనూ
చెదరగొట్టి సామజమును ద్రోలగ । మదమున చెలరేగీ
గజముల తురగంబుల భటకోటుల । కడువడిజంపుచునూ

అరదంబుల సారథుల కేతనము । లవనిగూల్చుచుండా
గనిదశార్ణభూరమణు డుగ్రుడై । గజరాజము నెక్కి
వెడలిసుప్రతీకముపై దరిమిన । కడువడియా గజమూ
అతిరోషంబున మార్కొనినంతనె । నాదంతిద్వయమూ
రెక్కలుగల శైలంబుల భాతిని । నిక్కి బోరుచుండా
భగదత్తుని సామజము దశార్ణవ । పతిగజమునుబట్టి
తుండము తుండంబును పెనవేసి । యు ఖండబిలంబుగనూ
ఆతని గజమును సుప్రతీక మపు । డవని గూలనేయా
భగదత్తుండాతని జంపెను స ప్తశ । దోమరముఁ గనూ
అంత పాండవేయుల బలములపై । దంతినిగొలుప
సేనలడలుచుండగ గని సాత్యకి । సేనుగ కడ్డంబై
సూరవరుడు నారసమున గొట్టెన । సుప్రతీకమపుడూ
కనుగొన వెట్టగజేసి జిట్టుమని । కడువడి సాత్యకిపై
గదిసి తుండమున యరదము బట్టియు । గగనంబునకెత్తి
విసరివైచినంతనే సాత్యకి వే । వివిధ చిత్రగతులా
అనువుల దెప్పించుక ధుమికెను తా । నవనికి మెల్లగనూ
సుప్రతీకమవు డల్లన సేనల । జొచ్చికలాచుచుండే
సాత్యకి యపుడు తురంగ సారథుల । చక్కజేసుకొనియూ
రథమునెక్కి వచ్చుట గని భీముడు । రయమున మార్కొనినా
దంతిరోషమున తుండము జాచియు । ధర్మజు సైన్యములా
తురగ వ్రాతంబుల భటకోటుల । ధరగూల్చుచు నుండా
గని సుపర్వుడడ్డము జని గరిచే । ననిగూలినయంతా
ఆ సుపర్వుపాటెరిగి రోషమున । నా సౌభద్రుండూ
ద్రౌపదేయులును ధృష్టకేతుచేతి । తా నడుమొదలైనా
వీరులు దలపడి గజరాజముపై । కూరిగశరములేయూ
దంతియమిత కోపంబున వారల । దరిమి పదంబులచే
మర్దించుచు సారథు లశ్వంబుల । మరియు శతాంగములా

నురుమాడుచు నుండగ సౌభద్రుడు । వెరపు సుంతలేకా
యిభము నెదుర్కొని బాణాసనములు । నింపినంతలోనా
భగదత్తుడుగని గరిబురి కొల్చిన । పాండవ బలములలో
రథికవరులు ధైర్యంబులు విడిచియు । నధిక భయాతురులై
బారగజొచ్చి రటంచు దెల్పవిని । కౌరవనాథుండూ
సంతోషంబున మన ముప్పొంగుచు । సంజయు కిట్లనియె

వ చ న ము—

సూతనందనా నీవలన విను వార్తలకు నా మనంబు దృప్తి జెంద కున్నది గాన తదుపరి నెట్లయ్యెనో దెల్పుమనుటయు సంజయుండు కురువరా భగదత్తుని సుప్రతీకంబు విజృంభించి పాండవసేనల దరుము టయు వారు భయంబున బారుటయు నచ్చట సంశప్తక బలంబుల బోరుచున్న పార్థుండు గని హరికిట్లనియె

(కేదారగౌళ) ఆటతాళము [యిదిగోరమా]

గనుమా దేవకి నందనా । ధర్మజుసేన ॥గ॥
గనుమాభగదత్తుడేన్గును సేనపై దోలి
మన వారి నందరి । మ్రగ్గజేయుచు నుండె
కనుల కావరమునను తనబల । మెదిరి బలమును దలపకనుబల్
సునిసితాస్త్ర చయంబు గప్పియు । శూరవరుడై గలచెబలముల ॥గ॥
మనమేగవలయుజుమ్మా । అచ్చోటికి మన తేరుబోవనిమ్మా
మనమేగవలయు ధ । ర్మజుడెట్టులుండెనో
గనవాలె భగదత్తు ॥ కరిజేయుకొల్లల
కును నెదిర్చెడి వీరులెవరని । మనమునకు బాడకట్టుచున్నది
వనజనాభా నీవునేనటు । జనకనిల్చివ జత్తురందరు
దురమూనా కౌంతేయుడూ । భరమైనంత వేరపుజెందెనో భీముడూ
అరయ నాహృదయమునా । కనుమాన మొదలెను
సరసిజోదరమనము । సత్వరజనవలె
ధరనునుల్చి పురీశుడై స । త్కరుణ చప్పిడిపున్న యాఖ్యని

నిరతమునుపోషించు శంకరు । స్మరణజేయుచునుండు భయదుల ॥౫॥

వచనము—

అర్జునుండిట్లు దెల్పవిని వనజోదరుండా రథంబు మరలించుతరి సంశప్తక బలంబులు వెనుదగిలి యార్చి శస్త్రాస్త్రంబుల చతుర్దశ సహస్రరథిక ముఖ్యులు జుట్టుముట్టినగని యేమిసేయువాడ నచ్చట బిలంబులగావ జనుచున్న నిచ్చట సంశప్తకుల నెదిరించవలసె నేద్ది సేయువాడనని దలంచి వితర్కించుకొని సంశప్తకవధను చింతంబుగా నిశ్చయించి మరలి॥

## రగడ

గాండీవగుణధ్వని యొనరించి యు । ఖండలనందనుడూ
భూరికోపుడై దేవదత్తమును । బూరించియు వడిగా
సంసప్తకసేనల కఠినంబగు । సరచయంబు బరపీ
కేతనసమితియు ఛత్రచామర । వ్రాతంబులు గూల్చి
రథముల రథికుల భటబృందంబుల । పృధివిడొల్లనేసి
దంతితురంగ వ్రజముల గూల్చుచు । ధనుశరములు ద్రుంచీ
ముసలముద్గరంబుల తను త్రాణం । బులను చూరుజేసి
యోధవరుల కరచరణ శిరము లతి । క్రోధంబున నరికీ
మకుటంబులు కేయూరహారములు । శకలంబులు జేసీ
మందరనగమూ జలధిం దిరిగెడి । చందంబున నరుడూ
సేన మధ్యమున రథమును ద్రిప్పుచు । చెలగి నరుకుచుండా
ఘోరంబైచూపరులకు గన్పడే । యా రణక్షితిలోనా
అట్టిసమయమున సర్వభూతములు । నర్జునుగొనియాడా
ఆ రణక్షోభముగాంచి శౌరి యు । త్సాహమానసుండై
హరితనకరమూ పార్థునిమూపున । నప్పళించిమెచ్చె
అదిగని పరవశుడై యర్జును డి । ట్లనియె శౌరితోడా
వాసుదేవరథమును మరలింపుము । యా సమరము కడకూ
అనవిని రథమును వేమరలించిన । యంత సుశర్మ్ముండూ

ఆతొడ ననుజులగూడి పార్ధ పా । ర్ధాయుని యరచుచునూ
పోవదగు నె నే బిలుచుచుండగా । పోరాటము విడిచీ
మరలించక శ్రీహరిని గనుంగొన । నరున కిట్టులనియే
మరలించెద రధమూసుశర్మబల । మంత బడల్పడగా
గొట్టుమనిన విని యర్జునుండు బల్ । దిట్టచరంబులచే
ఆత్రిగర్తపతి చాపదండములు । నవనిగూలవేసీ
రధ్యంబుల సారధి కేతనముల । రణభూమిని గూల్చి
అతని సోదరుల గాలుని పురమున । కంపించియు మరలీ
బలునారసముల గొట్టి సుశర్మను । నిలమూర్ఛను ద్రోసీ
మగిడి పోవసమకట్టి యర్జునుడు । మాధవుతో ననియె
దేవామన సేనల వీక్షించుము । తెలియగ రాకుండే
కోలాహల మద్భుతముగ దోచెను । ధూళిగ్రమ్మెనభమూ
భగదత్తుని శుండాలము సేనల । పై నెగుచునుండే
దంతి గదియ దోలుము రధమనగనే । దామోదరుడపుడూ
అతివేగంబున స్వేతాశ్వంబుల । నటకుబరపినంతా
పార్ధుడు మనసేనలపై నమ్ములు । బరపిగలంచుచునూ
దేవతత్త మప్పుడు బూరించిన । దిశలు నిండెరవమూ
బలములెల్ల భయకంపితులైయుట । దొలగిబారుచుండా
సుప్రతీకమతి రౌద్రంబున నరు । జూచి వచ్చుచుండా
ఛండాంశుండోయనగ గిరీటి యు । ఖండరోషముననూ
దంతికడ్డమై వచ్చి నిలచెనో । ధరణీశా వినుమా
అని దెల్పిన విని సంజయుకిట్లనే । నాధృతరాష్ట్రుండూ

వ చ న ము—

అంత కురువల్లభుండు సంజయున కిట్లనియే

(కందార్ధము)

యీవిధి నడ్డము జొచ్చియు
నా విప్రచ్చుండు భీమ । నా టోపమునన్
యే విధి దంతిం బోరెనొ

నేవిధి భగదత్తు నొంచె । నేడ్తెర నతడూ
దేవపతిత తనయుడానాడూ
భావజవైరిచే । బడయు మహాస్త్రము
చేవధియించెనో । జెప్పుమూ భగదత్తు । నేడ్తెర నతడూ

వ చ న ము—

ధృతరాష్ట్రుం డడుగుచున్న విని సంజయుం డిట్లనియె

(కీర్తన) బేగడ ఆదితాళం [తనునా]

వినుమూ కౌరవేశ్వరా । విన్నవింతు ॥వి॥
వినుమూ భగదత్తు న । ర్జునుడు గూల్చినగాధ ॥వి॥
మునుభగదత్తు డ । మోఘ శరావళిని
నిలిచినంతకోప । తనుడై సవ్యసాచి ॥వి॥
కరమున గాండీవ । ధనుడై యుల్లనవిల్లి
కరిభగదత్తుల । శరపంక్తి ముంచెను ॥వి॥

వ చ న ము—

యివ్విధంబున దెల్పుచు తదుపరి భగదత్తార్జునుల యుద్ధక్రమంబు వినుమని యిట్లనియె

## రగడ

భగదత్తుడు వైచిన సాయకముల । పార్థుడు ఖండించీ
ధృఢతర నారసముల భగదత్తుని । ధీరనారసములా
చొక్కగొట్టగా దంతికర్ణములు । నిక్కించియు వడిగా
భద్రకుంజరము రౌద్రంబున నా । పార్థుని పై ధుమికీ
ఘీంకారము చేయుచు తుండముపై ॥ కెత్తి సాహసమునా
యెదురులేక నరు తేరు చుట్టుబల్ । నేడ్తెర దిరుగుచునూ
చీకాకొనరించుచునుండగ నా । శ్రీకృష్ణుడు నరుడూ
తెగియె దెగియెనని పాండవ సేనలు । వగను బొగలుచుండా
సుప్రతీకమూ విజయు రథంబును । జుట్టి తిరుగుచుండా

హరగనివెరపున జేరు మరల్పగ ! నా సామజమపుడూ
అతిరయమున జని సైన్యంబుల నురు । మాడుచుండునంతా
శౌరినేమి యన జాలక నాకరి । తెరవు జూచి చూచీ
జోడుగరచి జోనిమ్ము రథంబని । హరికిదెల్పినంతా
హరులను గరటికి సమ్ముఖంబుగా । మరలించిన గనియూ
భగదత్తుడు శరసందోహములా । నగధరుపై వేయూ
నరుడదిగనియు గ్రాస్త్రచయంబుల । నతని శరంబులనూ
భగ్న మొనర్చియు సాయకపంక్తుల । భగదత్తుని వేయూ
ప్రాగ్జ్యోతిషపతి పదియునాలు గం । బకములు వైచిననూ
యింద్రనందనుండా నా రసముల । నిలను గూలవేసీ
సింధురకవచం బౌక్కకోలచే । చీల్చివైచినంతా
భగదత్తుండొక శక్తిని దానవ । భంజనుపై వైవా
నడుమనె దానిని ముత్తినియలుగా । నరికి పార్థుడపుడూ
ఆతపత్రమును దునిమిన కినుకను । నా భగదత్తుండూ
నరునికిరీటము ఘనతోమరమున । నలియగొట్టినంతా
అతని శౌర్యమును మెచ్చుచుగినుకను । యంతరాత్మబొడమగా
వివ్వచ్చుడు సప్తతివిశిఖములా । వీరుమేనానేయా
దీప్తులలడరు నంకుశమును ప్రాగ్జ్యో । తి షపతి చీనందీ
అభిమంత్రించి నిజాంకుశమును వే । నర్జునిపై విడువా
అతిభయంకరంబై భువిదవియను । నప్పళించునటులా
దిక్కులుఘూర్ణిల రౌద్రాకృతియై । దివిరివచ్చుచుండా
కమవేక్షణుడా వచ్చుశక్తి క । డ్డముగా నిల్చిననూ
మంటలు గ్రక్కుచువచ్చి శక్తియూ । మాధవునతిముమనా
అంబుజముల మాలికయోయనునటు । లమరి వెలుగుచుండా
కనుగొని పార్థుండాహరితో ని । ట్లనిమె దేవదేవా
వచనము—

అని మరియు విజయుండా హరికిట్లనియె॥

(బిల్హారిరాగం) [ఆదితాళం]

తగునా యిదినీకు । ధర్మమా కంజాక్షా
నగధరా నన్నింత । నగుబాటు సేయుట ॥త॥
పగతుడిట గనుచుండగా నన్ । పరునిగా భావించిననిలో
మగటిమిని లేనట్టి హీనుని । పగిది ననుజూచితివి దేవా ॥త॥
తేరికి కూరిమి । సారథివైయుండి
పోరికష్టముగాగ । బూనుదురే సారథులు
నీరజోదర మేలకో యూ । క్రూరశక్తికి నడ్డమైతివి
కారణంబెరుగంగ రాదీ । కయ్యమున చులకనగజూచుట ॥త॥
సర్వసమర్థుడవు । సారథ్యమెట్లైన
నిర్వహించెదవని నే । నెరనమ్మి యుంటిని
సర్వమయుడో నుల్చిపురి శ్రీ । శంకరుని మిత్రోండవైయీ
యుర్విచప్పిడి పున్నయాఖ్యుని । నొప్పుగా పోషించువాడవు ॥త॥

వచనము —

ఇట్లాడుచున్న గిరీటింగని శ్రీకృష్ణుండు మరియు॥

రగడ

సంగతెరుంగక తామసించితివి । సవ్యసాచివినుమా
తొల్లియోగనిద్రను నేనుండగ । ఘోరపువేడుకనూ
కోరికతో భూదేవివచ్చినను । కూరిమిప్రార్థింపా
కరుణారస భరితుడనై యామెకు । వరమొసంగినాడా
ఆవరమున నరకుండను తనయుం । డా వెలదికి గలుగా
వైష్ణవాస్త్రమతనికి లభియించెను । వసుధదేవి కతనా
ఆయస్త్రముభగదత్తాయత్తం । బైయుండెను పార్థా
దానిభరింపగ నాకుదప్ప తది । తరులకు సాధ్యంబే
అనుచు శాంతవచనంబుల నర్జును । ననునయించిమరియూ
పరమసాధనము వృథయగుటను యిా । భగదత్తుండిపుడూ

వెరపుజెందియున్నాడుగాన నీ । వీ క్రూరునివేగా
వీని తండ్రినేజంపిన తీరున । వీని జంపుమనినా
హరివాక్యములాలించి ధనంజయు । డద్భుతరోషమునా
గాండీవగుణమున సారించియు । ఖండనారసమునా
గొట్టినపవియద్రిని దాకినగతి । నట్టిశరము జనియూ
ఫాలభాగమున దాకినంతనా । భగదత్తునిగజమూ
కొమ్ములూతగా గూలి రణధారుణి । కొరిగినంతలోనా
అర్ధచంద్రశరమున భగదత్తుని । మూర్ధము దెగవేయూ
దంతిభగదత్తుని బరిమార్చియు । ధర్మజుసోదరుడూ
తననెదిరించెడివారలు లేకను । యనిని దిరుగుచుండా
గని శకునియు నాతనితమ్ములు నతి । కావరమున వెడలీ
నరుపైదాకిన గాంధారేశ్వరు । ననుజులలో నొకడూ
వృషకుండనువా డెదిరించినగని । వివ్వచ్చుండతనీ
రథరథ్యంబుల నూతకేతు ఛ । త్రముల చామరములా
నరికినంతవాడటుజని తమ్ముని । యరదంబెక్కియునూ
జనినయంత గాంధారవీరు లతి । శౌర్యోన్నతులగుచూ
ఐదుశతంబుల రథికులమార్కొన । నందరసమయించీ
యేకరథస్థుల నిరువురికంతము । వేడ్త్రైరఖండింపా
శకునిగనుంగొని క్రోధమూర్తియై । సవ్యసాచిగదిసీ
మాయజాలకుండగుట నెన్నియో । మాయలుగల్పించీ
అద్భుతముగ నలుదిక్కుల మేఘము । లావరింపజేసీ
తరువులు పాషాణాయుధంబులను । తరుచుగ గురిపించీ
తిమిరము నలుదిక్కుల నిండించిన । దివిజనందనుండూ
అన్నింటిని తగుతగు శరములచే । హతమొనరించియునూ
అల్లననగి యిట్లనియె శకునితో । నుల్లము రంజిలగా
మాయలన్ని యానాటి జూదమున । పోయెగాక మామా
అనుచు దివ్యసాయకములగొట్టిన । నచటనిలువలేకా

మరలి చనియెరరివారు నవ్వనీ । మరది రాజరాజూ
శకుని వెరవుగొని జనినవ్యకోదర । సాత్యకు లిద్యాగనూ
నకునకుదోడై నిరుపార్శ్వంబుల । నడువగ పార్థుండూ
కురుపతి ద్రోణాచార్యు డున్నయడ । కునుయరదము బరపా
భయకంపితులై మనసేనలు శర । గురుని మరుగుజొచ్చె
ఆకురు పాండవ బలములు గలిసిరి । యా ద్రోణుని మేనా
అదిగని కౌరవబలములు మారొ్కని । ర చార్యునిగూడి
ఆతరి నుభయబలంబులుబోరిరి । యద్భుతరోషములా
అట్టుల బోరుచునుండగ ద్రోణుం । డరిబలముల దరిమే
గురుడెటుదరిమిన దృష్టద్యుమ్నుడు । దరిమెనతని దిశకూ
భారద్వాజడు ద్రుపదనందనుడు । బోరుచుండునంతా
కౌరవపతి కౌంతేయాగ్రజు లతి । కౌతుకములబోరా
ఘోరంబై గనరాకయుండెరణ । ధారుణికురుభూపా

వ చ న ము—

యిచ్చట ఘోరసమరంబు జరుగుచున్నంత దక్షిణదిశనుండి సంశప్తకులు నారాయణ గోపాలబలంబులం గూడుకొనివచ్చి యిట్లనిరి.

కాంభోజి [ఆదితాళం] (వోరినీకిది)

యేడిరాయెటుబోయె నర్జునుడూ । కనుపించడదేమో ॥యే॥
యేడిరాయెటదాగె గాన । రాడు మేముసమరమున నోడితిమని
విడిచివచ్చె ॥యే॥

మానధనుడనిచేరు కొందరురా । జగమెల్ల నాతని ॥మాన॥
దానవాంతకు డాతనికి దో । డైన గాని సమరమునకు బూనిరాక
దొలగిచనియె ॥యే॥

ఖాండవము దహింయించినాడటరా । బాలేందుధరునితో భండనమున
జయించినాడటరా

పాండునృపతికి నందనుడై । పాండవమధ్యముడని బహునామముల
బిరుదు గలవా ॥డే॥

వ చ న ము—

సంశప్తకబలంబులు కేకలువేయుచుండ విని కృష్ణార్జునులు దక్షిణ భాగంబునకుం జనిన యంత నిచ్చట కౌరవబలంబు లగ్గలికం గదిసి కోల్తలుజేయు పాండవబలంబులు చెదరిబారుచున్నంత భీమసేనుం డదల్చి మారొ్కని॥

## ర గ డ

వచ్చెడి బాహ్లికు నిలుమని శరముల । రిచ్చ పడగనొ్ట్టా
కురుపతి యశ్వత్థామ కర్ణశర । గురుడు మొదలుగాగా
వీరవరులు భీమునిపై క్రూరపు । నారసములు గప్పా
కౌరవులందరికన్ని రూపులై । బోరుచుండునంతా
పెక్కు బలంబులు నొక్క వృకోదరు । సృక్కించుటజూచీ
ధర్మజుండు సేనల బురికొల్పిన । దర్పంబుల పెడలీ
మాద్రికుమారులు సాత్యకాది సౌ । భద్రులు భీమునకూ
బాసటయై దుర్యోధనాదులను । పైబడి తరుముటయూ
అప్పుడు భయబలములకు ఘోరమూ । నాహవంబుజెల్లే
అపరాహ్ణంబైనంతలోన నో । యవనీశా వినుమా
దొమ్మికయ్యె మొనకించి దుగ్రులై । దోర్బలమున వారూ
గలిసి సాయక జ్వాలలచేతను । గరుఁగరు ఁఘ్చకొనుచూ
క్రూరనారసంబుల హయరాజిని । ధారుణిగూల్చుచునూ
రథచయంబులను వాలిక తూపుల । రయమున గూఁల్చుచునూ
భటకోటుల నిరువాగుల శరముల । పాలుజేయుచుండే
అతిఘోరంబై గనుపట్టెను రణ । క్షితి నలుదిక్కులనూ
సంకులసమరము జరుగుచుండగా । సమయము వీక్షించీ
కడురోషావేశుండై ద్రోణుని । గదిసి దరుముచుండా
ధృష్టద్యుమ్నుం డిదిసమయంబని । తేరుమరల్చుకొనీ
గనుగొని నమ్మిన రథికులెల్ల నా । ఘనునకు దోడగుచూ
ద్రుపదాత్మజుపై గ్రమ్మినంతనా । ద్రోణాచార్యుండూ

చెలరేగియు కౌంతేయు బలంబుల । నలుగుల గూల్చుచునూ
తురగంబుల కేతనముల రథములు । దొరగజేసి మరియూ
సారథులను సామజ బృందంబుల । సమయించుచు వేగా
భటకోటుల రథికుల నురుమాడుచు । భారద్వాజుండూ
నేలకు గోలకు దెమ్చుచుండగా । నేడ్తెరలను నుడిగీ
పాండవబలములు చీకాకౌచును । పలుదిక్కుల బారా
సంశప్తక సేనల మర్ధించియు । సవ్యసాచి మరలీ
అరదము దోలుక రభ సోద్రేకత । నతి రయమున వచ్చీ
కురుసేనల జొచ్చినగని భీముడు । నరునకు దోట్పడియూ
నురుమాడుచునుండగ నాచార్యుడు । త్వరిత గతిని వచ్చీ
కూ్రరశరంబుల భీమార్జునులను । గొట్టు చుండునంతా
అతిరోషంబున సాయక జ్వాలలు । నతని మేన నింపీ
ద్రోణుని నుల్లాసంబును మాన్చియు । తోడనె బలములనూ
శిలుగుల నెత్తుకు వెల్లి దేలగా । జేసి సైన్యములూ
భరియింపగ రాకను నెటుబోవగ । తెరువుగాన కపుడూ
అందరొక్క మొత్తముల్లై భయమున । నడలుచు నిట్లనిరీ

వచనము —

మరియు కౌరవ బలంబులు భీమార్జునుల కొల్తల కోర్వం జాలక కర్ణుని కడకేగి పెద్ద యెలుంగున కేకలు వేయుచుండి రెట్లనిన

(కమాచి రాగం) ఆదితాళం [జేబులోబొమ్మ]

కావగ రావే । కర్ణా । కర్ణ ॥ కా॥
కావరావె కమలాప్త తనయమే। మీ విప్రచ్చుని హింసలకోర్వము ।కా॥

పెక్కసమాయే । యీతని నెదిరించూ । దిక్కు లేదాయె
అక్కట నరుడీ చాపాచార్యుని । చొక్కగొట్టి బల్ । చిక్కుల బెట్టె ॥కా॥

మొరుగమూ మేమూ । యేనాడు యింత । భరము దోచూరణమూ
ధరను నుల్చి పురవరుడా శ్రీ శం । కరుని కరుణ లే కిటు లభియించె ॥గా॥

వచనము —

ఇట్లా సేనలెల్ల మొరబెట్టుచుండ విని కర్ణుండు

## రగడ

ఓడి పారితన వెనుకం దాగిన । యోధుల వీక్షించీ
సాహసుడై నిలువిలుమని సేనల । నాహవమున నిల్పి
కోడకు డని ధైర్యంబున కర్ణుం । డురురోషాయుతుడై
అమరేంద్రుని నందనుపై మార్కొని । యాగ్నేయాస్త్రమునూ
వైచినంత గని వారుణాస్త్రమున । వారించియు వేగా
వాలిక తూపులు గురియునంతలో । వాయుజ సాత్యకులూ
దృష్టద్యుమ్నుడు మొదలగు మువ్వురు । ధీరమానసులూరై
శరత్రయము రాధాత్మజుమేనను । బరపినంతలోనా
నరుడుబరపు ఛండాస్త్రచయంబుల । నడుమనె మరలించీ
నవ్వుచు నమ్ముమ్వుర చాపంబుల । నరికినంతవారూ
మూడుశక్తి సాధనములువైచిన । మురియుచునవిగూల్చి
పొంగుచు నార్చినగని విన్వచ్చుడు । భూరిరోషమునమూ
సప్తసాయకములా కర్ణునిపై । సంధించిన యంతా
ఆపీరునితల మిగిలీవచ్చుటను । నాతని సోదరులా
మువ్వురిశిరములు ద్రుంచె మూడు శర । ములచే పార్థుంపూ
అదిగని భీముడు రథముడిగ్గి వే । నచటికి వచ్చియునూ
బలుగదచే కర్ణునిసైన్యంబుల । పదివేవుర జంపీ
మరలిపోయి రథమెక్కి ధనువుగొని । మార్గణములు బరపీ
రాధాతజ్ము సంగంబులతురగ । వ్రాతమునొప్పించీ
ఆలోన పాంచాలసుతుండును । నలశ్యేయుండూ

వేరుజాపములుగొని యాకర్ణుని । సారథి సృక్కించి
ఆతనిచాపము విరుగ నేయుటయు । లా కురుపతిగనియూ
ద్రోణసైంధవాదులతో వచ్చియు । దోట్పడి రణమునసూ
పగరసంద్రమున మునుగకుండ గా॥ పాడిరి రవిసుతునీ
అట్లుండగ నిరువాగుల బలములు । నగ్గలి కలగదీసీ
ధీరత బోరుచునుండు వేళనో । వారణపురిపాలా
సవ్యసాచి కోల్తలకు నోర్వగా । జాలక కురుబలమూ
బారుచున్న గని ద్రోణాచార్యుం । డా రధికులకనియె
భానుండస్త్రాద్రికి జనినంతనే । పాండవ బలమెల్లా
దివియించిరి మనసేనల నెల్లను । దివియించగ వలయూ
దివియించుచుండని నాజ్ఞయొసంగిన । దివియించిరి బలమూ
యిట్టు లుభయ సేనలు శిబిరంబుల । కేగిరి కురురాజా

వ చ న ము: —

ఇట్లుభయసైన్యంబులు శిబిరంబులకేగి వారివారి విడిదల నివసించి యున్నంత మన శిబిరంబుల కౌరవానీకంబు లెల్ల మనంబుల పరిపరి విధంబుల దలంచుచుండి రెట్లనిన॥

(గీ) ప్రతిన యొనరించు ద్రోణుని । ప్రతినభంగ
మయ్యె పార్థుపరాక్రమ । మతిశయించె
నాతనికి దోడుగావచ్చు । నంబుజాక్షు
కరుణగొనిచూడ దరమె నె । వ్వరికి నైన॥

వ చ న ము—

ఇట్లాకురుసైన్యంబులు విన్నవటనులైయుండి యారాత్రిగడిపి నంతవేగు టయుమూడవదివస సూర్యోదయంబున కయ్యంబునకు నెడలునప్పుడు విషాదమానసుండై నీతనూజుండెల్ల వారువిన ద్రోణాచార్యునకిట్లనియె

(చక్రవాకం) [రూపకం]

శరగురువర నాకోరిన । వర మొసంగి నాడవపుడు
దురమునందు ధర్మరాజు । తెరవు నేగజాలనైతి

నరయగ నాతని బట్టక । కురువర దెచ్చెదనంటివి
పెరయాసను నుంటిని నీ । పెద్దరికంబెల్ల దెలిసె
వెరచినాడవో పాండవ । పీకులగని మనములోన
శరవేగము దప్పెనేమొ । ధరణీసుర ముదిమివలన
నరుపై విశ్వాసమున్ । నరవరునిం బట్టటకై
జొర్వైతివి నీలోనా । మరుగెల్లను గ్రహియించితి ॥శ॥
గురుడవనుచు శరవిద్యల । గరపిన నెరదాతవనుచు
నెరనమ్మితి నా మనమున । సరియానే కపట వృత్తి
ధరలో నుల్చి పురంబున । స్థిరుడై నివసించి భక్త
వరులను బోషించు గిరిజ । వరుని కరుణరాదేమొ ॥శ॥

వ చ న ము—

దుర్యోధనుం డిట్లనిన విని శరగురుండ ప్రీతుండయ్యును కటకటం బడక నతనితో నిట్లనియె

## ర గ డ

దుర్యోధనమును దెల్ప లేదెరణ । కార్యక్రమం బెల్లా
ఆర్యసమ్మతము నరుని విక్రమ్మును । నంబుజాక్షు మహిమా
నీవు యెరింగి యెరింగియు నన్నిటు । నిందసేయదగునే
ధర్మజుండు కయ్యమున కొచ్చుతరి । తమ్ము డర్జునుండూ
రాజీ వాక్షుండతనికి దోడుగ । వారె పెక్కుమార్గా
గాన నేటి రణమెట్లొన రింతునో । గనుగొనుమో యధిపా
గావున పార్థుని దొలగ దోలుకొని । పోవువారి నిపుడూ
యెవరినైన బంపుము సుయోధనా । యేడ్తెరజనువానీ
ధీరుడు ద్రోణాచార్యుడు నవ్వుచు । దెలుపుచుండునంతా
విని సంశప్తక బలము లెల్ల కురు । విభున కిట్లులనియే
మేము దక్క నొరులా వివ్వచ్చుని । మించి యోర్వగలరా
అనుచు వారలేగియు నరునింగని । నవికి బిల్చినంతా
రౌద్ర స్ఫూర్తింజని కిరీటియా । రణమునకుం జొచ్చి

దివ్యాస్త్రంబుల సంశ స్తకులను । తివిరినేయుచుండా
సమరము ఘోరంబై జెల్లెను యా । సమముంబున నచటా
యిచ్చట కౌరవ బలములలో బల్ । హెచ్చు రోషముననూ
భారద్వాజుడు పద్మవ్యూహము । బన్నినంతలోనా
ధర్మజు నానతి నభిమన్యుడు ప । ద్మ వ్యూహంబపుడూ
భేదించుటకై జొచ్చి పెక్కు భూ । నాధుల సమయించీ
వీరవిక్రమంబున కురుసేనల । బారి సమరిసమరీ
అట్టి సంకులంబున జిక్కియు నెటు । నగగజాలకతడూ
సమసినంత గని పాండవబలములు । తమతమ హృదయములా
చలములుడిగి తమతమ నిలయములకు । జనరికౌరవేశా
అనుచుసంజయుండిట్టుల దెల్పగ । విని ధృతరాష్ట్రుండూ
సంజయనాటి దివంబున కయ్యపు । సరణిదెల్పుమని నా
జనమే జయునకు వైశంపాయన । మునిదెల్పిన కధనూ
వినిపించెదనో గజపురిపాలా । వినుమని యిట్లనియె

వచనము—

కురువంశోత్తమా॰ నీమనుమండగు నభిమన్యుండు పద్మవ్యూహంబున నొక్కండు పలురచేతంజిక్కి పోజాలక నచ్చట సమసెనని దెల్పినవిని ధృతరాష్ట్రుండు వగలంబొగులుచు నిట్లనియె,

(ముఖారి) ఆటతాళము [శరణుభరత]

కూళవైకురుబలము లొక్కట । గూడి పద్మవ్యూహమున నభి
మన్యునీ । సద్గుణ ధన్యునీ ॥కూ॥
కటకటా యెటుజంపిరో యు । క్కటికి మిసుమంతయుదలంపక
బాలునీ । విక్రమ శీలునీ ॥కూ॥
వంటరిగ సమరమున జొచ్చిన । వానినుత్తమ తేజు నుత్తల
పెట్టిరో । యెట్టుల గొట్టిరో ॥కూ॥
పురుషసింహుని పాటు వినవా । బుద్ధిగలగె చెలించెహృదయము
సూతుడా । సుగుణసమేతుడా ॥కూ॥

దండి శూరులు ద్రోణకర్ణులు । ధర్మమరయక పార్థతనయుని
గూల్చిరో । ధీరత నిల్చిరో ॥కూ॥
క్షితినిచప్పిడి పున్నయను రక్షించుగంగాధరుని కృపలే
దాయెనూ । యేమి సేయనూ ॥కూ॥

వ చ న ము :—

అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లనియె

# ర గ డ

భారద్వాజుడు పద్మవ్యూహము । బన్నె డిసమయమునా
నరవరులందరు నద్మదళములుగ । నమరెయుండిరధిపా
రాజకుమారులు కేసరములుగా । తేజమలర నిలిచే
దుశ్శాసనకర్ణాది సేనలను । దోర్బలమున గూర్చి
మధ్యకర్ణికగ నిలిచియుండెనట । మన దుర్యోధనుడూ
వలయాకారంబైన భేద్యమై । వరలుచుంట జేసీ
అది చక్రవ్యూహంబున నొప్పెను । నట్టిమొగ్గరమునా
అతి దర్పంబున ముందు నిలిచెనా । యాచార్యుండపుడూ
వలయు నెడల సైంధవ గురు పుత్రులు । నలకృపశకునులునూ
భూరిశ్రవ కృతవర్మ శల్యులును । భూపానీ సుతులూ
మనుమలు మొదలగు వారు రక్త మూ । ల్యాను లేపనములా
మణిమయహార కిరీటాదులు స । మ్మతమున ధరియించీ
మోహరమున నిలిచిన గని పాండవ । ముఖ్య వీరులెల్లా
గదిసి నడిచిరా భీమ సాత్యకులు । కడుమోదంబుననూ
కుంతిభోజులా ధృష్టద్యుమ్నులు । సంతసమున నడువా
క్షత్రవర్మలు ను దృష్ట కేతుడును । క్షత్ర ధర్మలంతా
నడుచుచుండ నకులుడు సహదేవుడు । నలశిఖండిమరియూ
ద్రాపదేయ కేక యు విరాట యు । ధామన్యులు వడిగా
ద్రుపద ఘటోత్కచ సృంజయబలిములు । దోర్బలముననడువా
సమరధీరులై యందరు ద్రోణా । చార్యుని దలపడినా

నవ్వుచు ద్రోణుడు వాడిశరంబుల । నలియఁగొట్టుచున్నా
చాపాచార్యుని కోట్టల కోర్వక । నా పాండవ బలమూ
వెక్కసమందుచు దిరుగఁడుబడుచును । వేరపుజెంది మరియూ
వెల్లదనంబున పాండవాగ్రజుం । డేమిదోచ కపుడూ
పూరకుండిమరి కొంతదడవునకు । శూరాగ్రణియైనా
కర్ణికార కేతుస్సీతుండును । కవ్వడి నందనుడూ
అభిమన్యుంగని పీడుదక్కనొరు । లట్టి వ్యూహామిపుడూ
భేధింపగజాలుఁదురేయని తన । హృదయంబున దలచీ
సౌభద్రుని తోమపుడు గనుంగొని । శమనాత్మజు డనియె

వచనము——

మరియు ధర్మజుండా యభిమన్యున కిట్లనియె

(కాంభోజి) ॥అట॥

ఈ యొద్దు భేదింప । మేమెవ్వరమునేర । మేమిసేయుదు బాలకా
మీ యయ్య నీవునూ । మీ మేనమామయు
కాయజుడును దక్క । గలరే పద్మవ్యూహా
మీయడను భేదింపపరులకు । నెట్లు సాధ్యంబగునుపుత్రా
తోయజాక్షార్జునులువచ్చియు । హేయముగజూచెదరుమనలను॥ఈ॥
నీలాపుశౌర్యములా । నెరపి పద్మవ్యూహా
మేలాగునైనా భే । దించి మామనముల
చాలప్రియ మొనరింప జేయుము । సమరమునజొచ్చి యుకుమారా
శూలధరుడౌనుల్చి పురిపరి । పాలఁడౌ గౌరీశుదలచుచు ॥ఈ॥

వచనము——

ధర్మజుండ డుగుచున్న విని యభిమన్యుండిట్లనియె ॥

## రగడ

ఈ పద్మవ్యూహము భేదించెడి । నెల్లమార్గములనూ
సర్వమర్మముల బోధించెను నా । జనకు డమిత దయనూ

వ్యూహముజొచ్చియు తెరపిసేయుగా । నోర్తుసాహసుడనై
పగరజించిఘెండాడెద నేనా । పగరమూకలెల్లా
నన్నుజుట్టుముట్టియు శరమాలచే । నలయించుచునున్నా
మరలివచ్చుమార్గము విననైతిని । మజ్జనకుని వలనా
ఐనను వ్యూహముజొచ్చెడి నేర్పును । నరయుచుండు మధిపా
అనియిటు ధీరుండైపల్కిన వచ । నంబు లాలకించీ
అభిమన్యునకిట్లని దెల్పెను ధ । ర్మాత్మజుండు వేగా
తెరపిగొనుచు మొగ్గరమును జొచ్చిన । తరిమేమందరమూ
నీవెనువెంటనె జొత్తు మందరము । నియతాత్ములమగుచూ
అరమరలేకను మొగ్గరంబు జొర । వర మొసగుము పుత్రా
ఆధర్మాత్మజుడిటు దెల్పగవిని । యావృకోదరుండూ
సౌభద్రా మొగ్గరము జించుమో । సరగ మున్ను కొంతా
అదిగని నేనును పార్షతుండు మొద । లైనవారలంతా
అచ్చటచ్చటను నిలిచి పద్మవ్యూ । హంబు జించగలమూ
అనవిని యభిమన్యుండా భీముని । యాననంబు గనియూ
యిచ్చమెరయ ద్రోణుడు ననుగని మది । మెచ్చునటులజొచ్చి
అమ్మొగ్గరమును జొచ్చినగని ధర్మజుడు గారవింపా
కన్నతల్లిదండ్రుల కానందము । గలుగజేతునయ్యా
బాలుండా కురుబలముదోలెనని । ప్రజలు నుతింపగనూ
మామనా పరాక్రమశ్శౌర్యము విని । మానధనుండనగా
కౌరవేంద్రునకు దెప్పరమగునటు । కడిమిజూపగలనూ
అని దెల్పినవిని ధర్మనందనుం । డాహ్లాదంబుననూ
నాయన యభిమన్యా నీకీర్తియు । సమిత బలంబిలనూ
వర్ధనమొందెడునని దీవించిన । పార్థతనయుడపుడూ
సంతసవార్ధిని నోలలాడి తన । సారథి కిట్లనియె
మనయరదము ద్రోణానీకముపై । మరలించుమటన్నా
వినిసుమిత్రుడను సారథియర్జును । తనయున కిట్లనియె

పసిబాలుండవు ద్రోణాచార్య । ప్రముఖసైన్యపతులూ
ప్రౌఢు లనేకులు గలరు వారిలో । పార్థతనూజాతా
యెన్నడిట్టి సమరంబులజొచ్చియు । నెనుగనిబాలుడవూ
సమరంబున నీచేతను వారలు । జచ్చువారుగారూ
రణకర్కశులతి ధీరులు కౌరవ । రాజబలములనినా
వుల్లమలర నవ్వుచు సౌభద్రుం । డల్లన నిట్లనియె
నిర్జరపతితన సేనతోడ న । న్నెదిరించినగానీ
కృష్ణుడర్జునులిద్దరు వచ్చియునన్ । గినిసి నెదుర్కొనినా
అట్టివారినందరిని జయించెద । నాహవమున గనుమా
శరగురు నాతని సైనంబులనే । సరకుసేయ నెపుడూ
అటులబలికి సారథివాక్యంబుల । నాలకించకతడూ

వ చ న ము—

సారథి యనుమానించుచున్న యతనికి నభిమన్యుం డిట్లనియె

శంకరాభరణరాగం [ఆది] (వచ్చిరి)

సారథీ । సకల సద్గుణ వార్ధిధీ
సారథియింక సందేహంబేలను । తేరుదోలుమా ధీరులజేరా ॥సా॥
చూడుమా అనుమానము దిగ । నాడుమా
పోడిమిమీరగ పోనిమ్ము రథము । నేడీవ్యూహము జాడనుబట్టి ॥సా॥
యేలనూ । యింతాటి వెరపి । దేలనూ
చాలునింక కుదు । సైన్యంబులపై దోలు ముల్చిపురి శూలిసాక్షిగా ॥సా॥

వ చ న ము—

ఇట్లనుచున్నసారథి యనుమానించుచు రథంబుదోలుచున్న గనుంగొని ద్రోణాచార్య ప్రముఖయోధులు నొండొరులకుం దలమిగిలి యేచి నెదుర్కొని పెలుచ నిలిచిన సంకులసమరంబయ్యె నట్టియెడ

# రగడ

మెఱుపుమెఱయు చందంబున మెరసెడి । యరద మధిష్ఠించీ
కర్ణికార కేతువు నలుదిక్కుల । కాంతివెలుగుచుండా
వెడలి కుంభజుని శాతశరంబుల । నడలగొట్టి యతడూ
మోహారంబు నడలించియు పద్మ । వ్యూహము భేదించీ
జొచ్చి సుభద్రాత్మజుడు రౌద్రరస । స్ఫూర్జితుడైయుండూ
శరధిని దిరిగెడి మందరనగమన । దిరుగుచు నాతండూ
కాననంబునం జరియించెడి తీ । వ్రానలంబుభాతీ
కాలపక్వసంహార మొనర్చెడి । శూలి తెఱంగుననూ
కేళీలీలల మెలగుచునరుసుతు । జాలములో మరియూ
అమ్మోహారమును బొడిజేయుచు రూ । పమ్ములుమార్చుచునూ
వీరవరుడు సౌభద్రుడు రణమున । విహరించుచునపుడూ
నానావిధ నారాచ వ్రాతముల । నేనుగుగుంపులనూ
డొల్లజేయుచును దేసులహయముల । దోర్బలమున నరికీ
కాల్బలములజంపుచు గేతువులను । కడువడి విరచుచునూ
రథ్యంబుల నురుమాడుచు సూతుల । ప్రాణంబులు గొనుచూ
చాపంబుల విరచుచు మైమరువుల । నేపునజించుచునూ
చేతులునరుకుచు తలలుద్రుంచుచును । చిదుముచు నెమ్ములనూ
కండలుజెక్కుచు గుండెలు దరుగుచు । కడురోషావశుడై
మొగ్గరమెల్లను చిక్కబరచి తా । నగ్గలికను రేగీ
సేనలపైబడి దరుముచుండగా । సేనలు వెరగందీ
విచ్చలవిడి భయమున నలుదిక్కుల । కేగుచుండునంతా
గని దుర్యోధనుడతిరోషుండై । కవ్వడినందనునీ
తరిమికవిసె పేరాకలిగొను కే । సరి యుండెడి గుహకూ
కరియరిగెడి చందంబున నీకొడు । కరిగి గదిసిదానీ
శరములచే నొప్పింపగ దలచిన । శరగురుండు గనియూ
సేనాధిపులకు చేయిపీచి యెలు । గెత్తి పిలిచి పిలిచీ
వారలకిట్లనె సౌభద్రునితో । పోరుభరంబయ్యె

ధరణీవల్లభునకు దోడ్పై మీా । రరుగుం డద్దముగా
మీాబలశౌర్యపరాక్రమములచే । మెరయుడతని క్రమోలా
అని వారలకును హెచ్చరించి గురు । డరద మతని దెసకూ
బరపుచున్న గురుసుత కృతవర్మలు । పరగ రాధసుతుడూ
సోమదత్త శలశకుని పౌరవుకు । నామద్రేశ్వరుడూ
వృషసేనుడు కౌరవపతి మొదలగు । వీరులంత గడగీ
అతిబలాఢ్యు లౌక మొగి దుర్యోధను । కడ్డముగా జనియూ
పైబడి వచ్చెడి కౌరవమూకల । పార్ధసుతుండపుడూ
లేళ్ళగమిం గను బెబ్బులి తెరగున । లేచి సాయకములా
ఛండగతిని సేనల నురుమాడుచు । నుండబలములెల్లా
వెరపుజెంది నలుదిక్కుల బారగ । విష్వచ్ఛుని కొడుకూ
పేర్చియార్చినం గని యాచార్యుడు । బిగ్గర జనుదెంచీ

వ చ న ము—

తమ సేనలకు చేయిచీచి యిట్లనియె

రేకుప్తి ॥ ఆది ॥ (పారిపోవ)

తగునే పారిపోవ పార్థ । తనయుని గనియూ
నగుబాటాగాన యిట్లు । నలుదిక్కులకు బార
నగరే సరివారలు ॥త॥

కురుపతి కీయెడ సమరము । భరమైదోచే
నొరుడడ్డముగాగ మీారు । శరపరంపరలచే
సౌభద్రుం బోరక ॥త॥

మీాశౌర్యము । మీా తేజము మీా ప్రతాపమున్
మీాశూరత్వము మెరయుగ । నాశౌరి యల్లుని
నలుదిశల గ్రమ్మక ॥త॥

ధరనునుల్చి పురవరమున । స్థిరముగ చెలసీ
అరయ చప్పిడి పున్నయ చా । దటిని రక్షించెడి
గౌరీశు సాక్షిగ ॥త॥

వచనము—

ద్రోణుం డిట్లు సేనలకుం దెల్పుచు దనయురదం బద్దెస మొగంబు జేసి బురికొల్పిన

## రగడ

గురుసుతుండు గృపుడును కృతవర్మల । గూడి శరగురుండూ
వెడలి పార్థనందనుని నెదుర్కొన । వీరావేశములా
అందరు గాదివిన గని యభిమన్యుం । డన్ని మార్గణములా
ఖండించుచు తత్సైనిక తనువుల । దండిశరంబులచే
నలయించుచుతా బోరుచుండగని । నరనాథుం డపుడూ
చేయివీచుటయు మనవారలు వ । ట్లాయుధ ధరులగుచూ
గడగినంత సౌభద్రుండేచియు । కడలిబొంగు రీతీ
యెత్తైరపైబడి తరుముచుండగను । నేమిదోచ కపు డూ
కౌరవపతి భూరి శ్రవకృపులును , గడగిరోషములనూ
అంబకత్రయమున గొట్టి రప్పుడా । యభిమన్యునిమేనా
ఆచార్యుడు పదియేడు బాణముల । నతని గొట్టెనంతా
అలవివింశతియు నిరువది శరముల । నలయించిన మరియూ
అశ్వద్థామయు బృహద్బలుండును । నైదు నెన్మిదిటనూ
శల్యుడారు శరముల గృతవర్మయు । సప్తనారసములా
రెండు విశిఖముల సౌబలుండు పం । ద్రెండు దొమ్మిదియునూ
దుశ్శాసన దుస్సహులిర్వురు నతి । దోర్బలమున వేయూ
అప్పు డందరిం గని సౌభద్రుం । డత్యుగ్రహుడగుచూ
అందరిమేనుల మూడుమూడు బా । ణంబులు గ్రుచ్చియునూ
అంత నశ్మకుండనువా డడరిన । నతని గూలనేసె
అశ్మకుండు వడినంత బలంబులు । నతి భీతాత్మకులై
పారుచున్న సైన్యముల దిక్కులకు । బారనీక నిలిపి
పురిగొల్పక యాచార్యునితో నీ । పుత్రులుకొందరునూ
ఉగ్రులగుచు శస్త్రాస్త్రంబులచే । నొప్పించిన యంతా
గని కిరినందనుడు రోషమున । కాలాంతకు రీతి

అందరి తనువులు నానాస్త్రంబుల । నతివేగమెగొట్టి
నెత్తురులను జొత్తిల్లగ జేసియు । నత్తరి కర్ణునిపై
గవిసి కంకటముదూరి శరీరము । గాడిబారునటులా
క్రూరంబగునా రాచంబులచే । గొట్టనతడు సృక్కి
భూపాలా నీతనయుల వెనుకకు । బోయిన నృపవరులూ
నురుమాడుచునుండగ గని శల్యుడు । నుద్ధృత వేగమునా
పరువడివచ్చియు దాకినంత గని । ఫల్గునాత్మజుండూ
మోమునక్రోధం బడరగ శల్యుని । మూర్ఛబడగ గొట్టి
ఆర్చినంత మనసైన్యములెల్లను । నల్లడలకు బారా
ద్రోణుడు బలముల జెదరనీయకను । దోడ్పడి నిల్పగనూ
అంబరమున నిర్జరవిద్యాధరు । లద్భుతముగ బొగడె
అప్పుడు దేవ నినాదము లెంతయు । నుప్పరమున నిండే

వ చ న ము :-

సంజయుండిట్లు దెల్పిన విని ధృతరాష్ట్రుం డబ్బురపడి సూతున కిట్లనియె

శ్రీరాగం — ఆదితాళం

యేమీ యనవచ్చు సంజయా । సౌభద్రుని శౌర్యం ॥యే॥
యేమందును నరనందను వినినే । సామాన్యుండని దలచితిగాని ।
భూమీశులనెల్లర నీ యనిలో । తా మడియించెనటంటివి చోద్యం॥యే॥
అట్టి వీరబాలునిపై మార్కొను ! నట్టి సాహసాత్ములు లేరైరో ।
అట్టి పద్మవ్యూహంబున నొక్కం। డిట్టుల నందరిగొట్టె బలుండై ॥యే॥
యిప్పుడు తెగవరియై యొక్కండే । చొప్పున బలముల సమయించుటకును ।
చప్పిడి వున్న యచ్చోదరి నేలిన । యప్పరమేశుని కృపగాకుండిన ॥యే॥

వ చ న ము—

అట్టి మహావీరుండైన యభిమన్యు నెట్లు దాకిరో దెల్పుమనిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

# రగడ

శల్యు పాటుగని యతని సోదరుడు । చయ్యన మార్కొనియు।
పదిబాణంబుల గొట్టినంత నా । ఫల్గునాత్మజుండూ ।
కోపతామ్ర నయనుండై కరమున । కోదండముబూనీ ।
దివ్యశరంబుల శల్యు సోదరుని । తేరిహయంబులనూ ।
సూతు కేతనంబుల ధరగూల్చియు । నాతని జాపమునూ
ధరగూల్చియు నొక క్రూరాస్త్రంబును । బరువడి సంధించీ
వాని శావాలను నరికి రయంబున । బూని తేరుగూల్చి
రాజవరులు గనుచుండగ వాని శి । రంబు డొల్లనేయా
ద్రోణ కృపాశ్వత్థామలు మొదలగు । తోడి యోధవరులూ
నొండొరులను బేర్కొర బిలుచుకొని । దండిసైన్యములతో
రథములు గజములు నశ్వభటులతో । రయమున జనుదెంచీ
అట్టహాసమున సౌభద్రునిపై । జుట్టుముట్టినంతా
ఆతడు లాఘవ లక్ష్యశుద్ధియును । నతి ధృడమును మెరయా
అంచితముగ కృష్ణార్జునులును గా । వించెడి నేర్పుననూ
కురువీరులు విన కోదండము గుణ । ఘోషము గావించీ
కఠినతరంబగు నారసచయముల । కడువడి బరగింపా
సర్వసైన్యములు గూలుచుండిరా । సమరంబున ననినా
అనియిటుదెల్పిన విని ధృతరాష్ట్రుం । డాత్మయందు నడలీ
సంజయ క్రోధముతో మనసేనల । సమయించుచునున్నా
నా మనుమని స్థితి నటుపై గనుగొన । నేమయ్యెనో చెపుమా
అని యిటు లడిగిన సంజయుండు ని । ట్లనె ధృతరాష్ట్రునకూ
జననాథా విరిగిన మనసేనల । గని యభిమన్యుండూ
పోనీయక నడ్డముగా తన రథ । మూని వేగనడిపీ
కొరవిద్రిప్ప తెరగున కురుబలముల । గూడముట్టి పొదివీ
పీనుగపెంటలుగాగ సైన్యముల । ఖూని నరుకుచున్నా
యక్కిరీటి తనయుని గని శర గురు । డాశ్చర్యంబుననూ

దరహాసితాననుడై ద్రోణుం డా । కురుపతి వినునటులా
పలుకవలయునను తలపున గృపునితో । బలికె నిట్టు లనుచూ
అన్నదమ్ములు తండ్రులు మామలు । నఖిలభృత్యులెల్లా
సంతసార్ణవంబున దేలగ నిటు । సవ్యసాచి సుతుడూ
కరుల హయంబుల దేరులు నుగ్గుగ । గావించెను నొకడూ
వాని జయించ నసాధ్యంబని నా । మానసమున దోచే
అన విని దుర్యోధనుడు దీనవద । నంబున నుండియునూ
సోమదత్త శల్యాదులు మొదలగు । భూమిశుల గనియూ
మానవనాయకులారా వినుమని । మరియు నిట్టులనియె.

వ చ న ము—

కర్ణ సౌబల సోమదత్త శల్యాది వీరులంగని దుర్యోధనుండిట్లనియె॥

నవరోజురాగం — చతురశ్రగతి

వీరులారా వింటిరే యీ । భారద్వాజుని పలుకులు
క్రూరుడైనా పార్థసుతుని । కొనియాడుచు నున్నాడు ॥వీ॥
శరములు బట్టెడి వారికి । గురుడు గదా యీ ముదుకడు
పెరవరిదై పసిబాలుని । శరకోట్ల కోర్వడయ్యె ॥వీ॥
యీయన సంకల్పము గన । వేరుగ దోచెను నామది
కీయడ నా సవ్యసాచి । కెంతయొ మేల్జేయ దలచె ॥వీ॥
వులిచి పురాధీశుడైన । నుమవరు దయ యెటులున్నదొ
తెలియదాయె నీ దురమున । చలము విడిచె శరగురుండు ॥వీ॥

వ చ న ము—

దుర్యోధనుం డివ్విధంబున దెల్పుచు గురుం డుపేక్షించి యున్నవాడు గాన మీరందరు గడంగి యీ సౌభద్రునిం బోనీక జుట్టుముట్టుం డనిన విని యంత దా సౌభద్రుం బొదువ జోవ వారల వారించి దుశ్శాసనుం డిట్లనియె.

## ర గ డ

భానుని బట్టెడి రాహు చందమున । బహువడివే జనియూ
ఒకగ్రండ నె బరిమార్తు జూడుడీ । యకిరీటి సుతునీ

యీశుత్రుడు మృతిబొందుట గనగనె । యా కృష్ణార్జునులూ
వెంటనే జత్తురు శోకభరంబున । తంటదీరు మనకూ
మనకు గల్గు పగదీరగలదు యభి । మన్యుని జంపిననూ
నాదు బాహుబల దర్పములను గను । డీ దురమున మీరూ
అనుచు సింహనాదం బొనరించియు । నంబకచయములనూ
గొట్టినంత సౌభద్రుడు గన్గొని । కోపనయను డగుచూ
షడ్వింశతి సాయకములు దుశ్శా । సను తనువున నింపా
అతడు ఘోరాస్త్ర సమూహము । నభిమన్యుని వేయా
అవ్వి డిర్వురకు దలపరాని పో । రగుచునుండె భూపా
కరలాఘవ శరలాఘవములచే । దురమున నిరువురునూ
తేరుల చిత్ర ప్రచారము జేయుచు । ధీరత బోరగనూ
చూపరు లట గొనియాడుచుండ నరు । సుతు డేడ్తెరనపుడూ
నీ తనయుని ధను వల్లన నరికియు । నాతని తనువెల్లా
నొక్క భల్లమున జించి యతనితో । జక్క నిట్టులనియే
విను దుశ్శాసన పాపరహితుడౌ । జనపతి ధర్మజునీ
సభను నొవ్వగా బల్కిన పల్కుల । సత్ఫల మీయడనూ
అనుభవింపగా జేతు చలింపక । నని నిల్వుమురోరీ
దుర్మదాంధుడవు నిన్ను రణంబున । ద్రుంచి నన్నుబెంచూ
తండ్రుల రుణ మిపు డేను దీర్చెదను । వరలిపోక నిలురా
అనుచు జత్రు దేశమ్మున నొక వా । లమ్ము వక్షముననూ
పెక్కునారసమ్ములు గ్రుచ్చిన వా । డక్కలల వడికీ
యెన్నడో జచ్చినయట్లు రథముపై । గ్రన్నన బడియుండే
అదిగని సారథి రథముదోలుకొని । ననికి దొలగిపోయే
అంతకు మును పాండవు లభిమన్యుం । డరిగిన మార్గమునా
సేనలగూడుక పద్మవ్యూహము । జేరబోవుచుండా
యెడనెడ నడ్డం బగు బలములతో । పుడమీశులతోడా
బవరము సేయుచు దలలుయెత్తి సౌ । భద్రుని జూచుచునూ
ఆతడు పగర బలంబుల గూల్చుట । కాత్మల బొంగుచునూ

దుశ్శాసను డట భంగపడుటకును । తోషహృదయులగుచూ
అభిమన్యుని శ్లాఘించుచుండగా । యిభపురినాథుండూ
వినుమో కర్ణా యభిమన్యునిచే । మన దుశ్శాసనుడూ
రణమున మూర్ఛిలె గంటివె యన నా । రాధాత్మజు డపుడూ
సేనగూర్చుకొని యభిమన్యునిపై । చెచ్చెర మార్కొనినా
అవ్వీరుడు క్రోధావేశుండై । యతని సేనలనెల్లా
మందజేసి రాధా తనయునిపై । మార్కొని యెత్తెరనూ
డెబ్బది నారసములు పటురయమున । దెరలనేసినంతా
రక్తావనుడై దివ్యాస్త్రంబులు । రయమున నైవగనూ
సరకుగొనక యభిమన్యుడు మదసిం । ధురములీల గదిసీ
అంగములెల్లను శరములు గ్రుచ్చిన । యంగరాజు డస్సీ
యుండుటగని యాతని తమ్ముడు బల్ । చండక్రోధు డగుచూ
అభిమన్యుని దాకియు హయసూతుల । నతని యంగములనూ
శరసముదాయం బడరించిన గని । నరనందను డపుడూ
కనుల కెంపుగదురగ పవి సమమగు । కాండంబులు బరపీ
తమ్ముని శిరమును దెగవైచిన రా । ధాత్మజుండు గనియూ
సనికి దొలగ తమసైన్యంబులు గని । నలుదిక్కులబారే.

వ చ న ము—

యివ్విధంబున సైన్యంబులుం దారునుబరచు దొరలం జూచి యాచార్యుం డిట్లనియె.

ముఖారి—ఆటతాళం (వలదురా)

వలదు వలదుపో । వలదు రాధాత్మజా ।
వలదు వలదిక చలమువిడచియు । కలనిలో ధైర్యంబులేకా ॥వ॥
వీరవర్యా కృపాచార్యా గుణధుర్యా ।
ధీరమతివీ పోరినిల్వక । బారుటస్మా మె బాలునొకనికి ॥వ॥
సౌబలా యిట్లు । జనుట మేలె నీకూ ।
సుబలముల గూర్చుకొని వ్యూహాము।జొచ్చి నిలువక కౌరవేశ్వర ॥

ధరణిలో నల్పి । పురవాసుడై వెలయు ।
పురహరుని స్మరియించుచును యీ।దురమునను జెదరకనునిల్చెడు॥వ॥

వచనము—

యివ్విధంబున ద్రోణాచార్యుండు పెక్కుభంగుల బురికొల్ప సెవ్వ రతనిపై కోల్తల సేయరైరి తదుపరి.

## రగడ

అభిమన్యుని కోల్తల కోర్వగలే । కను మనసైన్యములూ
దిక్కులకును బరతెంచుచున్న గని । నక్కుమారవరుడూ
సింహనాద మొనరించి శంఖమును । చెచ్చెర బూరించీ
గుణరావం బొనరించి కయ్యమున । తనివిసనక నతడూ
వెనుకదరిమి కార్చిచ్చు కానసం । బేర్చు చందముననూ
చతురంగములను గూల్చుచుండగా । సమరాంగణ మపుడూ
ఘోరాకారంబై గనుపట్టెను । కుంజర పరిపాలా
యేకవీరుడై వెలుగుచుండె నపు । డా కవ్వడి సుతుడూ
అనవిని ధృతరాష్ట్రుడు సంజయుతో । ననియె నిట్టులనుచూ
బాలుం డొక్కడు బహుసేనలపై । బడి పోరుచునుండా
పాండురాజ తనయుం డొకడైనను । పార్థ నందనునకూ
దోడుపడుటకై రా రదేమొకో । దోచదు కారణమూ
అన విని సంజయు డా ధృతరాష్ట్రున । కనియె నిట్టులనుచూ
విను భూపా పాండవు లభిమన్యున । కును దోట్పడ గడగీ
గజ యశ్వంబుల రథ సమూహముల । కడువడి గూల్చుచునూ
సత్వరమున ద్రోచుక వ్యూహమునకు । జనుచుండెడి వేళా
నీ పెనుమూకలు పాయలిచ్చి యని । నిలిచి చూచుచుండా
అప్పుడు ధీరోదారత సైంధవు । డడ్డముగా జొచ్చీ
పాండురాజ సుతులను రానీయక । యుండె సైంధవుండూ
అన విని విస్మితుడై యిట్లనియెను । యంబికాత్మజుంటూ
తనయునిపై ప్రేమను పాండవు లా ।దరమున సంజయుడా
తరలివచ్చు వారల నొక్కడు సైం । ధవుడు నడ్డపడగా

అతడు భుజబలాఢ్యుడై శూరుడై । యా కురుసేనలకూ
నేటి వీరుడై సింధురాజు కురు । మేటిగ బోరుటకూ
యేమి తపంబొనరించెనొ శౌర్యం । బెటుల సంభవించే
దెల్పుమనిన విని సంజయుడా కురు । ధీరున కిట్లనియే
జనవర దెల్పెద నాలకింపుమా । సైంధవు చరితమునూ
కౌంతేయులు వనము ద్రిమ్మరియెడి । కాలంబున నతడా
వనములకేగియు ద్రౌపది కతమున । వాయుకుమారునిచే
భంగమొంది దుఃఖాక్రాంతుండై । పరమేశునిగూర్చి
నిష్ఠతోడ తపమొనరించిన యా । నీలకంధరుండూ
కరుణారస భరితుండై సైంధవు । కనులకు మోల నిలువా
కనుగొని పరమేశా పాండవులను । కలసి గెల్చునటులా
వరమొసంగుమని వేడు నాతనికి । వామదేవుడనియే
నరునిదక్క తక్కిన పాండవులను । నరయ నొక్కదినమూ
నీచే వారితులయ్యెదరని వర । మిచ్చి శివుడు జనియే
అది కారణముగ సింధురాజునకు । నది సంభవమయ్యె॥

వచనము—

గావున నది కారణంబుగా నట్టి శౌర్యం బా రధికవీరునకుం గల్గె నాతని పరాక్రమంబు దెల్పెద వినుమని యిట్లనియె.

మధ్యమావతి — అటతాళం (వినరా దెల్పెద)

అవనీశ వినుమా । దెల్పెదనీకు ॥అ॥
అవనీశ వినుమా సైం । ధవుని చారిత్రము
వివరించెదను యతని । వీరవినోదము ॥అ॥
అతిజవనాశ్వము । లరదమునకు బూన్చి
ధృతిమీరధ్వజకాంతు । లతులితముగ మెరయ ॥న॥
చంద్రకాంతిని మించూ । ఛత్రచామరములు ।
యింద్రుడో యన హార । వీచులు వెలుగగ ॥య॥
చిత్తమందున గర్వ । స్వస్థుడై రథమెక్కి ।
అత్తరి పాండుకు । లోత్తములను దాకే ॥య॥

అరయ చప్పిడి పున్న । యాఖ్యుని రక్షించు ।
పురహారుని వరబలము । పూర్ణముగ దలచుచు ॥అ॥

వ చ న ము—

సైంధవుండు పాండుపుత్రుల కడిమి సరకుగొనక నార్చుచు వారికి నీ యల్లుం డడ్డపడియె.

## ర గ డ

యీావి నడ్డముజొచ్చి సాత్యకిని । నేడ్తెర దాకియునూ
సాయకత్రయమున గొట్టి భీన । ష్టకమున ముంచియునూ
ధృష్టద్యుమ్నుని నిరువదిశరముల । ధృతిని గొట్టి మరియూ
ఆ విరాటవల్లభుని శిఖండిని । నట పదిపదినేసీ
పాంచాలపతి ద్రౌపదితనయుల । పదినైదమ్ములనూ
యిరువదేను సాయకముల కేకయ । వీరులపై నింపీ
ధర్మనందనుని సప్తతిశరముల । తనువు స్రుక్కనేసీ
తక్కిన సేనలనెల్ల నిండగా । పెక్కమ్ములు గప్పి
గని ధర్మజు డాతని కోదండము । ఖండించినయంతా
సైంధవుండు వేరొక జాపముగొని । సరభసమున నేగీ
భీము గొడుగు చాపము కేతనముల । బిగ్గర నరికియునూ
విరథుండై బకరాతిసాంతకుడు । వికలసాధనుండై
సాత్యకి తేరున నెక్కినంత నీ । సైన్యంబులు యార్వా
అప్పుడు పాండవ బలములు । సైంధవు నంబకములు గప్పి
అన్నిటి మధ్యనె సమయించుచు సమ । రాంగణమున నిలువా
మున్ను రణమునకు దొలగియున్న నీ । ముఖ్య బలములెల్లా
కొల్లలజేసియు పాండవ బలముల । కును మూర్కొనినంతా
పోరుఘోరమై జెల్లె నప్పుడో । భూపాలా వినుమూ
అచ్చట పద్మవ్యూహ మధ్యమున । యాచార్యుండపుడూ
వాహినులను బురికొల్పి దరల్చిన । సాహసమున వెడలీ
అభిమన్యునిపై మూర్కొనినంతనె । నక్కుమారవరుడూ
నుక్కున గడగియు రథరథ్యంబుల । నురుతర గజములనూ

అనిగూల్చగ గని వృషసేనుడు న । త్యధిక రోషముననూ
సాయకముల నొప్పించినంత నా । సౌభద్రుం డపుడూ
నయమున శరముల వృషసేనుని సా । రథిని గూలనేసీ
అతని విల్లు నిరుఖండంబులుగా । నవని డొల్లనేసీ
ఆ వృషసేనుని మేను నొవ్వ నా । రంబకములు నింపా
అరిభీనుగ చందంబున రథమున । నొరగినంత నోనా
వాహానంబులా రథము నీడ్చుకొని । నాహావమును దొలగా
అంత వసాతిపురీశుడు వచ్చిన । నంతంబొనరించే
అందర నురుమూడగ నీ బలములు । నచట నిల్వలేకా
అతని శౌర్యమును దేరిచూడరా । కా కౌరవులెల్లా
ధీనులగుచు సౌభద్రుని మేనను । తెంపున నురికియునూ
చిగుచేలు పెనుజోర ముఖంబున । జొరిన తెరంగుననూ
మృగములు దావానలమున కెదురై । నగబాకినరీతీ
యోధులుబారుచు సాగరంబులో । దూరిన చందమునా
అభిమన్యుని వాతనుబడి సైన్యము । లాహావమునుదక్కీ
నలుదిక్కుల బారుట గని శల్యుని । నందనుండు వడిగా
వీనికి భయపడి బారనేల నే । వీని బట్టిదెత్తూ
నాబారింబడి బ్రతుక నేర్చునే । నరనందనుడిపుడూ
అనుచు రుక్మధరుడంబకసమితిని । నభిమన్యునిపైచీ
మరల నారసము లేయ గడగునెడ । నరనందను డపుడూ
నుగ్రశరంబుల వాని శిరంబును । నుర్విబడగ చేయూ
రుక్మధరునిగని యతని చెలులు బల్ । రోషంబును బెంచీ
కౌరవవీరులుగూడి గ్రమ్మిరా । కర్వడి నందనుపై
శస్త్రాస్త్రంబులు జుట్టిముట్టగా । సైన్యము గని విభుడూ
అభిమన్యుడు దెగియెనుగా దలచియు । నతి శంతోషమునా
నుండునట్టి సమయంబున రేగి యు । ఖండ రౌద్రముననూ
మఘవుని మనుమడు గాంధర్వీ యను । మాయనుగావించే
అదియు తొల్లి యర్జునుని తపంబున । కలరి తుంబురాదూ

లోఁగగుటబట్టియు నా నృపతుల యా । లోకనంబులకునూ
పెక్కురథంబులు రథికులు గ్రమ్మిన । యక్కరణిని దోఁచే
అందుచేత కౌరవసేనలు వెగ । డొంది జూచుచుండా
అమ్మహాశూరుడు మండలప్ర । చారమ్మొజేయుచుండీ
తేరుమెరయ దిరుగుచు వాలమ్ముల । వారల గూల్చుచునూ
బడలు పరచుచున్నంత సైన్యములు । పరుగులిడుచునుండా
కరిపురీశు డభిమన్యుని కడిమిని । గదిసి యోర్వలేకా
విముఖుం డయ్యెనటంచును విని కురు । విభు డిట్టుల ననియే॥

వ చ న ము.—

మరియు సంజయుంగని ధృతరాష్ట్రుం డిట్లనియె.

మలయమారుతము—రూపకము

నమ్మదగని మాటలిట్లు । నా ముందుగ బల్కుటేల ।
అమ్మఘువాత్మజు సూనున । కంత బలముగలదె సూతా
యిమ్మహి నృపవరులను క । య్యమ్మున నా పసిబాలుం
డమ్ముల సేనల నెల్లన్ । యిమ్మహి గూల్చెనటంటివి ॥న॥
యే లీలను సమయించెనో । యిట్టి సైన్యముల నొక్కడు
చాల యద్భుతముగ దోఁచె । సంజయ యీవార్త వినగ
వాలాయంబుగ నుల్చిఫు । రీ లోలుండై వెలసిన
శూలధరుం డీ రూపున । జొచ్చి చంపుచుండెనేమొ ॥న॥

వ చ న ము.—

అనిన నమ్మనుజవల్లభునకు సంజయుం డిట్లను పెక్కండ్రు రాజులు జచ్చుటయును సుయోధనుండు వెరలుటయు గని భవత్కుమార వర్గంబులున తోడి యోధులును మేనులు సెమర్చ మొగంబులః వెల వెల బారి నోళ్లెండ గాళ్లు వడంక నలుదిక్కులం జూచుచు ధృతి దరిగి వెరచరచి విరిగి రప్పుడు మగుడ కోల్తలు జేసి కురువిభుండు గురుపుత్ర కృప కర్ణ కృతవర్మ బృహద్బల సౌబల సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనినంత నతండు.

# రగడ

అతిరోషావేశుండై నుబ్బున । నందరిపై గవిసీ
పెద్ద పిన్నయని యెంచక నేత్తెర । పిడుగు చందముననూ
గర్జిలి యతివేగంబున నురికిన । కౌరవ బలమెల్లా
రథములతో కరి తురగంబులతో । రణము విడిచి చనగా
గనుగొని లక్ష్మణు డాక్రోశుండై । కవ్వడి సుతుదాకా
ఆగ్రహమున పది తుల్యశరంబుల । నా లక్ష్మణు బొదువా
తనపుత్రుని సమరంబున విడువగ । మనమోర్వక విభుడూ
కొందర రథికుల గూడుక యర్జును । నందనుపై గవిసీ
కొండలపై నంబుదములు వర్షము । గురియు చందముననూ
అందరు సౌభద్రునిపై బొదివిన । నాతడు మార్కొనియూ
భూరిశరంబుల కౌరవసేనల । బొరిబుచ్చుచు మరియూ
పులి కొదమను విదళించెడి సింగము । పోలుపున లక్ష్మణునీ
మదమెలర్ప బాహువులు వక్షమును । మరియు నొవ్వనేసీ
నను దప్పించుక నెచటికి బోగల । వనుచు క్రోధవశుడై
క్రూర శరంబున లక్ష్మణు శిరమును । కుండలములతోడా
నిల డొల్లగనేసిన సైన్యంబులు । నీ కుమారవరుడూ
దైన్యంబున కడు శోక తప్తులై । దరికి నొదిగియుండా
తనయుగూల్చి వీరావేశంబున । నని దిరిగెడివానీ
గని దుర్యోధను డార్తరవంబున । మనమున నడలుచునూ
రథికులతో సేనలతో నిట్లనె । రాజవర్యులారా
అందరు నొంపుడు జంపుడు పైబడి । యభిమన్యుని తృటిలో
వెరువకుడని కేకలువేసిన స । త్వర వారందరిలో
గురుకృతవర్మలు కృపుడు బృహద్బల । గురుసుత కర్ణులునూ
వీరావేశమ్ములతో గదిసియు । క్రూరనారసములా
గొట్టినంత సౌభద్రుడు తన కను । గొనల నెఱ్ఱజేసీ
సేనల నెల్లను వెగడుపరచి త । త్సేనల విడనాడీ
అచ్చట బోరెడి సైంధవు జేరగ । నభిమన్యుండపుడూ

తన తేరును దోలించుచుండగా । గని కౌరవ బలమూ
అల కాళింగ నిషాదులు కరులతో । నడ్డపడినయంతా
అతిరథ సింహుం డా సౌభద్రుం । డా సేనకుమరలీ
గజబృందముతో సేనల నెల్లను । కదనభూమి గూల్చ్చ
తక్కినయోధులు మొత్తముతై నలు । ప్రక్కల గదిసియునూ
పెక్కుబోతులు జుట్టుముట్టుకొని । పెనగురీతిగానూ
అభిమన్యునితో బోరుచుండగా । నచట సైంధవుండూ
కౌంతేయ బలముల రానీయక । కదనరంగముననూ
బోరుచుండగా నిచట సుభద్రా । పుత్రుడు నేడ్తెరనూ
పంచాశద్బాణంబుల నించెను । భారద్వాజునిపై
అల కృతవర్మ నశీతిశరంబుల । నడలిగొట్టి మరియూ
పదినారసముల నశ్వత్థాముని । పై బరపించియునూ
కర్ణు నొక్కశరమున సృక్కించియు । కనలి కృపుని నెదిరి
విరథుని జేసి బృహద్బలు ముప్పది । విశిఖంబులగొట్టి
పెక్కుబలంబుల పెక్కుమ్ములచే । జిక్కుబరచుచుండా॥

వ చ న ము—

అట్టి సమయంబున శారద్వతుండు దోడి నేవురంగూడి క్రీడికొడుకు జేయు ఘోర సమరంబు గని వారల కిట్లనియె.

ధన్యాసిరాగం—ఆదితాళం

యేలోకమందైనా యిట్టి । వింతా గంటిరే ॥మీరెన్నాడైన॥
యీలోకమునం దీలాటి । వీరూ గంటిరే ॥యే॥
వాలికతూపుల కోల్తలకును పెను । గాలిదూలు వగుడాకలోయనగ।
కూలెబలము సోలి వ్రాలుచుండెను । బాలుడిట్టి సమరం బొనర్చెనని॥
యిక్కరణిని పద్మవ్యూహ । మెటులాజొచ్చెనో । నొంటిగ ॥
యెక్కడి బాలుడు మోహార । మెక్కడి సమమో ।
ఒక్కడట్టి రథికుల రణశూరుల । సృక్కడంచి చిక్కుబెట్టి జంపుచు ।
యిక్కయ్యమునందేయడ శరముల । జిక్కడాయె । పెక్కుబలము
గ్రమ్మిన ॥యేలోకమందైనా॥

యింత చిరుతనయసూనాని । కెటులా గరపిరో । సమరము ।
యింతటి బల శరవేగము । లెటులా నబ్బెనో ॥
మంతనమెంతో సంతసించె యీ॥మహిని నుల్చిపురవరమున వెలసియు
సంతసమున పున్నయ్యచౌదరిని । సంతతమే లేడి । శంకరుడేమో॥యే॥

వచనము—

కృపాచార్యుం డిట్లనుచు తోడివారలతో గూడుకొని యన్నర నందనుపై గవిసి శరవర్షంబు గురిపింప గని క్రోధావేశుండై యతం డందరి నొప్పింప వెరవున నందరు బరతెంచుచున్న గని బృహద్బ లుండు గవిసి నిసిత సాయకంబులు బరగించిన యన్నరనందనుండు చెలరేగి॥

# రగడ

గదిసి బృహద్బలు చాపకేతువును । కడిమి మెరయ నరికీ
విదితముగా సారధి యాశ్వంబుల । నిలను ద్రొల్లనేయా
గని బృహద్బలుం డాగ్రోశుండై । ఖడ్గము చేగొనియూ
తనపై విసరెడి తలపున నుండిన । గని సౌభద్రుండూ
ఒక్క భల్లమున వాని శిరంబును । గ్రక్కున ఖండింపా
ఒక్క మొగిని యాతని బంధువ్రజ । మొయ్యన జనుదెంచీ
నురవడింప వారల యేపును స । త్వరలో మాయింపా
పరవల్లొనరించుచు కర్ణుం డా । పార్ధ సుతుని దాకా
గడగి కర్ణి కానారాచంబుల । గర్ణుని నొప్పింపా
తడయక నిర్వురు నొకరు నొకరిపై । తప్పక మార్కొనియూ
పోరుచుండ మేనుల శోణితమును । పూర్ణము గానిండా
ఆరయగ సాంధ్యాకాలపు రవి బిం । బములో యున నుండే
అప్పుడు కర్ణుని నాయకులార్వురు । నమితగర్వములనూ
అప్పార్థుని తనయునిపై గవిసిన । యంత నతడుగినిసీ
అందరి గర్వంబులు మాయించియు । నతి విచిత్రముగనూ
అందు విహారము సల్పుచుండ గని । యాచార్యుడు మొదలూ

వీరులు శరములు నింప వాటి న । న్నింటి మరల్చుచునూ
వారిమేనులను సాయక పంక్తులు । వరగించుచునుండా
అద్భుతమై గనుపట్టెను సమరం । బవనీశా వినుమా
బుద్బుదమౌ తను ధనములకిట్టుల । బోరుచుండి రథిపా
అట్టిసమయమున మగధరాజు కొడు । కశ్మంతకు డపుడూ
ధిట్టతనంబున యభిమన్యునిపై । తీవ్రత మార్కొనినా
గడగి సూతు రథ్యంబుల శిరములు । కడువడి నరికియునూ
విడువక నశ్మంతకుని మస్తకము । పుడమిని బడవైచీ
భూరితరంబగు సింహనాద ము । ప్పుడమి నవియ జేయా॥

వ చ న ము—

తత్సంరంభంబు సైరింపజాలక దుశ్శాసన సూనుండగు దౌశ్శాసని కోపతామ్రాక్షుండై వచ్చి యభిమన్యునిం గని యిట్లనియె.

యెరుకలకాంభోజి—అట (జనని)

నిలువరా । సౌభద్ర వెరువకనూ ॥ని॥
కలనిలో నిన్నెదురు శూరులు । గానరారని ప్రేలుచుంటివి
నళినగర్భుని యల్లుడా నిన్ । చలమునను సమయింతు నిచటా ॥ని॥
యెరుగవా । దౌశ్శాసని యనుచున ॥న్నె॥
యెరుగవా యీ పద్మవ్యూహము । కేలవచ్చితి వయ్యయోనిన్
గరువమున గన్నట్టివారల । కన్నుల కఱదాదు వకటా ॥ని॥
బాలునీ । యెటుబంపిరోగాని ॥బా॥
చాలగా (శ్రీ) వుల్చిపురమున । స్థాణుడై నివసించి పున్న యు
నేలు గౌరీ లోలుడగు త్రి । శూలి దయలేకిటుల వచ్చితె ॥ని॥

వ చ న ము—

దుశ్శాసను సూనుం డిట్లనుచు నరనందనుం గదిసి.

## ర గ డ

బాణచతుష్టయమున రథ్యంబుల । బడల్బడగొట్టీ
రాణమెరయ నొక నారసమున సా । రథిని చొక్కజేసీ
పది సాయకముల పార్థనందనుని । హృదయము నొప్పింపా

ఆతడు రోషకషాయిత నేత్రుం । డై యాగ్రహముననూ
సరగనేడు కాండము లా దుశ్శా । సను సుతు నొప్పించీ
వానితోడ నిట్లనియెను భద్రా । సూనుడు వినుమనుచూ
యింతకుమున్నుగ నీ జనకుడు నా । చెంత రణమొనర్చీ
పిరికిపందయై యోడిపారె నీ । వెరుగక వచ్చితివీ
తలచుకొనుము నీ తల్లిదండ్రులను । దలచుము సతి సుతులా
వలనుజిక్కి కుందేలు దప్పుకొని । దొలగిపోవగలదా
అట్టుల నాచే జిక్కితివిక నీ । వెట్టుల బోగలవూ
అనుచు నొక్క క్రూరాస్త్రంబును నా । తని తనువున నేయా
వచ్చెడి శరమా ద్రోణకొమారుడు । వడిగా ఖండింపా
అతనిదిక్కు వీక్షింపక యాతం । డతిరయమున నేగీ
దుశ్శాసను సుతు చాపము నరియు । దొడరి నూతుగూల్చి
ఆరమ్ములు యురమున గ్రుచ్చిన గని । యా యువకుండపుడూ
రయమున వేరొక తేరికురుక నప । రాహ్ణామయ్యె నపుడూ
చంద్రకేతుడును సూర్యభానుడును । శత్రుంజయుడొకడూ
మేఘవేగుడు సువర్చసుండు మొద । లగు నేవురు వెడలీ
మొత్తంబై తాకిన ధనంజయుని । ముద్దు కుమారుండూ
మేటి మగల నానాస్త్ర చయంబుల । మేనులు జించియునూ
ఖండ ఖండములు గావించిన గని । గాంధారాధిపుడూ
మార్కొనినంతనె వాని శరీరము । మార్గణముల జించీ
దుర్యోధను దెస కరిగెడి పీకుని । దోర్బలమును గనియూ
అంగరాజు యాచార్యునితో ని । ట్లనియె భీతిగొలుపా॥

వచనము—

కర్ణుండా ద్రోణాచార్యుం గని యిట్లనియె.

మఃఖారి — అటతాళం (పలమురా)

దండింపకుండుట । తగునా ద్రోణాచార్యా । ఘొనుచుండెనుమాకలా ।
దండిమగనై వ్యూహమున య । ఖండలుని మనుమండు నొక్క డ।
ఖండిత తేజుం డగుచు సేనల । గండడంచియు । గదలెనిచటికి ॥దం॥

పాలార్చెదవేమో । బాలుండటంచు నీ । వేలీల దలచితివో ।
శూలిమును త్రిపురాసురులపై । నాల మొనరించిన విధంబున ।
కూళు డిటు మనసేన జొచ్చియు । గూల్చుచుండెను జాలిగొనక ॥దం॥
యెట్టలైనను వీని । దిట్ట శరంబుల । మట్టి చంపగవలదే ।
యిట్టి వీరుడుగలడె భువి నే । పట్టణాధిపు పట్టియైనను ।
గట్టు నిలయుం డుల్చిపురి శ్రీ । గౌరి హృద్వల్లభుని సాక్షిగ ॥దం॥

వచనము—

కర్ణుం డాచార్యున కిట్లు బల్కుచు మరియు.

## రగడ

అని యిటుదెలుపుచు కురుపతి కడ్డము । జనిన యంతలోనా
ఆచార్యుం డచ్చటి యోధులతో । ననియె నిట్టులనుచూ
అభిమన్యుం డర్జును లోక రూపులె । నరయ వేరులేదూ
చూపరులకున్ బసివాడెగాని బల్ । శూరవరుం డతడూ
ఒక్కడి కొక్కడు జిక్కువాడుగా । డిక్కయ్యములోనా
మనమందర మొక్కటిగా గూడుక । మఘవాత్మజు సుతునీ
చుట్టుముట్టవలెనని కురుసేనల । ధిట్టత బురికొల్పా
యురవడించి పై గ్రమ్మనంతలో । నరనందనుచేతా
బాణపీడితుండై యా కర్ణుడు । భారద్వాజునితో
దేవా నాదెసజూడు వీడు న । న్నే విధి నొప్పించే
అచట నిలువదగు వీలులేకనే । నా సమరము విడిచీ
యీలు గరచుకొని వచ్చినాడ గాం । డీవితో నిదివరకూ
కయ్యంబున మార్కొని యెరుంగుదును । గాని యింతబలమూ
శరపటుత్వమును గానవైతినో । శరగురువర యనినా
విని యల్లన నగి గర్ణునితో ని । ట్లనియె కుంభజుండూ
కవచధారణం బను విద్యను నే । కవ్వడి కొసగితినీ
ఆవిద్యను యీతడు గ్రహియించెను । నందుచేత వీనీ
నొప్పింపగ జాలరు యెవ్వారలు । నెప్పగిదిని నైనా

వంచనచే సింజిని ద్రుంచియు జా । పంబు విరుగనేసీ
ఘోటకముల దునుమాడి సారథిని । గూల్పజాలుదేసీ
చెప్పినటుల జేయుము యవీరుని । చేత ధనువు గలఃగా
వానిజయించుట సురకైన భువి । వలనుబడదు కర్ణా
గావున నందర మొక్కటిగాయై విలు । ఖండింబొనరించీ
విరథుజేయ పై నెట్లులుండునో । నరయుదమో రవిజా
అరధికోత్తము వీరపరాక్రమము । లటుపై దెలియుదమూ
అనవిని కర్ణుడు భీతిజెందినటు । లభినయించి యపుడూ
వీరవినోదుండౌ యభిమన్యుని । వెనుకకు బరతెంచీ
వెరచి యొదిగి యా రథికుపిరిండికి । వేగజుట్టివచ్చీ
మోసము జేయగ దలచియున్న గని । మోహరమున బలమూ
జుట్టుముట్టి నెదిరించి పెనంగెడి । నట్టి సమయమునమూ
వెనుక కర్ణుడొక క్రూర భల్ల భల్లమున । విల్లుద్రుంచినయంతా
గురుడు రథ్యముల కృపుడు సారథిని । గూలనేసిరపుడూ
విరథుడగుచు కోదండ రహితుడై । వెరపులేక యతడూ
దిరుగుచుండ కృతవర్మ శకుని బా । హ్లీక గురుసుతుడాదీ
సకల యస్త్రశస్త్ర ప్రకరంబుల । సవ్యసాచి సుతునీ
చిక్కున ద్రోచిన నేమి దోచకను । నక్కుమారవరుడూ
వాలును బలకయుగొని సౌభద్రుడ । వారి తగతిరేగీ
దివికెగసి యుపిక థాజోయనగను । దిరుగుచుండె వడిగా

వ చ న ము—

మరియు నాయభిమన్యుండు గగనంబున కెగసి తన విద్యా ప్రభా వంబున మండల ప్రచారంబు సేయుచు.

మోహనరాగం — చతురశ్రగతి

వినువీథిని సంచరించె । వినతాసుతుడోయనగను
గనుచుండెడి వారికనుల । కును విభ్రమమై దోచగ ॥వి॥
తెంపున ఖేచరుడనగ జ । రింపుచుండ మూకలు భయ

కంపితులై హృదయములను । భ్రాంపిరి బోయిరి సేనలు ॥వి॥
విలయ కాలరుద్రునిగతి । వీగవినోదము సల్పుచు
బిలములపై సంచరించు । బాలుడు తన కెదురులేక ॥వి॥
యిలనునుల్చి పురినివెలయు । యిందు ధరుని కరుణలేక
కలనిలో విరధుని జేసిరి । ఖలులు మోసమొనరింపగ ॥వి॥

వ చ న ము :-

యిట్లొంటరియై యంబర మార్గంబున దిరుగుచున్న నయ్యభి మన్యునేమరి పాటునుంగని ద్రోణాచార్యుండప్పుడు

## ర గ డ

ఒక్క భల్లమున వాలునరుకగను । నక్కర్ణుండప్పుడూ
పలకనొక్క నారాచంబున బలు । పరియలు గావింపా
సౌభద్రుడు తన రథముపైంగల । చక్రముగొని యతడూ
సంరంభంబున విజృంభితుడై । స్వర్గనాధులీలా
నెత్తుట జొత్తిలు మోముతోడ వి । యత్తలముననుండీ
అతి భయదంబగు సింహనాద మ । ద్భుతముగ గావింపా
కౌరవసేనలు నతిభయంకరా । కారులగుచు నుండా
తనరథాంగ రోచులతో మణికం । కణ కాంతులు మెరయా
సిల్లుజూపుమద సింధురమోాయన । చెలగి పార్ధసుతుడూ
భారద్వాజుండున్న దిక్కునకు । బరువిడుచుండగనూ
ఆచార్యున కడ్డంబై వచ్చెడి । యరిసేనల నెల్లా
చిక్కినవారల జిక్కినట్లుగా । ఛెండాడుచు నుండా
బాలుని తను సౌందర్యము మగటిమి । బలముచలము నెల్లా
చాలగ గీర్తించిరి ఖేచరులా । బాలుని మేలనుచూ
అట్టియెడను కృతవర్మ శకుని కృపు । లా రాధాత్మజులూ
శల్యాడాది యోధులు పెక్కండ్రట । సకల దిశల బొదివీ
అతనిచేతి చక్రంబు తునియలై । యవని బడగగొట్టి
గదగొని యశ్వత్థామ మేనవడి । గదియుటగని యతడూ

అశని మెరుంగుల మించు దానిగని । యడలుచు ద్రోణియునూ
బెదరి రథము డిగి పిరిదికి జన గని । భీభత్సుని సుతుడూ
ద్రోణి రథ్యసారథులను గూల్చియు । తక్షణ మట వెడలీ
సాబలు దెసకేగుటగని యాతని । సైన్యము లడ్డముగా
గాంధారులు వచ్చిన వారందరి । కడువడి బోరిగొనియూ
చలమున నందరి నుల్లసమాడుచు । సంచరించుచుండా
దుశ్శాసన సుతు డరదము బూన్చుక । దోర్బలమున రాగా
అభిమన్యుండేచియు సారధి నూ । తాశ్వంబుల గూల్చి
విరథుండై దాశ్శాసని గద గొని । వే రథమును డిగ్గి
గదిసి గదా దండంబులు నిస్సాను । గైకొని ద్రిప్పుచునూ
నీ మనుమలు రోషముల నుదించిన । సామజములరీతీ
ఒకరి నొకరు జంపెడి తలంపునను । నుగ్రత బోరుచునూ
గదలు మండ నెత్తురులు దొరంగగ । కండలు జదరగనూ
నెమ్ములు మాంసము పిండియగుచు రణ । నేల ప్రాలుచుండా
పోరి పోరి స్పృహదప్పి యిద్దరా । భూమిని వ్రాగనూ
ప్రాణంబులు తనువున నిల్వక వే । బోరిపోయె దివికీ॥

వ చ న ము—

కురుభూపా నీ మనుమండగు యభిమన్యుండు వీరావేశంబునబోరి పోరి రణభూమింబడి ప్రాణంబులు విడిచె నెట్లనిన.

దేవగాంధారి — ఆదితాళం

వినుమో భూపాలచంద్రమా – సౌభద్రుని పాటు ॥వి॥
వనసామజ మంబుజాకరంబు న – వారణగతిజొచ్చు గలచుచుండగ।
మనమునందు కృపమాలి బోయడొక – మాటునుండి జంపుమాట్కి గూల్చిరి ॥వినుమో॥
భవదీయంబగు సేన లొక్కుమొగి – పల్వురు నల్దిక్కులజుట్టి యా।
దన వల్లభు మేనల్లుని నిర్ధయ – భావంబుల బట్టి గొట్టి చంపిరి ॥వి॥

గురుడు కృపుడు కర్ణుడు గురుతనయుం - డరయ ద్రోహమతులై యా
చిరుతని । ధరను నుల్చిపురి పరశివు సాక్షిగ - దు:రమున మోస
మొనర్చి ద్రుంచిరట ॥విను మో॥

వ చ న ము—

సంజయుం డా ధృతరాష్ట్రునకు దెల్పుచు మరియు నిట్లనియె.

సీ॥ జగము లన్నియును దే ♦ జంబున వెలిగించి
యపరాద్రి కేగిన ♦ తపనుమాట్కి
తరుచైన కానల ♦ దరికొని నిరువుగా
జేసి యారిన దవ ♦ శిఖివిధమున
గగనంబుతో రాయు ♦ కరళులు గల జలం
బివుర బారిన మహా ♦ ర్ణవము కరణి
నున్నతగతిజెడి ♦ యుర్విపై గడు విన్న
నై వడియున్న సు ♦ ధాంశు భంగి

గీ॥ బీరమున దమవారికి ♦ బెంపొనర్చ
యరుల సమయించి వసమరి ♦ యనువుదప్పి
తెగియు జూట్కికి జాల ♦ వే ♦ గగుచు దోచె
మహితమూర్తి శోభితు డభి ♦ మన్యు డధిప.

వ చ న ము—

సంజయుడు కంట నీరిడుచు మరియు నిట్లనియె.

## ర గ డ

నెత్తుట దోగియు పడిననేల గన । నింగి తెరగుదోచే
ఆసాభద్రుండందు జంద్రు క్రియ । నలతి యొప్పుచుండే
హారమణుల శరఖండము లచ్చట । దారలవలె దోచే
కరికళేబరంబులు కొండలగతి । గన్పట్టెను భూపా
అశ్వగాత్రములును గ్రాహంబుల । నట్టుల. గన్పడియే
నరశరీరములు మీానచయమ్ముగా । దిరుగుచుండె నపుడూ

కౌక్షేయ కస్తురికాది శస్త్రములు । కాలసర్పములుగా
నెమ్ముల తుమురట యిసుకదిన్నెలుగ । నెత్తురేటిలోనా
గనెడి వారలకుజలనిధివలె సం । గ్రామము గన్పడియే
యోగనిద్రవారాసిని బండిన । భోగిశయను రీతీ
శోభిల్లుచు గన్పడె నెల్లరకును । సుభద్రాత్మజుండూ
అసువులువిడి రణభూమిని బొర్లెడి । యభిమన్యుని గాంచీ
నీ సైనికులతి సంతసములతో । నింగిముట్టు నటులా
అత్యద్భుతముగ నార్చినంత విని । యా పాండవులపుడూ
కన్నులనీరు దొరంగ నందరా । పన్నత దుఃఖింపా
అభిమన్యుడు బడుటకు వగజెందుచు । నవని యరచునటులా
నుండునట్టి సమయంబున నట ను । ద్దండత భూతములూ
పెక్కు బలంబులు నొక్కటగుచునని । నొక్కని జంపుటయూ
యిదియుధర్మమో హోయని యరచెను । వెలుగుదిశలు నిండా
శౌర్యసారుడౌ సౌభద్రుండా । సమరంబున బడుటా
వారిసైన్యములు భయకంపితులై । ఘోరదుఃఖములతో
భండనంబు జాలించి దీనులై । పరువులెత్తుచుండా
గనిధర్మజుడా యోధవీరలో । కంబున నిట్లనియే
గజతండంబుల పగరబలంబుల । నిజస్యందనములతో
కడిమి పదాదుల తురగంబుల పె । క్కండ్రు సైనికులనూ
నేలకు గోలకుదెచ్చి చంపి మా । కల విరియించియునూ
శరగురు మొదలగు యోధులనెల్లను । బరిగోలల ముంచీ
ఒక్కదెసకు దరిమిన వారందరు । నొదిగి నొదిగి యుండా
అంబరమున ఖేచరులునుతించిరి । యాశ్చర్యంబులతో
ఘనుడై నాకము చూరగొన్న యా । ఘన బాలుని జూచీ
శోకరోషములు బెనగొన ధర్మజు । డా కదనములోనా
నిలిచి బలంబులతో నిట్లనియెను । వలవదు శోకింపా
పగతురగండడగింతమనుచు తన । బలముల వీక్షించీ
బరవసంబు జేసియు తనసేనల । బురికొల్పుక నతడూ

పటురోషంబున నిలచి నంతలో । పద్మబాంధవుండూ
పశ్చిమాద్రి కేగిన తిమిరంబట । ప్రబలి గ్రమ్ముచుండే
అట్టితరిని సకలంబగు భూతము । లావరించుకొనియే
రక్తము పానముజేయుచు మాంసము । నక్కజముగ మెక్కె
జంబుకముల రోదన మెక్కువయై । సమరతలము నిండే
అప్పుడు సంధ్యాకాల చీకటులు । నన్ని దిశల నిండే
అదిగని నుభయ బలంబులు శిబిరము । లకు జేరిరి యధిపా
అచ్చట నీ తనయులు హృదయంబుల । నలరుచుండె రాజా
విన్న వదనులై పాండునందనులు । కన్నుల నీరిడుచూ
తమ పరివారంబుల నెల్లను శిబి । రములకు బంపియునూ
దీనవదనులై యున్న సోదరుల । దిక్కు మొగంబగుచూ
ధర్మజు డిట్లని విలపించెను నరు । తనయుని మది దలచీ॥

వ చ న ము—

ధర్మజుండు ధైర్యంబుపేడి వివర్ణ వదనుం డగుచు తనయుండగు సౌభద్రునింగూర్చి యిట్లని విలపించే.

ఆనందభైరవి — ఆదితాళం

చిట్టి నాన్నా సౌభద్రా ని - న్నట్టి పద్మవ్యూహమునకూ ।
యెట్లులా బొమ్మంటి కలుష - మిట్టులా వడిగట్టుకొంటి ॥చి॥
యెంతకఠిన మానసుడనే - నెంత నిర్దయా హృదయుడనో ।
సుంతైనా కనికరములేక - సూనుడా యని కేగుమంటి ॥చి॥
అయ్యయ్యో యర్భకా నే మిా - యయ్య కేమందురా కొడుకా ।
వెయ్యేండ్లూ వెదకినాగానీ - యెయ్యెడనిను గందుర కుఱ్ఱా ॥చి॥
పులిచిపుర నివాసూడైనా - వ్యోమకేశూ కరుణ మనపై ।
దొలగకున్నా నీ వీలాగా - దురమునా గూలుదువటరా ॥చి॥

వ చ న ము—

ధర్మజుండు లోలోనం బొగలుచు మరియు నిట్లనియె॥

## రగడ

సాహసుండవై సమరము జొచ్చియు । సమసితివే తనయా
గురు శారద్వత ముఖ్యయోధవర । గుప్తసేన జొచ్చి
నను మెప్పింపగ బూని యొక్కడవు । జనితివే కుమారా
ఆలమందలను సింగముజొచ్చిన । యట్టుల నీవేగీ
పోరున వీరవరేణ్యుల శిరములు । భువిని డొల్లనేసీ
యీరసున మనలను సాధించెడి దా । శ్యాసను వధియించీ
చతురంగంబుల గాసిలజేయగ । నితరుల తరమౌనే॥

వ చ న ము—

అని విలాపించుచు మరియు నిట్లని శోకించుచుండే.

ముఖారి — ఆటతాళం (వలదురా)

యెటులా వచియింతు - యిందు కలాభరణా ॥యె॥
కటకటా యటనుండి యర్జును - డిటకు జని కొడుకేడయన నే ॥నె॥
పరమా పురుషుడు - పతితాపావనుడైనా ।
హరికి హృదయం బగులునట్టుల - నమిత శోకము బెట్టితీ ॥యె॥
సుగుణముల రాసి - సుభద్ర నెంతయో ।
వగను గుందగ జేసితిని యా - మగువ కేమని దెల్పగలనో ॥యె॥
భువిని చప్పిడి - పున్నయాఖ్యాని నేలు ।
భవుడు నుల్పిపురీశుడౌ శివ - ధవుని కృపలేదేమొకో ॥యె॥

వ చ న ము—

ధర్మజుం డిట్లనేక విధంబుల బలవించుచు మరియు నిట్లనుచుండె.

## రగడ

అయ్యో బాలుడు సుకుమారుడు పె । క్కాలములకు జనడూ
అట్టివాని మొన జొరుమని పంపితి । నజ్ఞానుడ నగుచూ
ఆస దోసమెంతకు దెచ్చెను న । న్నయ్యో యేమందూ
కుడువను గట్టను బిట్టురుగాని । కొడుకుల నెవరైనా

మొనజొరుమని నిర్దయచే బంపెడి । మూర్ఖులెందు గలరో
పాపకర్మముల నొడిగట్టగ యీ । పాండు సుతుడు దశా
లోకమునం దింకెవ్వరుగానతు । నాకుదప్ప మరియూ
నీవేగిన యా పుణ్యలోకమున । కే వచ్చెద తండ్రీ
వగను గుందు నీ జనకు డర్జునుని । మొగ మెట్టుల జూతూ
దేవనాథునకు నాపదగల్గిన । దీర్పనెంచి యతడూ
కాలకేయ దానవులగూల్చి సుర । కాంతు మెప్పువడసే
అట్టివాని సుతు ననిలో గూలగ । నజుని నేమనందూ
తనయుని గూల్చి రటన్న మాటవిని । ధనంజయుండపుడూ
కురుకుల కోటుల గూల్చకున్నె త । చ్ఛరపంక్తులచేతా
అర్జును దుఃఖము నార్పజాలునే । యమరేశ్వరుడైనా
యేమిగాగనున్నదొ దెలియగరా । దేమి దోచదనుచూ
కడు శోకాతురుడై యుండిన యా । కౌంతేయుని కడకూ
సాత్యవతేయుం డరుదెంచిన గని । సార్వభౌము డపుడూ
యెదురేగియు సాష్టాంగ మొనర్చియు । యెతివరు దోడ్తెచ్చీ
అర్ఘ్యపాద్య పూజా విధానముల । నారాధించియునూ
వుచితాసనమున గూర్చుండగ ని । యోగించియు నృపతీ
అమ్మహాత్మునకు నిట్లనె ధర్మజు । డతి దుఃఖితుడగుచూ
పగరసేన భేదింపగ మా సౌ । భద్రు నంపినాడా
ఫెనుదీయక నాబాలుడు జొచ్చెను । వెరవు సుంతలేకా
వెంట మేము జనుచుండగ సైంధవు । డేడ్తెర వచ్చియునూ
మాకడ్డంబై నిలిచినంత మే । మాకవ్వడి సుతునీ
జేర ననువుదప్పిన కౌరవ బల । మారయ గుములగుచూ
పెక్కం డ్రొక్కని మార్కొని జంపిరి । నక్కటికము లేకా
పసిపాపడు సుకుమారుని నలుగుల । పాలుజేసిరయ్యా
పుత్రుని కొరకై శోకభరంబున । బొగలుచుంటి ననఘా॥

వచనము—

అనిన విని సాత్యవతేయుం డమ్మనుజేశ్వరున కిట్లనియె.

ఆరభిరాగం — ఆదితాళం

చింతనొందనేలా - భూపాలా ॥చిం॥
అంతరంగమం - దతని పాపడని - యెంతువేమొ కా - లాంతకు
డనదగు ॥చింత॥
పలువుర రథికుల - పద్మవ్యూహమున - చలమున నందరి - సమ
యించెనుగద ॥చింత॥
క్రూర నారసము లీతడేయ పగ-వారలు పూవుల-బాణములేతురె॥చి॥
అభిమన్యుడు మరణించుట వింతయె - నిభపురమున నెందరినోవినమే॥
యిలను నుల్చిపురి - యిందుధకుండే - గలడు మీకు యీ - కలని
జయించగ ॥చింత॥

వ చ న ము—

పారాశర్యుండా కౌంతేయాగ్రజునకు మరియు నిట్లనియె.

## ర గ డ

యెప్పటికెయ్యది యేవిధిజరుగునొ । నెరుగవశమె భూపా
తప్పింపగ బ్రహ్మాదులకైనను । తరముగాదు రాజా
ధైర్యధనుండవు నీ విట్లడలుట । తగునే కౌంతేయా
శమియింపుము నీ శోకంబింతట । శమనతనూజాతా
అనియిటు బల్కిన సాత్యవతేయున । కా ధర్మజు డనియే
మునినాథోత్తమ విక్రమసంపద । లను గలిగిన నృపులా
ధర మృతిబొందక యుండుసటుల వా । రరయశేమొ దేవా
ప్రాణరక్షణము జేయగజాలరె । పార్థివు లీ యిలనూ
మృత్యు విధానము దప్పుకొనగ తా । మెవ్వరు జాలరొకో
అని యడిగిన ధర్మాత్మజునకు ని । ట్లనియె వ్యాసమహాసీ
నృపవర యధ్వరములు నొనరించెడి । నియతాత్ములు మరియూ
దానసమగ్రులు మొదలగు పుణ్యులు । దాత్తశీలురెల్లా
శూరవరులు రణకోవిదులెల్లరు । జేరు లోకమునకూ
జేరె నీదు తనయునకై జింతిల । జెల్లునె భూపాలా

యిందుకులోత్తమ నీదుఃఖము శమి । యింపగ నొక కథనూ
వినిపించెద నాకర్ణింపుము నొక । జననాథోత్తముడూ
సృంజయుడను భూపాలుడు సద్గుణ । శీలు డుదాత్తుండూ
పుణ్యమూర్తి సకలావని నేలెడి । భూరివిక్రముండూ
సకలధర్మముల పౌరజనాళిని । చాకుచుండు ఘనుడూ
పుత్రులకొరకై భూసురోత్తముల । పూజించుచునుండా
ఆ నరపతి సఖుడగుట నారదుం । డచటికి జనుదేరా
వచ్చిన నారదుగని విప్రోత్తము । లచ్చెరువందుచునూ
సాష్టాంగ దండప్రణామములు । సల్పి యిట్టులనిరీ
తాపసోత్తమా యీ నరపతి సం । తానము లేమికినీ
వగచుచుండె నీ హితుడు గదా యీ । వసుధీశున కీవూ
సుతు నొసంగి యీ పుణ్యుని కోరిక । హితమతి దెల్పుమనా
నారదుండు భూసురుల వచనములు । గారవమున వినియూ
సంతసమందుచు సృంజయు డనియెడి । సార్వభౌముకనియె॥

వ చ న ము—

నారదుండు నృపవరా వినుమని యిట్లనియె.

యెరుకలకాంభోజి—ఆటతాళం (సంవాదం)

నా : దెల్పుమూ – నీకోరి కదేమో ॥దె॥
దెల్పు నీ సంకల్పమేమో – తేటపడ సృంజయ నృపాలా ।
స్వల్పముగ నీమదిని నెంచకు – సల్పెదను యేకార్యమైనా ॥దె॥

సృం : దేవా – దెల్పెద నా యీప్సితమూ ॥దే॥
సావధానముతోడ విను ముని – సార్వభౌమ త్రిలోకపూజిత ।
భావమందొక సుతుడు లేమికి – వలుదెరంగుల వగచుచుంటి ॥దే॥

నా : యేలా – మును దెల్పవదేలా ॥యే॥
శీలవంతుండగుచు సద్గుణ – లోలుడౌ మదురూపు డగు నొక ।
బాలునొసగ దలంచితిని యే–లీల నీహృదయమున నెంచితో ॥దే

స్వం : మునివరా - మీ యాజ్ఞను మీరా ॥ము॥
జనుసెనుల్చి పురీశుడౌ శివ - శంకరుని సాక్షిగను దెల్పెద
వనజభవ రుద్రాదు లెరుగని - వానిగను యోగీశ్వరుండవు ॥దే॥

వ చ న ము.-

యిట్లు ప్రార్థించుచు స్పృంజయ నృపాలుండు నారదమునీంద్రా నీవ సంగునట్టి బాలుండు మూత్రపురీషలాలాశ్రు స్వేదంబులు సువర్ణంబగు నట్టివాడు గావలయుననిన నమ్మహీపతికి నమ్మహాత్ముండవ్వరంబిచ్చి జనియె నంత.

## ర గ డ

అంతట కొన్నిదినంబులకా నృప । కాంతుడు స్పృంజయుడూ
తనసతి గర్భంబున నొకతనయుని । గని సంతోషమునా
ఆబాలునకు సువర్ణ ష్ఠీవియను । నభిదానంబిడియూ
అతిగారవమున బెనుచుచుండ నా । సుతునివలన మరియూ
వలసినంత కనకంబను దినమును । వచ్చుచుండగానూ
గోపుర ప్రాకారంబులు సౌధము । లేపున గట్టించీ
సర్వవస్తు సముదాయము లెల్లను । సమకూర్చుక నృపుడూ
కాంచనమయమై నగర మెల్ల బహు । కాంతి నిండియుండే
అట్లుండగ నా రాచకుమారుని । నాపురమున గలుగూ
చోరులు కొందరు బాలునిగొని చని । కారడవులకేగీ
కాంచనంబు గలదని యాయర్భకు । కడుపుజించి మరియూ
పాపి పాపి వెదకిన కనకము నే । ప్రక్కగాన రాకా
శవముని రాశను బార వైచి యటు । జనెడి చోరులకునూ
వారలొనర్చిన దుష్కర్మమునకు । వారి వారిలోనా
వైరంబులు గలిగియు నొకరొకరిని । వధియించుక నచటా
అంద రధోగతికేగి నంతనట । నాస్పృంజయ విభుడూ
తనయుని గానక దిక్కుల వెదకియు । తత్కళేబరమునూ
గని పరలోక క్రియలొనరించియు । కడు దుఃఖమునున్నా

సృంజయు కడకొకనాటి దినంబున । మంజుభాషుడైనా
నారద మునివరు డరుదెంచిన గని । భూరమణుం డపుడూ
అర్చించిన సృంజయ భూకాంతున । కనియె నారదుండూ
నరవరయిటు శోకంబున గుందిన । నరులు యశువులిడరే
చచ్చిన వారలు యేడ్చిన వత్తురె । జనవర నొకహితవూ
చెప్పెద నవధానాయత్తంబగు । చిత్తముతో వినుమూ॥

వ చ న ము—

నృపవరా శాంతచిత్తుండవై వినుమని మఱియు నిట్లనియె.

కందార్ధము

భూవరమును పదియార్గుర।భూవరులిల యజ్ఞదాన।పుణ్యకార్యముల్ ।
కేవల సత్కృతు లెన్నియొ । గావించియు సురపథంబు।గాంచిరివారూ।
కొందరుసమర।మున గూలువారూ॥ దేవసమానులై।దివ్యాలతో గూడీ ।
భావనందములాతో । బహుకాలసుఖభోగ ॥ ములగాంచివారూ॥

వ చ న ము—

సృంజయభూపాలా మున్ను పదియార్గురు రాజులు సర్వయజ్ఞము లను సువర్ణ దానంబులను గోదాన భూదానంబులను మితిలేని యన్న ప్రదానంబు లొనరించు వారలు యిహంబు విడిచి పరలోకంబున నున్న వారని వింటిమిగాన నీ కొమరునినకై చింతించనేల యనిన విని నారదునకు సృంజయుం డిట్లనియె.

రగడ

దేవా నీవు ప్రసన్నుడ వగుటను । దీరె చింతలెల్లా
ధన్యుడనైతిని నీ ప్రసాదమున । తాపసేంద్ర నేడూ
నీ యనుగ్రహము బొందినవారికి । నెట్టికార్యమైనా
దుర్లభంబులగునే మునివర యన । తోయజభవసుతుడూ
నరవర చోరులచే చనిపోయిన । వరకుమారునిత్తూ
గొనుమని దెల్పుచు నుండునంతలో । మునిప్రభావముననూ
యెప్పటిరీతి సువర్ణష్ఠీవియు । తప్పక నటువచ్చి

నిలిచియున్న సుతుగని సృంజయనృప । తిలకు డాత్మబొంగీ
మునివరునకు సాష్టాంగ మొరగి స । మ్మదితాత్ముండైనా
జనవరు వీట్కొని నారదముని వే । జనియె దివంబునకూ
అంతట సృంజయు డనుగు కుమారున । కస్త్రవిద్యనెల్లా
సకలాగమ శాస్త్రములు గరపి స । చ్చరితుని గావించీ
రాజ్యమునకు పతిగా గావించియు । రాజు సృంజయుండూ
సర్వమువీడియు తపముజేయగా । జనియె వనంబులకూ
అట్టివారలందరు మును జనరే । యమరలోకమునకూ
గావున దుఃఖము వీడి స్థిరుండవు । గమ్మా కౌంతేయా
నేను బోయివచ్చెదనని దెల్పియు । నేగె వ్యాసమౌనీ
సాత్యవతేయుం డేగిన పిదపను । శమన తనూజుండూ
పార్థున కేమని దెల్పువాడనని । పరితపించుచుండే
నని దెల్పినవిని ధృతరాష్ట్రుడు ని । ట్లనియె సంజయునితో॥

వచనము—

కురుభూపాలుండు మరియు సంజయున కిట్లనియె.

నవరోజు — చతురశ్రగతి

సంజయా సంశప్తకులా – సమరమెట్లు జేసిరో ధ ।
సంజయు డెట్లోనరించెనో – నాకు దెలియ బల్కు మిపుడు ॥సం॥
యేమయ్యెనో సుతునివార్త – నెవరు దెల్పిరా క్షణమే ।
ఆ మాధవ యర్జును లె – ట్లటకు వచ్చిరో దెల్పుము ॥సం॥
అతను దెగుట దెలిసిన నె – ట్లయ్యెనో తదుపరి సూతా ।
క్షితిని నుల్చువాసుడైన – శివునిసాక్షి వినిపింపుము ॥సం॥

వచనము—

ధృతరాష్ట్రుం డిట్లడుగుచున్న విని సంజయుండు భూవరా బేరడ
పుల దహించు ననలంబు చందంబున సంశప్తక సేన దీవ్రుండై బోరి
బుచ్చి మరలునప్పుడు మాధవు నాలోకించి నరుం డిట్లనియె.

కంజదళాక్షా దుర్నిమిత్తములు । గానవచ్చె నిపుడూ
నాచిత్తము నుత్తలపడుచున్నది । నరయ హేతువేమో
తనువెల్లను ప్రాణ్వడగ జొచ్చెనో । దామోదరనేడూ
కుంభజుండు గేవలుడే గనుగొన । కురుపతి యల్పుండే
కౌంతేయుండే దెసకువచ్చెనో । గనరాదో బావా
యేదియెట్టులగునోగద నశుభం । బేగన్పడు చుండే
అని యీవిధమున నేమి దాచకను । నరునుండు హరియూ
సాంధ్య కాలకృత్యంబులు దీర్చక । సమరభూమి వెడలీ
తేరు దోలుకొని నిజశిబిరంబును । జేరి ధనంజయుడూ
విన్నవదనులై నలుమూలల గూ । ర్చున్న సేనగాంచీ
పాడరి యుండిన శిబిరంబులలో । పాటుగాంచి నరుడూ
హృదయము ఝల్లన కమల దళేక్షుడు । వినగ నిట్టులనియే

వచనము—

అర్జునుండు విన్నవదనుండై హరింగని యిట్లనియె

ముఖారి — ఆటతాళం

యెవరూ గానగరారుగా । యీశిబిరములా । యేమిదోచదు మాధవా
యెవరూ గానరుయిట్టి । హేతు వేమోగాని
కవలు నాయగ్రజులే । కడనున్నవారలో
భవలి దూరుండన్న కుంభజు । పాలబడి తప్పించుకొన గను
సావధానములేక జిక్కనో । సార్వభౌముం డొంటివాడై ॥యె॥
సేనలు నను గాంచి । యాననములు గాంచి
దీనులైయుట దొలగి । తిరుగుచుండిర దేమొ
వీణగాన స్వనములేయుడ । వీనులకు వినరాక యుండెను
గానలోలా సమరమునసే । లేని హేష్యంబింత దెచ్చెను ॥యె॥
కుంతిసు తాగ్రజుడో । కుంజర శతబలుడో
వింతమాద్రి తనయు । లింకెవ్వరోయని లో

సంతముల ద్రోణాది కర్ణుల । పాలబడి మృతి బొందిరనుచును
అంతరాత్మను బొడమచున్నది।అయ్యయో యిదియేమి కాలమో॥యో॥
ధరనుల్చి పురవర । ధాముఁడై వెలసియు
అరయచప్పిడి పున్న । యాభ్యా చౌదరి నేలు
పరమశివు సత్కరుణ లేకీ । తరుణమున నీశిబిరము ననే
దరిని గాంచిన వెరపుదోచెను । పరమ పురుషా పద్మనాభా ॥యో॥

వ చ న ము —

శిబిరంబుల నెవ్వరు లేమికి వగచుచు పలువిధంబుల బల్కుచున్న విని శ్రీకృష్ణుండేమి బలుకకున్న యర్జునుండు.

## రగడ

యిచ్చోడ నభిమన్యుండేలకొనా । కెదురుగాడు నేడూ
అయ్యయ్యో నేనెట్టివార్త విననయ్యోనొ దెలియదుగా
చేయిబెట్టి గలచిన భంగిని నా । చిత్తమదరుచుండే
తనువు వణంకెను బాదద్వందము । తడబడ సాగెనుగా
అనిపలు దెరగుల శోకించుచు నరు । డబ్జాక్షునితోడా
ధర్మతనయువిడి దలకు జనిరి వెల్ల । దనము దోపుచుండా
కౌంతేయుడు దమ్ములతో హితులతో । ఘనబంధులతోడా
సకలమాన్య రాజన్యులతోడను । నొకయెడ నుండగనూ
అర్జునుండు జనుజనుచుండ వెంట శ్రీ । హరి దోడుగ జనియూ
అన్నదమ్ముల దగు రాజన్యుల । సందర నట గాంచీ
మోములు వంచుక కనుల బాష్పకణ । ములు నించుచునుండూ
వారలలో నభిమన్యుడు లేమిని । పార్థుం డడలుచునూ
గుండెలు ఝల్లన యడుగులు తడబడ । కొలువులోని కేగీ
నలుమూలల గలయంగ వెదకి నరు । డెలుగురాల్పడంగా
తనయుని గానక శోకతప్తుడై । ధర్మజు కిట్లని॥

వ చ న ము—

అర్జునుం డందరిలో నభిమన్యుం గానక శోకించుచు విన్నవదనులై యున్న భీమాదులం గని యిట్లనియె.

శోకవరాళి — ఆటతాళం

చిన్నికుమారుడే - తెన్నున నున్నాడో ॥అన్నలారా॥
యెన్నిరీతుల మీలో - వెదకీనా గనరాడు ॥అన్నలారా॥
మీలోనా లేడేమొ - బాలు డభిమన్యుడు ॥అన్నలారా॥
యేలా దెల్పరు మీరూ - యిట్లుండ గతమేమొ ॥అన్నలారా॥
సాహసమున బాపా - చార్యు డొనరుచు పద్మ
వ్యూహము భేధింప - నొరులెవ్వరెరుగరు ॥అన్నలారా॥
అట్టి మోహరమున - కా యర్భకుని నేడూ ॥అన్నలారా॥
పట్టుగా భేదింప - బంపరుగా మీరూ ॥అన్నలారా॥
మొన నురువడి జొచ్చు - టను వినియెనెగాని ॥అన్నలారా॥
వినడాయె మరలెడి - విధము నావలనను ॥అన్నలారా॥
వరనుల్చిపురిని సు - స్థిరముగా వెలసిన ॥అన్నలారా॥
పరశివుని కరుణయే - తెరగుగా నున్నదొ ॥అన్నలారా॥

వ చ న ము —

అర్జునుం డిట్లడలుచు శోకసంతప్తుడై యగ్రజుతో మరియునిట్లనియె.

## ర గ డ

అన్నలార వ్యూహము భేదించియు । నచటినుండి మరలూ
గాధను వినడాయను యభిమన్యు । కయ్యమునకు మీరూ
పద్మవ్యూహంబునకు బొమ్మటని । బంపరుగా సుతునీ
బలవంతముగా బంపితిరేమో । బాలుం డటజొచ్చీ
వీరావేశముతో జనుచుండగ । క్రూరులు కౌరవులూ
చుట్టుముట్టి బాలుని వ్యూహములో । గొట్టకుందురయ్యో
హరి మేనల్లుడు గుంతికి మనుమడు । అస్మత్తనయుండూ
సమరకేళి నిపుణుండు దివ్యశర । క్రమశిక్షణశాలీ
అట్టి వీరవరు నెవ్వరు జిక్కల । బెట్టిరో వ్యూహమునా
పెక్కుబలంబులు జుట్టు ముట్టకను । జిక్కడెవరికైనా
భూరివిక్రములు పలువురు బాలుని । జేరి పోరియుండే

అర్భకు సద్గుణములు నెన్నగ నా । కలవియగునె యిపుడూ
గురులకు భక్తుడు దారుడు పేదల । కరుణజూచువాడూ
శౌర్య ధైర్య గాంభీర్యం డుత్తమ । శాలి సద్గుణుండూ
నిర్జరపతి మనుమడు లేమికి నేటు । నిలుచు నాదు తనువూ
ఆతని నగుమోమును దెలికన్నులు । నతని వెడదయురమూ
కన్నారగ గనకున్న బ్రదుకుదునె । యన్నలార నేడూ
అని యీవిధమునశోకించుచు మరి । యనియె నిట్టులనుచూ ॥

వ చ న ము—

అభిమన్యు లేమికి దుఃఖావర్ణంబున మునుంగుచు నతం డిట్లనియె.

యా ల లు

ముద్దులయ్యా పద్మవ్యూహా – మునకు నేగూనాడూ నినుబో ।
వద్దని దెల్పారే యొకరైనా ॥ ఓ ॥ చిన్నికుమారా ॥
పెద్దవారీ యాజ్ఞా ద్రోయవే ॥ ము ॥
మూహారమునా జొచ్చి కౌరవ – ముఖ్యులాతో బోరి – పోరి ।
సాహసమునా సేనా సమయించీ ॥ ఓ ॥ యభిమన్యకుమారా ।
బాహుబలులాచేతా గూలితే ॥ ము ॥
బాలకా హంసతూలికా – పాన్పుపై శయనించు నీవూ ।
రాలనిండూ నేల బండితివా ॥ ఓ ॥ యభిమన్యకుమారా ।
కాలమిటులా వచ్చూచెరుగరా ॥ ము ॥

వ చ న ము—

యిట్లు దుఃఖాబ్ధినింబడి బొరలుచు నభిమన్యా యని యరచుచు మరియు నిట్లని విలపించె.

## ర గ డ

నాయన యభిమన్యా నగరంబున । నళినాక్షులతోడా
భోగములందెడి నీవు వరభులలో । బొరలుచుంటివేమో
నానాపౌరజనాళికి పురిలో । నాధుడవైయుండీ

యిప్పు డనాథుడవైతివి తండ్రీ । నిలపై గూలియునూ
సద్గుణ ధనుడవు వినయరతుండవు । సాహసాధిపుడవూ
పడతి సుభద్రకు గారవంపు తన । యుడ వో యభిమన్యూ
మానధనుడ వతి శౌర్యవర్యుడవు । మఘవుని పౌత్రుడవూ
నా చెలికాడవు ముద్దులాడ నిను । నరయ లేవు లేవూ
అయ్యో నాదగు మందభాగ్యునకు । నట్టి తనూభవుడూ
యేలదక్కగల డా విధాత యి । ట్లేల జేసెనయ్యో
యెంత నిర్దయుడో యెంతకఠినుడో । యిట్లొనర్చె నతడూ
వెలగల వస్తువు లేవియైన నీ । యిలను నిల్వ దేమో
యెంతకపటియో బ్రహ్మదేవు డిటు । చింతగలుగజేసె॥

వచనము—

అనుచు జతికిలంబడి యనేక రూపంబుల బలవించి ధర్మజునాననం బాలోకించి యిట్లనియె.

పున్నాగరాగం—ఆటతాళం

కానరా డేమో ॥ అన్నలారా ॥ మీలో నేడూ ॥కా॥
కానరా డేమో నా - సూను డభిమన్యుడు ।
యేనువచ్చిన గాంచి - యెదురు వచ్చెడివాడు ॥కా॥
బకవైరి లేడేమో - పార్థతుండు జనడో ।
ఒకని పోరికి బంపి - నొకరైనా జనరేమో ॥కా॥
అల మత్స్యనాథు డే - వలను బోయేనోగాని ।
తలకి సాత్యకి రాక - తక్కెనేమొ నేడు ॥కా॥
అప్పుడాసమరము - దెప్పరమైదోచి ।
నప్పుడు నినుగావ - నటురాక తక్కిరో ॥ గా॥
అటుగాకయుండిన - నతడు దెగుటకు హేతు ।
వెటులో దెల్పుడు మీరా - లిపుడూ నాయర్భకుడు ॥ గా ॥
ధరలోనా శ్రీవుల్చి - పురవాసుడై వెలయు ।
పరశివుని కరుణా నా - పైలేక తనయుడు ॥ గా ॥

వ చ న ము—

అన్నా నీ కొమరుండు పద్మవ్యూహంబుజొచ్చి వెనుదీయక మగటిమిచే నందరినింగూల్చి పేరుగాని యెంగదాయని నిట్టూర్పు నిగిడించి మరియు నిట్లనియె ॥

రగడ

కొడుకా పలువురు జుట్టుముట్టికొను। నెడనెట్లుంటివొకో
బాణకృపాణ ముఖాస్త్రంబులుగొని। పైగ్రమ్మిన యపుడూ
యేమని దలచితొ యెట్టులుంటివో యిందుకు లాభరణా
వంటరివై వ్యూహము జనగాని। వెంట నెవరురారో
సమరముభరమైదోచి నపుడు ననుః। చాల దలచినావో
అని యిట్లడలుచు నర్జునుండు తన। మనమున నిట్లనియె
తప్పదలంచితి హరి మేనల్లుడు। ధైర్యధనుడు సుమ్మీ
సమరములో సృక్కనే యాబాలుడు। నమితబాహుబలుడూ
మిన్నువిరిగి పైబడినబాలుడా। సన్నత నొందునొకో
అట్టితనయు సౌభద్రుని నగమొగ। మెట్టులజూతునొకో
చూడకున్న నాతను వెటునిల్చును। సుందరాంగునవిలో
క్రూరమతులు పలువురుగూడియు నా। కొమరుజుట్టి
జంపునపుడు యాశౌరినినన్నుద। లంపరేమొ కానీ
యేగతిబట్టెనొ కొడుకునెత్తుటను। దోగియున్నవాడో
బాలుడెచట బడియుండెనొ జూపెడు। వారు గానరారే
జూచెదనేడు సుభద్రతనూజుని। జూడబోవనతడూ
పగతురజంపియు మొగముపోటులను। బహురీతులనొచ్చి
పొడసూపగ రాడయ్యేనేమొ నా। కొడుకు నెటులగందూ
వనితద్రౌపదికి దుఃఖముమాన్పనె। వ్వారికి వశమానో
అనియిటుపలురీతుల శోకించుచు। నన్నమోముగాంచీ
గొప్పయెలుంగున నిట్లనిబల్కెను। కుంతిసుతాగ్రజుతో

వ చ న ము—

మరియు నర్జునుండు వెలుంగురాల్పడ నిట్లనియె.

శహానరాగం ॥ఆదితాళం॥ (ఆన్నా నేజేయు)

ఆలించుమగ్రజా యీ - వేళాసంశ ప్తకులతో ।
నాలాము జేయుచుండి - యాలించినాడరోదన ॥నాలిం॥
కురిసేన లోనరించు - ఘోరసింహనాదముల ।
నరసీయు యుత్సుమాటల - తెగగెల్లా నాకర్ణించితి ॥నాలిం॥
పలువురుగూడి యొక్క - బాలునిజంపినారు ।
చలమున పార్థునితో - గెలువాశక్యమె మీాకనె ॥నాలిం॥
సంతోషకాలమని మీా - రెంతో నార్చుచున్నారు ।
అంతకుడో యన మి - మ్మందరి గూల్చు నరుడనె ॥నాలిం॥
యిలను నుల్చిపురిని వెలయు - యీాశుని కరుణలేక ।
కలనిలో దెగియెననుచు - బలికె యుయుత్సు డపుడు ॥నాలిం॥

వచనము—

ఆ యుయుత్సుం డిట్లరచుచుండ వింటి కౌరవులారా మీాకు సంతోషకాలంబని యార్చుచుంటిరేతోగాని హరి యర్జునుల కప్రియం బొనరించి భవుంబైన బ్రతుకం గలడే మీా రత్యంత పాపం బొనర్చితిరి యెట్లైన మిమ్మో ద్రోహంబు జెరుపక పోదని కేకలు వేయుట వీను లార వినియుంటిగాని దెలియనైతి నెట్లం టేని.

రగడ

హరి వినియున్నాడని దలచితి మది । నదియు దెలియనైతీ
అన్నా తగుసమయమున వార్త నా । కంపినంత వచ్చి
నీసుతు గ్రమ్మిన క్రూరయోధులను । నాసమరములోనా
ప్రస్గజేయకుందునె వారందర । మద్ఘోరాస్త్రములా
అనియిటు కొడుకును దలచి తలచి దుః । ఖాబ్ధి మున్గిపడినా
ఫల్గును తన కరముల బొదువుచు నా । పద్మాక్షుం డపుడూ
తన చిత్తంబున నడలూనుచు । నా ధనంజయున కనియే
తగునె యిట్లు శోకింపగ బాడియె । ధరణీశులు మున్నా
శూరులైన వా రే లోకంబును । జేరిరో వినలేదే

అట్టి నాకలోకంబు జేరె నీ । యభిమన్యుడు నేడూ
అట్టివానికై వగవనేల బల్ । ఘట్టితనంబుననూ
యోధవీర లోకంబులనెల్లను । నీధర గూల్చియునూ
యశము గడించి దివంబున కరిగెను । యది యప్రియమహానే
దెలియదగినదంతయు మానసమున । దెలిసిన ధన్యుడవహా
నీవే యిటు శోకించుచున్న పరు । లెట్లు సహించెదరూ
నీవిటు శోకార్ణవమున మున్గుట । నీవారలు గనియూ
దీనవదనులై యేడ్చుచు నుండిరి । దేర్పరాదె పార్థా
శ్రీపతి యోదార్చెడి వాక్యంబుల । కా ఫల్గును డపుడూ
తోడబుట్టువుల కిట్లని బల్కెను । వీడని శోకమునా॥
వ చ న ము—

ధర్మజు సమ్ముఖంబున కొడుకు గానరామికి నర్జునుండు అగ్రజాను జులంగని వారల కిట్లనియె.

శోకవరాళి — అటతాళం

అన్నలార వినుడీ – నానుడువులా – ననుజులు యాలింపుడీ ।
అన్నలార సుభద్రా – చిన్ని కొమరుని – పున్నమచందురు – బోలు
మోము నేడు । కన్నులకు బొడగట్టుచున్నది – కన్నకొమరుండెచట
బడెనో। యెన్నగా నొకరైన దెలుపక–యున్నవా రేమందునయ్యో॥అ॥
మిమ్ము పాంచాలుగ – నమ్మి యిచ్చటి కద ।
నమ్ము విడిచి యా బ – లమ్ముల కేగితి ।
కమ్మవిల్తుని జనకు నల్లుని – గావ మీ రసమర్థులనుచును ।
నెమ్మనంబున దలచకను మిము – నమ్మి యిటుజెడినాడ నయ్యో॥అ॥
అగదములు బరపి మీ – రందరు గలియగ ।
దురమున మిముగలచి – దోతెంచుబాలుని ।
కెరువుజని నరపతులు రథికులు – తీవ్రశస్త్ర పరంపరలచే ।
వెరవునను సమయించిరే – మోహరమునందున ముద్దుతనయుని ॥అ॥
బలహీనులనుచు మి – మ్మలనాడే దెలిసిన ।

తలగిపోదునే కన్న - తండ్రిని విడనాడి ।
యిలను చప్పిడిపున్న యాఖ్యాని - సలలితంబుగ బ్రోచునుల్చి ।
నిలయుడౌ గౌరీశుడింతటి - చలమునాపై బూనెనేమో ॥అ॥

వ చ న ము :-

అని యర్జునుండు నిట్టూర్పు నిగిడించుచు మీరందరు మానసులు వలె నున్నారుగాని నేను లేనిసమయంబున నాతనయునిం గాపాడ గడంగరు మీరొక పౌరుషశాలులేయని నిష్ఠురంబులాడుచు మరియును నిట్లనియె.

# రగడ

మీరొక మానసులే యీయెడ శ్రం । గారమునకుగాకా
కవచంబులు శస్త్రాస్త్రంబులు మీ । కవిమానసమునకే
కయ్యము కయ్యమటంచు వచ్చితిరి । కాల్పనెపౌరుషమూ
అనియందర హీనంబుగ బల్కియు । నతనిమొగంబుననూ
క్రోధశోకములు బెనగొనగా కను । గొనల నీరునింపె
పలుకకున్నగని నతనిమోముగన । భయపడి రందరునూ
అదిగని శ్రీహరి యర్జునుజేరియు । ననునయించినంతా
కుపితమానసుండై యుండిన గని । కుంతి యగ్రసుతుడూ
సాంతస్వనమున నిట్లనిబల్కెను । సవ్యసాచితోడా
నాయన నీవాసంశప్తకులతో । నాహవమునవేగా
గని యాచార్యుం డొడ్డనమేర్పక । కయ్యమునకురాగా
అందర మావీరునిదలపడి మే । హరము దూరవేకా
నిర్వీణులమై యున్నంతను యా । నిగమకోవిదుండూ
బాణపరంపరలద్భుతంబుగా । బరపినంత నతని
దేరిచూడరాకను మేమంతట । మరలినంతలోనా
ఆపద్మవ్యూహము భేదింపగ । నా యభిమన్యుండూ
జాలునటంచునుదోచె మనంబున । సంకల్పంబపుడూ
వ్యూహముజొరు సౌభద్రాయనియెడు । నూహ గలిగినంతా

నరనందన పద్మవ్యూహము జొరు । తెరువుదీయుమిపుడూ
మేమందర మొకశై జొచ్చెదమూ । మేటి మొగ్గరమునూ
అన విని మారాడక జొచ్చెను యా । ఘన మోహారముననూ
నీయుప దేశంబున యాచార్యుని । నిమిషంబున గడచి
బలుసైన్యంబుల నెల్ల ధీరుడై । పాయ:వడగగొట్టి
అదిగని మేమందర మతనికి దో । ట్పడగ గడగినంతా
సైంధవుండు మాకడ్డపడిన నటు । జనరాదయ్యెనుగా
క్షుద్రబలుడు హరువరభావంబున । రౌద్రాధికుడయ్యె
ఆతనిగడువగజాలక చిక్కితి । మాహావంబులోనా

వ చ న ము—

ఇట్లు హరువరబలంబున సైంధవుండడ్డుపడిన మేమందర మా మోహారంబు జొరజాలక చిక్కియున్నంత.

ముఖారిరాగం — ఆటతాళం

కురుబలంబులు నొక్కటై నీ – కొమరు నొంటిగ వ్యూహమందున ।
బట్టెరీ చుట్టు ముట్టెరీ ॥కు॥
కుంభజుడు కృతవర్మ కృపుడును – గురుసుతుడు కర్ణాది యోధులు ।
గ్రమ్మెరీ ॥ శరముల గ్రుమ్మెరీ ॥కు॥
పెక్కుమారకలు పలుదెరంగుల – నొక్కటై పైబడినవారికి ।
జిక్కకా ॥ ననిలో స్రుక్కకా ॥కు॥
చేవజెడకా కురుబలంబుల – చిచ్చురపిడుగోయనంగను ।
మెరసియూ ॥ వీరుల గడిసియూ ॥కు॥
ధీరుడై రాజాత్మజాది సు – ధీమణుల వెడలంగదోలెను ।
రణమూనా ॥ విక్రమ గుణమునా ॥కు॥
నలమునను లక్ష్మణ బృహద్బల – సార్వభౌమ కుమారులందరి ।
జంపెనూ ॥ యమపురి కంపెనూ ॥కు॥
యిలను నుల్చిపురీశుడౌ విష – గళుని కృప మనపైనిలేక ।
పోయెనూ ॥ తుద కిటులాయెనూ ॥కు॥

వ చ న ము—

ధర్మరాజం డర్జునున కిట్లు వినిపించి మరియు నిట్లనియె.

## ర గ డ

రాజుల రాజకుమారుల సేనల । రణమున బడగూల్చి
తేజము దరిగియు దూ గాడుచు త । ద్దివ్యమోహానుండూ
పోరి బోవక పోరాడుచుండు నెడ । భూరివ్యూహామునకూ
దురితమానసుడు దుశ్శాసను సుతు । డరుగుదెంచి దాకీ
సౌభద్రునిచే విరథుం డై దా । శ్శాసనిగదగొనియూ
యుభములరీతిని గదలబోరి ర । య్యిరువురు సమరమునా
తలప పరస్పర నిహతు లగుచు రణ । ధరణిబడియె వారూ
కలనిలోన బడి తంద్రులకును మా । మలకు గీర్తిదెచ్చీ
నాకలోక సుఖముంజేకొనియెను । నా సుకుమారుండూ
ఆకుట్టని మరణంబు దెల్పవిని । యర్జును డార్తుం డై
గుండెలు ఝల్లన మూర్ఛబడియె నా । ఖండల నందనుడూ
భండనమున దెగిపడిన వీరువలె । బడియె పరవశుం డై
చేష్టదక్కగను బంధువులెల్లరు । చిత్తంబుల నడ రే
అట్టి సమయమున గృష్ణుడు ధర్మజు । డా పార్థుని జేరీ
కరములబట్టియు లేవనెత్త నా । నరుడు కౌంతవడికీ
సేదదేరి రోషమున సైంధవుడు । జేసిన ద్రోహమునూ
తలచి తలచి మొగమెఱ్ఱవార త । త్తనువు చమటలూరా
కలవరమున కనుబొమలు ముడిచి తను । కంపమొందుచుండా
అతికఠినంబగు చిత్తముతోడుత । నన్ను కిట్టులనియే
విన్నవించెదను నీవు రాజులును । వినుడు నాప్రతిజ్ఞా
సింధురాజు నెట్టులైన నవశ్యము । బంధురసమరములో
నెల్లిజంపుదును యాతడు భయమున । నిన్ను జేరుగాకా
వనజోదరు శరణంబు వేడినను । వానివిడువనయ్యా
ననుగని పోరుదొలంగి పోయినను । నరసిగూల్తువానీ
బాలధ్వంసకుడా దుశ్శీలుని । పలువుసుగాచుటకై

వచ్చిననన్ను శరపంక్తులముంచిన । వారినెల్లదలివిూ
ఆద్రోహిని బడగూల్చెదనని లో । నందదుగనుచుండా
అట్లులజేయగనైతినేని నే । నాడుశపధమినుడీ
గురుద్రోహింబోయెడు గతికిని నే । నరిగెదనిక్కముగా
యిడియుగాక నొక ప్రతినిజేసెదరు । వినుము ధర్మరాజా

వ చ న ము —

అగ్రజా యీ రాజలోకంబులు వినుచుండ మరియొక ప్రతిన గావించెద వినుమని యిట్లనియె.

ముఖారి - ఆటతాళం

విడువా సైంధవుని – వినుడు మరియొక ప్రతిన ।
కడుదయను సురదనుజకిన్నర – గరుడయక్షులుగావ వచ్చిన ॥వి॥
నెల్లియాసమరమున – వినుడు గ్రుంకకమున్నే ।
ప్రల్లదుని శిరమెల్లభంగుల – డొల్లజేసెద కల్లగాకను ॥ వి ॥
అటులజేయనా – కలవిగాకయున్నా ।
తటుకునను నసలంబు జొచ్చెద – తప్పకనునాగాండివముతో ॥వి॥
కరమరుదుగనుల్చి – పురవాసుడై వెలసి ।
అరయచప్పిడిపున్నయూఖ్యుని – నిరతమేలెడి హరునిసాక్షిగ ॥వి॥

వ చ న ము —

అర్జునుండిట్లు శపధంబుగావించి యుప్పరమ సాధనంబగు గాండీవంబు దెప్పించి సింజినిటంకారంబొనర్చిన పద్మనాభుండు పాంచజన్యంబుపూరించెనంత యింద్రాత్మజుండు దేవదత్తం బొత్తిమరియు.

## రగడ

దేవదత్తపాంచజన్యరవంబులు । తీవ్రముగామ్రోయగా
సైనికులెల్లను సింహనాదములు । సల్పి రద్భుతముగా
నింగిముట్టెనా తూర్యధ్వనులు జె । లంగె నాల్గు దిశలా
గాండివంబు వలయాకారంబుగ । గావించినదయ్యో
శవదొనలను నస్త్రంబులు వెలికిని । గానవచ్చుచుండే

అట్టియెడను పవనాత్మజుడింద్రజు । పట్టి మోముజూచి
నీవుజేయు తీవ్రంబగు ప్రతినకు । భావజజనకుండూ
పాంచజన్య మొత్తెను యారవమును । పగతురు వినినంతా
ధైర్యము దూలకయుందురె కురుపతి । శౌర్య మెడలకున్నే
అని యగ్గించిన భీమసేను వచ । నంబులకానరుడూ
కోపశోకవేగంబులు వీడక । కొలువుగలయజూచి
వందిమాగధులు స్తుతులొనర్చె సం । క్రందననందనునీ
అప్పుడు ధర్మజుకొలువెల్లను ఘో । షంబు నిండియుండే
ఆనినదమువేగపు జారులువిని । నతివేగమెజనియూ
నరుశపథము వినిపించిన సైంధవు । డరసిగుండెలదరీ
గడగడవడకుచు నోటను తడిలే । కారిపోవనతడూ
పుడమినిబడి తనువెల్లను నిప్పుల । బోరలినట్టులుండీ
తనకునాప్తబంధువుడో కురుపతి । దరికిజేరి యతడూ
యుల్లమగలసిగ్గునవగపున కురు । వల్లభు కిట్లనియే

వచనము—

సైంధవుండు లజ్జావదనుండగుచు కౌరవేశ్వరుని కిట్లనియె.

నాదనామక్రియ - ఆదితాళం (జేబులో)

వింటివాబావా - పార్థుని ప్రతిజ్ఞ ॥విం॥
వింటివెసౌభద్రుని వ్యూహంబున-నొంటిజొచ్చుచుంటనుయాతని వేను!
వెంటనంటివచ్చు పాండవులకే - కంటకముగ నడ్డుజొచ్చినాడా ॥విం॥
యిదిన్యాయమేనా - నేనొక్కరుడనే - యెగ్గొనరించితినా ।
సదమలమతి తనహృదయంబున ని ।
ల్పదయతనాపై బూనెను శపథము ।
కదనంబున నెవరుగావ వచ్చిన ।
మదమణంతు శిరమ్ముద్రుంతునసెనట ॥విం॥
యేగెదనేడూ - యెచ్చోటకైనా - దాగెదనేడూ ।
సాగరగంభీరుండా ఫల్గును - సాటియెవరు ముల్లోకంబులలో ।
రాగతి యెట్లగుననని యెరుగకనే - నాగితి కౌంతేయుల కడ్డంబై ॥విం॥

వ చ న ము—

యిట్లా సైంధవుండు భయంబున దుర్యోధనుతోడం దెల్పుచు కొలువు గలయంగని మరియు నిట్లనియె.

## రగడ

యీా కురుపతి కొరకై గాదే నే । నింతదెచ్చుకొంటి
ఆకవ్వడితోపోరి జెయించెడి । నంతవారుగలరే
అమరులు కిన్నరగంధర్వాదులు । నతని నెదురగలరా
అయినను ద్రోణుడురాధానందను । డాకృపబాహ్లీకులూ
కొలువశంబున జిక్కినవారిని । గావగలరువారూ
అట్టివారలెల్లిట్లోనర్తురో । యర్జును ప్రతినకునూ
యెట్టులగానున్నదొ నావిధికృత । మెట్టులగునో యనుచూ
కాళ్లువడంకుచు బెదవులు దడుపుచు । గదురుమనంబుననూ
నరునకు గనరాకుంటగ నెట్లో । నరుగుటనిశ్చయమూ
ఆజ్ఞయొసంగుడు పోయివచ్చెదను । యార్యులార నేడూ
అని నిశ్చయముగబలికిన సైంధవు । నార్తధ్వని వినియూ
దుర్యోధను డాతనికిట్లనియెను । తోరపుబ్రేముడినీ
మున్ను నీవు శౌర్యోన్నతులని మ । మ్మల కొందరినెంచీ
ద్రోణసుతుడు సౌబలుడు సోమద । త్తుని దర్పంబులనూ
శలుడాదిగ మొదలైన వీరులతి । సాహసబలులనుచూ
మున్ను నెన్నుకొంటివివారలు ని । న్నన్నరుకిచ్చెదరే
నీకు కోటగాదమ్ములు నేనును । నిలువమె నిక్కముగా
మేటిమగలు యీా రాజవరేణ్యుల । సాటిగలరె ననిలో
యింద్రాదులు వచ్చిన నిన్నిత్తురె । యింతవగపిదేలా
అనిదెల్పిన దుర్యోధను నుడువుల । విని సైంధవు డపుడూ
మానసమున గల్గిన వగపెల్లను । మాని ధైర్యముననూ
దుర్యోధను దోడ్కొని సైంధవుడా । ద్రోణునికడకేగీ
అయ్యా శరగురువర మిమ్మొక్కటి । నడుగవచ్చినాడా
యేమన నరునకు నాకు ధనుర్వి । ద్యా మహిమమునందూ

తారతమ్య మెటులుండునో దెల్పుడు । ధర సురవరయనినా
సింధురాజ పార్థుండు నీవు శర । శిక్షకు సమయుతులే
అవీరుడు నీకంటె పరిశ్రమ । మలసటకును నోర్చి
అలఘు ప్రయోగంబులు నెక్కువగా । నాతడు సాధించే
అందువలన నీకంటె నధికుడై । యలరె నర్జునుండూ
గావున నది యట్లుండ నిమ్ము నే । గలుగ భయంబేలా
నీవటు మద్బాణంబుల మాటున । నిలిచియుంటివేని
దేవసంఘములు వచ్చిన నిన్నట । దేరిచూడగలరా
నరుడు జొచ్చుటకు వీలులేని బం । ధుర వ్యూహం బొకటి
పన్నించెద నీ కులధర్మంబును । పాడుజేయకుండా
సమర మొనర్చుము వెరపుమాని । నీ సాహసమును జూపి
తపయజ్ఞము లొనరించినట్టి భూ । ధవులు బడసినట్టి
లోకము బడయగవచ్చు సంగరము । లో గూలిన వారూ
గావున నీ వెనుకంజ వేయకను । కయ్యమునకు జొరుమా
యని యిటులూరడిలంగ బల్కు ద్రో । ణుని వాక్యంబులకూ
కలకదేరి సైంధవుడు ధైర్యమున । కౌరవేశ్వరునితో
జని సంగ్రామోత్సాహంబును । కురుసైనికులకు దెల్పా
అప్పుడు తూర్య రవంబులెల్ల దివి । గప్ప మ్రోయునంతా॥

వ చ న ము—

అట్టియెడ సర్వసైన్యంబులు కలంకలు బాసి దైన్యంబులు వీడి నుల్లాసంబుల కయ్యంబు వేడుక భవత్తనయు శిరంబున సుముఖంబుగా నుండునెడ నచ్చట పాండవాగ్రజుండు పాంచాల మాత్స్య పాండ్య యాదవ కేకయాది రాజలోకంబుల శోకంబులు తగు మాటల నులు గంజేసి విడిదలకుం జన నియమించి యనుజుల నచ్చోతు సమ్ముఖంబున బెట్టుకొనియున్నయెడ గోవిందుండు గాండీవి కిట్లనియె.

కాంభోజి — చాపుతాళం

యేలాజేసితో - నాతో దెల్ప కిట్టి శపథ ॥యే॥

యేలా యీలీలా భూ - పాలూ లెవరైనా ।
యీలాటి పన్నిద - మెవరూ జేయరో పార్థ ॥యే॥
యిన్నరనాయకు - లున్న గొల్వులోన ।
యెన్నగ కఠినోక్తు - లెట్లు బల్కితీవు పార్థ ॥యే॥
దుస్తరమైనట్టి - దుర్మదాంధు రవి ।
యస్తమించులోనా - మస్తకము ద్రుంతుననుచు ॥యే॥
ధరను నుల్చిపురి - ధాముడైన శివుని ।
కరుణా యేరూపమునా - గాగనున్నదో పార్థ ॥యే॥

వ చ న ము—

అర్జునా యిదియునుంగాక మరియొకటి వినుము.

## ర గ డ

మన వేగుల వా రిటులవచ్చి చె । ప్పిన వార్తను వినుమా
నీవు ప్రతిజ్ఞ నొనర్చుట విచ్చట । నింగిముట్టమోయా
విని బెదరుచు కురుబలములెల్ల ని । ర్వీర్యులగుచు మరియూ
అర్జును కొడుకును జంపుటచే మరి । యాతడు కోపించీ
సమరంబున కిపు డెత్తివచ్చు తగు । సైన్యంబులగూడీ
కరి తురగాది రథంబులతోడను । గదలివచ్చుననుచూ
చారులు దెల్పగ విని సైంధవు డతి । ఘోర శోక భయుడై
కౌరవరాజును జేరి నీ ప్రతిన । కడువడి వినిపించీ
కురువర నను గావగ జాలరు నే । నరిగెద నెటులైనా
అనవిని దుర్యోధనుడు బల్కె ని । ట్లనుచు సైంధవునితో
గురు కృతవర్మ కృపాది కర్ణులును । గురుసుతుండు గలుగా
నిను జేరగనిత్తుమె యా పార్థుని । నీ వడలగ నేలా
అని కౌరవపతి భయము వాపెనట । నా సైంధవునకునూ
భారద్వాజుడు మొదలగు యోధులు । భండనవిక్రములూ
వారిని గెలువ నశక్యముగాదే । ఘోరరణములోనా
కావున నికార్యం బాద్యులను । ఘనుల నా ప్తజనులా

గూర్చి విచారించగ మేలనుచు ము । కుందుడు దెల్పగనూ
నవ్వుచు నిట్లనె వనజోదరుతో । విద్వచ్చుం డపుడూ॥
వ చ న ము—

మరియు నా శ్రీహరితో నిట్లనియె.

శ్రీరాగం — ఆటతాళం

యెరుగనా - కురువరుల సాహస బలములను నే ॥నె॥
గురుడు కృప కృతవర్మ గురుసుత - తరణి తనయు లపారసాహస ।
పరులు శరకోవిదుల జూటను - మరచితినే యో - సరసీజోదర ॥యె॥
తెలియదా - నా బాహు సంపద కౌరవులకది ॥తె॥
కలనిలో గోగ్రహణమున నా - వులను మరలుచు కాలమున న ।
త్యలఘుబలులగు ద్రోణ కృపులా-యిల పతులు నెల్లరును నరుడని॥యె॥
ధీరులూ - కౌరవులు రాజకుమారులూ ।
వారు నన్నెరుగుదురు మరి నే - వారి నందరి నెరిగియుంటిని ।
సారసాక్షా నీ సహాయము - గోరి శపథ మొనర్చినాడను ॥యె॥
ధారుణీ - శ్రీపుల్చిపురమున వెలయు గౌరీ ధాముని ।
కోరి తపమొనరించి వరములు - గొన్న సైంధవు గూల్పకున్నను ।
దారుణంబగు నగ్ని జొచ్చియు - జేరెదను స్వర్లోకమునకే ॥యె॥

వ చ న ము—

బావా యేను జయద్రధుం జంపుటకు దమకించినప్పుడు నాకెవ్వ రడ్డంబు వచ్చెరేనియు వినుము.

## ర గ డ

పటు నారాచ పరంపరలను కురు । బలములనెల్లరనూ
ఘోటక కరి రథ బృందంబుల నని । గూల్చి నిశ్చయముగా
విధ్వంసము గావించెద సేనల । వివిధసాయకములా
నాశర కోట్లల కెదురే కౌరవ । నాయకు లెవరైనా
ఆదరింపకుము రాజీవాక్షా । యీూ పగతుర నీవూ
శరగురుండు పెరరధికులు రణమున । వెరచి చూచుచుండా ।

కురుపతిబలములు సకలచరాచర । కోటులడ్డమైనా
రణమున సైంధవు శిరము నరికెదను । రవి గ్రుంకకమున్నె
నీవుగలుగ నాకేమిభయములే । దిందీవరశ్యామా
ద్రోణుచలము బలమును గలచెదనా । బాణపరంపరలా
దేవదేవనీయానవాదు గాం । డీవధనువు నానా
దివ్యశరంబుల రేపే సైంధవు । తెగటార్చెద బావా
నీవు గనుంగొన నన్నెదిరించెడి । నీచ. నృపులనెల్లా
ఖండాడిన రక్తము భూతంబులు । దండిగ భుజియింపా
జేతుగాని నాప్రతినను నీవే । గాతువు శ్రీలోలా
యిట్టి భరము నీయందె నిల్పితిని । యిందీవరనయనా
గావున నిప్పటి కర్ధరాత్రమును । గడచె గోపబాలా
నిద్దురబొమ్మిక సూర్యోదయమున । నిద్దుర మేల్కాంచీ
రథ మాయత్తము జేయుమయ్య నతి । రయమున హరియనినా
యీ విధిసల్లాపంబులు జేయుచు । నిర్వురు హరినరులూ
కోపతామ్రలోచనులై యెంతో । కుపితమానసములా
వురగులతీరున రోజుచు నిట్టూ । ర్పులు నిగిడించుచునూ
లయకాలాంతకులో యన నుండగ । భయమునంది సురలూ
దీన నేమి బుట్టగనున్నదో యని । దిగులుజెందియుండా
సంక్షోభించెను వార్నిధులెల్లను । శైలంబులు వణకే
భూమి కంపమొందెను తురంగములు । భూరిసింధురములూ
కన్నులనీరిడె నుత్పాతంబులు । గలుగుచుండె మరియూ
దుర్నిమిత్తములు పెక్కులచ్చటను । దోచె నృపతులెల్లా
అఖిలబలంబులు దీనవదనముల । నచటనుండి మరియూ
దెల్పిన సంజయువాక్యంబులు విని । ధృతరాష్ట్రిండనియే
సూతసుతా నర నారాయణులా । రాతిరెటుల గడిపే
యెరుగపల్కుమని నంత సంజయుడు । కురుపతి కిట్లనియె
వా రా రాతిరి సిబిరంబులలో । జేరియుండి రంతా
అంతకు మున్నొకనాడు సుభద్రయు । నా పాంచాలియునూ

వు_త్తర మొదలగు మువ్వురచ్చటికి । ద_త్తరమున వచ్చి
అచ్చట శోకాతురులైయుండిన । యచ్చెలువల గాంచీ
అతివలశోకా బాప్పమనుచు (శ్రీ) । హరిని బొమ్మటనినా
అర్జును వాక్యము లాలించియు (శ్రీ) । హరి వేగమె జనియూ
శోకాతురయైయున్న సుభద్రను । జూచి గారవమునా॥

వ చ న ము—

ఆమెతో మరియు నిట్లనియె.

నవరోజు - చతురశ్రగతి

అమ్మాయింతగ - నడలగనేలా ।
యిమ్మహీపతులకు - నిది సహజంబో ॥య॥
రాచబిడ్డలకు - రణమొనరించుట ।
ఆచారమెగద - యరులను దరుగుట ॥అ॥
నీకొడుకని యిహ - లోకము విడిచియు ।
నాక సుఖంబుల - నందుచుండెనో ॥య॥
శోకము బొందగ - సుదతీజనునే ।
రాకపోకలీ - లోకధర్మమో ॥య॥
చచ్చుట పుట్టుట - సహజమె తనువుల ।
నిచ్చయించె విధి - నిర్మితవేళనో ॥య॥
యెన్నగ చప్పిడి - పున్నయనేలిన ।
పన్నగకంకణు - డన్నిమొనుంగునో ॥య॥

వ చ న ము—

అమ్మా సుభద్రా నీవు యిట్లేమియెరుంగని దానివలె శోకించెదవు క్షత్రియకాంతలు పుత్రునింగనుట వాడతిలోకవీరుడై ప్రసిద్ధికెక్కుటకు గదా నదియుంగాక.

## రగడ

అదియుగాక నీ వీరపత్నివని । యవని ఖ్యాతిబొందీ
అట్టి నీవు తనయుని శౌర్యమునకు । నానందింపకనూ

సమరములో శూరులను జయించియు । సమసిన పుత్రునికై
యింతగ నీమది గుంద బాడియే । యేమెరుగనిరీతీ
అఖిలధర్మములు దెలిసిన నీ విటు । లడలుట న్యాయంబే
పతి మరణముకై దుఃఖార్ణవమున । బడి మున్గుచు నున్నా
అతిసుగుణాత్మిక నీ కోడలి దుః । ఖార్తి మాన్పుమమ్మా
నీవు ధైర్యశాలివి సుజ్ఞానివి । నీ విట్లడలుటనూ
నిన్నుజూచి మేమందర మిప్పుడు । కన్నుల నీరిడుటా
బాగలకు నీ మగడెల్లి సైంధవుని । దెగనరికిన శిరమూ
తెచ్చి నీదు పదములకు పీఠముగ । తీర్చి దిద్దగలడూ
నా మాటలు నమ్ముము నిశ్చయముగ । నా మఘవాత్మజుడూ
నెల్లి సింధు భూపాలుని జంపియు । నిన్ను దేర్చగలడూ ॥

వ చ న ము—

అనియె నప్పుడా గోవిందుం గనుంగొనుట నుత్కటంబైన శోకం
బున సుభద్ర యాకుల తంబొంది మరియు నిట్లనియె.

యా ల లు

చిన్నితనయా సౌభద్రా నిన్ - గన్నట్టి పుణ్యామే గానీ ।
యెన్నడూ పోషించీ యెరుగరా ॥ఓ॥ ముద్దుకుమారా ।
కన్నులా నిన్నెపుడు జూతురా ॥చి॥
నీ సంతతీ ప్రజలా నెపుడూ - నా సమ్ముఖామునానుంచూ ।
ఆసయే నిరాశాలాయెనురా ॥ఓ॥ ముద్దుకుమారా ।
దోసమైనా నోమూ నోచితిరా ॥
చక్కనయ్యా వంశామునకూ - దిక్కు నీవేయనుచు నుంటి ।
దిక్కు యెవరో - దెలియాదాయరా ॥ఓ॥ ముద్దుకుమారా ।
ఒక్కడవైయని గూలినావా ॥చి॥

వ చ న ము—

సుభద్ర యనేక భంగుల బలవించుచు మరియు నిట్లనియె.

## రగడ

నాయన బాలుడవైన నీవు ద్రో । ణాది వీర వరులా
గిట్టి పెనంగియు పోరిపోరి యా । ఝట్టి మగలచేతా
ఘోరసమరమున క్రూరశరంబుల । గూలితివా తనయా
నా మేనున శిరముంచి నిద్రగొను । నట్టి నీదు మేనూ
కటికి నేలబడియుండుట కోర్చునా । కవ్వడి వరపుత్రా
వంది మాగధుల స్తోత్రంబులు విను । చుందు వట్టి నీవూ
క్రవ్యాదుల రోదనలకు వీనులు । కటకటబడవేమో
వాయుసుతుడు బలవంతుడందు రత । డాయడలెడేమో
సాత్యకి పాండవులతి బలులుండియు । సైంధవు దోలరుగా
నిన్నుగావ వేరైరొక్కో—నా । కన్నతండ్రి గారూ
పున్నమ చందురుబోలు మొగంబిటు । పొడసూపుము తనయా
వుత్తర శోకార్ణవమున మున్గుచు । నిత్తరిబడియుండే
వచ్చి నీవు యీ వెలదికి దుఃఖము । వాపుము యభిమన్యా
అని పలువిధముల వాపోయెడు న । వ్వాని తలకడ కపుడూ
పాంచాల రాజాత్మజ వచ్చి సు । భద్ర నుత్తరలనూ
యిరుగేలను బొదివినవారును తా । ధరపై బొరలుచునూ
ఆ క్రందనమును సేయుచుండ (శ్రీ) । హరి యాలించియునూ
అయ్యువిదల శోకంబు నుచితవచ । నంబుల నూరార్చి
మరలి పాండవుల పాలికిజనె య । మ్మాధవు డావేళా
అప్పుడు నాధర్మజుడా హరి నరులను । నల భీముని కవలా
పరివారంబుల నిజనిలయములకు । బంపి యుధిష్ఠిరుడూ
తన యభ్యంతర మందిరంబునకు । దరలిపోయి నంతా
దామోదరుడా యర్జునుతోడను । తద్గృహమున కేగీ
పావన జలముల స్నానమొనర్చియు । పద్మాక్షుం డపుడూ
సదమలభూమిని దర్భలచేతను । శయ్యనుగావించీ
దాని నక్షతల గంధపుష్పముల । తగ నలంకరించీ
సర్వాయుధముల నర్చనజేసియు । సారస నాభుండూ

అర్జును నటనుండగ నియమించియు । నతని కిట్టులనియే
నీవు నిశాసమయము నొనరింతువు । దేవపూజనములా
యింతకు మున్నే జేయుమనుచు తల । పించిన యా నరుడూ
పాద ప్రక్షాళన మొనరించియు । పరమభక్తి నతడూ
నిత్యముజేయు పురాంతకు పూజను । నిర్మల మానసుడై
ధూప దీప నైవేద్యములిడె సం । తోష హృదయు డగుచూ
మాల్యానులే పనములు భక్తిని । మాధవు కర్పింపా
అమ్మహాత్ము డానందంబున గొని యచట నాప్తులైనా
దవ్వారి కులటశస్త్రధారులై । తవిలి గొలిచి యుండా
నిర్ణయించి యా పార్థునిగని యిక । నీవు సౌఖ్యముగనూ
నిదురబొమ్ము నీ శుభముగోరి యుం । డెదను ధనుంజయుడా
అనుచు దెల్పి నే బోయివత్తునని । యంబు జనాభుండూ
దారకుండు దో జనుచుండగ తను । జేరె గేహమునకూ
అట్టి తరిని నవ్వీటి జనంబులు । నాత్మల వగచుచునూ
నిద్దురరాకను దీనవదనులై । నుద్దులాడు కొనుచూ
అభిమన్యుని మరణంబు జెప్పుకొను । చానరు పన్నిదమూ
జెప్పుకొనుచు నా రాత్రియంతయును । నప్పరమేశ్వరునీ
ధ్యానించుచుండిరి ప్రజలందరు । నానరు జయమునకై॥

వ చ న ము—

అని బహుప్రకారంబుల దైవంబుల ప్రార్థించుచుండ నా రాత్రి జనినంత దామోదరుండు మేలుకని దారకు నాలోకించి యిట్లనియె.

మోహన — ఆదితాళం

యేమిా విపరీతామది - వింటే దారకా ।
తామసమున నరు డీ ప్రతిన - తగునే బల్కగా ॥
యేమందును ధర్మరాజు కొలువున-భూమిాశులు నిండియుండునప్పుడు।
యేమనిబల్కె- నసాధ్యపుపన్నిద-మేమిదోచ దెట్లుగడచునోగద ॥యే॥

శూరవరుడు గురునీ కురు - వీరాసేనలా ।
యేరీతిని గడువ గలడో - యిట్టి పన్నిద।
మేరాజన్యు లొనర్చిరో పూర్వము-నినుడు బోకమునుపే సైంధవునిన్।
ఘోరశరంబుల శిరము ద్రుంతు నా-క్రూరుననుచు పట్టుబట్టె నరుడిది॥

వ చ న ము—

దారుకా యిట్టి ప్రతిజ్ఞ సేయు రాజన్యుల మున్నెన్నండైన గంటిమే గావున నెట్లైన నర్జునుం గాపాడవలయు గాన వినుము.

## ర గ డ

అట్టి దుర్దశను బొందకుండ నే । నెట్టులైన వానీ
కాపాడగవలెనో దారక యీ । కయ్యమందు నరునీ
అతడు లేని నా తనువేలను యీ । క్షితిపై బ్రతుకేలా
నాలో సగ మర్జునుడు గాన నే । నాలంబున నతనీ
యేలాగున గాచెదనో జూడుము । నెల్ల రిపులలోనా
యేవిధమున గాచెదనో రిపులను । యెట్టుల గూల్చెదనో
జూచుచుండు మోదారక కురుబల । మే చందంబగునో
భానుడస్తమించక మున్నే యీ । పాపి సింధుపతినీ
జంపువాడ పరులెందరు వచ్చిన । జంపెద నందరినీ
పాపిసుయోధను దమ్ములు మిత్రులు । బంధువు లొచ్చిననూ
సైంధవు గూల్చియు పాండవ కీర్తిని । జగతి నిల్పగలనూ
గాన రేపు మన యరదము బన్నుము । మానక దారకుడా
నాలుగశ్వములు బూన్చి సమర స । న్నాహంబున కీవూ
గరుడధ్వజం బెత్తించుము తేరున । ఘన యస్త్రంబులనూ
కవచము తనువున ధరియించుక ర । మ్మావలీలను వేగా
పాంచజన్య రవ మాకర్ణించియు । పయనమగుము సూతా
అని చెప్పిన విని దారకు డిట్లనె । నంబుజనాభునితో
దేవా నీ పట్లొనరించుటకును । భావంబున దలపా
సరిసిజాక్ష నిను బోరువార లీ । జగతిలోన గలరే
నీ సహాయమును పార్థు బలంబును । నీ భువనంబులలో

నేడు గదా దెలియును మురవైరీ । నిజము లోకములకూ
అంబుజాక్ష నీ పాంచజన్య రవ । మాలించియు రథమూ
నాలములోనికి దోలి కెత్తు గో । పాలబాల యనినా
శ్రీపతి దారకు డచ్చోటను స । ల్లాపంబుల నుండా
అచ్చట పార్థుడు నిద్రాపరవశు । డై యుండగ గలలో
గానలోలు డాతని పాలికి జన । కడు భక్తిని లేచీ
సాష్టాంగ దండప్రణామములు । సల్పి యర్జునుండూ
సెజ్జనుండి లేచియు నతడొక యడ । జేరి నిలచియుండా
హరి యాపాన్పున నాసీనుండై । నరున కిట్లనియే॥

వచనము—

కృష్ణుం డాసెజ్జపై నాసీనుండై మరియు నిట్లనియె.

ఆరభిరాగం — ఆరభి (యెంతాటి)

తగునా యిటులుండ ఫల్గునా – ధర్మజు తమ్ముడవై ॥త॥
అగణిత బలుడని లోకంబులు ని – న్నాడుకొనుట వినలేదా ।
మగ – తనమున కిది మరియాదా ।
అగ – జాపతి సత్కృపలేదా ।
పగ – వారి ద్రుంచుటకే గాదా ।
వగనుబాగల నగుబాటగు నీసరి । వారిలోన యేవ్యాపాటనరుదే ॥త॥
ఫలవించెడి మనుజుల కాయువుసిరి ।
చొలగు నినుచు మును బుధులూ ।
ఖల – హరు తాతాపస వరులూ ।
బల – విక్రమాఢ్య లిలపతులూ ।
భువి – దెలియగ నాగమ విదులూ ।
యిలనునుల్చి పురిసేలుశంకరుడు – బలికెననుచు వినవేనార్యులచే ॥త॥

వచనము—

గోవిందుం డిట్లు డెల్పుట విని బావా ద్రోణకర్ణాది యోధు లక్షమైన వారి వెనుక దాగు సైంధవుని దలచి నావగపు మానుటెట్లు దేవాయనిన శౌరిదూహ్న మొగంబై గూర్చొని యిట్లనియె.

## రగడ

విజయునచట వీక్షించి బల్కెనా । విశ్వంభరు డపుడూ
పరమేశ్వరునకు ముఖ్యసాధనం । బైన పాశుపతమూ
కేవలభక్తి సమంత్రకంబుగా । భావంబున వేడీ
కోరిక లరయా పాశుపతాస్త్రము । క్రొత్తజేసికొనినా
ఆజయద్రథుని శిరము ద్రుంచుటకు । నతి శులభము పార్థా
అని యిటు దెల్పి కిరీటిని దోడుక । నంబరమున కెగసీ
నరునిచేయి తనచేత బట్టుకొని నరనారాయణులూ
వుత్తరాభి ముఖులై పోవుచు వా । రత్తరి చిత్తములా
ఆనందమునకు బేర విహార । స్థానంబును గనుచూ
పోయిపోయి నట కనతిదూరమున । పూర్ణమణిమయంబై
తేజరిల్లు మణి మందిరంబులో । దివ్యగణము గొలువా
తాపస బృందము ప్రమథ గణంబులు । తవిలి గొల్చుచుండా
పార్వతి సహితుండై గొలువుండిన । పరమేశ్వరు గాంచీ
సాష్టాంగ దండప్రణామములు । సల్పి భక్తినిలువా
నరనారాయణు లిరువురగాంచియు । పరమేశ్వరు డనియే
మీ రిరువురు యిట జనుదెంచుటకును । కారణమది యేమో
యేమిగోరి వచ్చితిరో దెల్పుడు । ప్రేమ నిశ్వరనినా
యేకార్యంబైనను సమకూర్చెద । నెరుగ బల్కుడనినా
భక్తిమీర నంజలి ఘటించియూ । భర్గునితో ననియే
యిందుధరాయన శశియున లాక్షా । యీశా సర్వేశా
భోగి భూషణా భువనరక్షణా । పూజిత వరచరణా
సాధుజనావన దీనరక్షణా । శంభో భవహరణా
హిమన గాత్మజాహృత్సర సీరుహా । భ్రమర వ్యోమకేశా
పరమ దయాళో మా ప్రార్థనలను । పాలించుము దేవా
అని యిటు నిశ్వరు స్తోత్రము జేయుచు । నంబు జోదరుండూ
పార్థా పాశుపతంబును వేడుము । పరమేశ్వరునని నా
వరము వేడుటకు రుద్రునిగాంచియు । వాసవనందనుడూ

తాను మున్ను హారికల్పించిన గం । ధాది ద్రవ్యములునూ
పూజా ద్రవ్యంబులు నన్నియు నా । పురహరు సన్నిధిని
నుండుట గాంచియు హాశ్చర్యంబున । పాండవ మధ్యముడూ
శివ కేశవులకు యే కత్వంబని । చిత్తంబున దలచి
కడు భక్తిని యా పరమపావనుని । గాంచి యిట్టు లనియె॥

వచనము :-

మరియు నా భక్తవత్సలుండగు గంగాధరు నిట్లని ప్రార్థించె.

తోడి — చాపుతాళం

దీనవత్సలా దేవదేవ యీా - శాన బ్రోవవే ।
భూనభోంతరాళంబుల నెల్లను - పోషింతువునీవే ॥దీ॥
సకల జీవకోట్లను పోషించెడి - సర్వేశుడ వీవే ।
సకల లోకముల కంతరాత్మయా - శాశ్వతుండ వీవే ॥దీ॥
పాశుపతాస్త్రము కరుణ నొసగుమో - భర్గశూలపాణీ ।
ఓ శుభదాయక గజదానవ హర - యీాశభక్తపాలా ।
అరయగ చప్పిడి పున్నయాఖ్యునకు - నఖిల సంపదలనూ ।
శిశుల నొసగి రక్షించెడి గిరి జా - వరుడ వీవేగావా ॥దీ॥

వచనము —

అర్జునుండు భక్తి పరవశుండై ప్రార్థించుట విని పరమేశ్వరుం
డా కృష్ణార్జునులం గని యిట్లనియె.

## రగడ

అమృతమయంబౌ కమలాకరమున । నస్త్రాస్త్రములెల్ల
నిలిచియున్న దవి గొనితెమ్మని । దెల్పిన నరుడా శౌరీ
అచ్చట పరిసరవర్తుల గొందరి । నిచ్చనుగొని చనియూ
పద్మాకరమున గాంచి నంత యా । బాణచయం బెల్లా
పాములగతి విషజ్వాలల గ్రక్కుచు । బహునుగ్రతనుండా
గాంచియ స్త్రముల మహిమ యటంచును । కవ్వడు మోదమునా

పాదప్రక్షాళన మొనరించియు । భక్తి వినయములతో
సాష్టాంగ దండప్రణామములు । సల్పి వేదవిధులా
శతరుద్రీయ జపంబు జేయగా । సర్వేశుని కృపనో
వురగరూపమును వీడియు ముందటి । తెరగున గన్పడగా
శరచాపంబులు దెచ్చి శంకరుని । సన్నిధి బెట్టుటయు
భవుని పార్శ్వమున బ్రహ్మచారి యొక । బాలు డచటినుండీ
చాపము గొని నారిని బిగియించియు । శరము విడిచి నంతా
పాశుపతాస్త్రము నెక్కుడు పద్ధతి । పార్థుడు గనుచుండా
పురహరుండు కరుణాంత రంగుడై । పుణ్య మంత్రములనూ
వుపదేసించిన గ్రహియించియు నా । వుమపతి నాన నతినీ
శర చాపంబులుగొని జని పద్మా । కరము నిడి యతండూ
పులకాంకిత దేహుండై శ్రీహరి । గలిసి మోదమలరా
యిరువురు పశుపతి యాజ్ఞగొనియు శం । కరుని పదంబులకూ
శిరములు సోకగ బ్రణమిల్లియు నా । శివుని వీడ్కొనియునూ
తామరసాక్షుడు సవ్యసాచి తమ । తమ శిబిరంబులకూ
జనుదెంచియు కలగంటి ననుచు న । ర్జునుడు మేలుగాంచే
శ్రీహరి దారకుతో దగు మాటలు । జెప్పుచుండునంతా
తెలతెలవారె నటంచు విభునితో । దెలిపె సంజయుండూ॥

వ చ న ము—

సంజయుండు ధృతరాష్ట్రునకు దెల్పినట్లు వైశంపాయనుండు జనమేజయునకుం దెల్ప విని మునివరా కృష్ణార్జును లిరువురు నా రాత్రి గడిపి మరుదినంబున నేమొనర్చిరో దెల్పుమన విని జనమేజయునకా వైశంపాయనుండు దెల్పినట్లు ధృతరాష్ట్రునకా సంజయుండిట్లు దెల్ప నదిరిపడి సూత సూనున కిట్లనియె.

జంఝూటి — ఆటతాళం

కౌరవపాలా–కామితలోలా–మారజనకుడా–మఘవాత్మజులిర్వురు ॥కౌ॥
ఆరాతిరిని–ద్రను మేల్కని వా–రారూఢతకృత్యములను దీర్చుక ॥కౌ॥

సముచిత సల్లాపంబుల నుండగ-శమనాత్మజు డా సమయమునందున॥
వంది జనులు పొగ డొందుచు నుండగ - పొందుగ మేల్కనె నిందు
కులేశుడు ॥కొ॥
కాలకృత్యములను - కడువడి దీర్చియు - చాల నుల్పుపురి - శంభుని
దలచుచు ॥కొ॥

వ చ న ము—

ధర్మజుండు మేల్కని కృతస్నాతుండై దివ్యాంబరాభరణ భూషి తుండై పరిమళ గంధ లేపనంబు లొనరించి సురభి కుసుమమాలికలు ధరించి దేవార్చనంబు గావించి యగ్ని కార్యంబు నెరవేర్చి కక్ష్యాంతరంబునకు వెడలి విప్రనికరంబులకు ధేనుప్రకరంబుల దానం బొసంగి తదాశీర్వాదంబులం గొనుచు నేనుంగు మొగసాల గడచి యాస్థాన మంటపంబునకు వచ్చి.

## రగడ

తమ్ములు గొలువగ కొలువై యుండిన । ధర్మరాజు కడకూ
దౌవారికు డేతెంచి భక్తితో । దగ నమస్కరించీ
ధరణీవర దామోదరు డిచటికి । తరలివచ్చె నిపుడూ
అని దెల్పిన విని దౌవారిక (శ్రీ) । హరిని దోడితెమ్మా
అని యానతి నొసగిన దౌవారికు । డతివేగమె జనియూ
అంభోజాక్షుని దోడితేర ధ । ర్మాత్మజుండు గనియూ
ఆదరమున నుచితాసనంబుపై । నధిష్ఠింపజేసీ
తామరసాక్షుని మోముగాంచి యా । ధర్మజు కిట్లనియే
సరసిజోదరా మమ్ముల గాచిన । సామి నీవె గాదా
యెన్నెన్నియొ కష్టములను బాపిన । వెన్నుడ నీవెగదా
కన్నతండ్రివలె మమ్ముల జాకిన । ఘనుడ నీవెగాదా
యివ్వ దక్షునుడు సల్పిన శపథం । బెట్టులైనగానీ
కడతేర్చుట నీ భారమెగద యో । కంజాయతనేత్రా
నిఖిల శుభంబులు నొడగూర్చుటకును । నీవెగాదె దేవా

యెన్నో రీతుల శౌరిని బొగడుచు । నున్న యంతలోనా
భీమ నకుల సహదేవులు సాత్యకి । బిరుదు మగలవారూ
ద్రౌపదేయ పాంచాల ఘటోత్కచ । ధరపతి విరటుండూ
కేకయాది మొదలగు నరనాథు ల । నేక సైన్యములతో
వచ్చి ధర్మజుని బొడగాంచిన యా । సచ్చరిత్రు డపుడూ
వారలనుం దగు నుచితాసనముల । గూరుచుండ బంచీ
వారందరు వినుచుండగ బల్కెను । వాసుదేవు తోడా
దేవా మా బడుపాటులెల్లను । దెలిసియుండె నీకూ
మా రాజ్యంబును గోలుపోవుటలు । మాధవ గనుగొంటే
అన్ని యెఱింగియు సైంధవు వధకై । యర్జును జయమునకై
తేరుకు సారథి వైతివింక నే । వేరె చెప్ప నేలా
అల కిరీటి యొనరించు ప్రతినసీ । యాత్మనుంచు మయ్యా
అని యిటు వేడుచున్న ధర్మజున । కా హరి యిట్లనియె॥

వ చ న ము—

మరియు ధర్మజున కా శౌరి యిట్లనియె.

యదుకులకాంభోజి—ఆటతాళం (జనని)

కౌంతేయా - యింతగ దెల్పవలెనా ॥కౌం॥
అంతరంగమునందు నిక నీసు - మంతయైనను చింత వలదిక ।
పంతమున పార్థుండు సైంధవు - నంతకుని కడకంపు టరుదే ॥కౌం॥
వైరీ - సేనల నెల్లా ననిలో ॥వై॥
క్రూరనారాచములచేత - ఘోర రణమున గూల్చి శవముల ।
భూరి భేతాళాదులకు నా - హారముగ వేయింతు గనుమా ॥కౌం॥
మనము నా - సందేహించ నేలా ॥మ॥
అనుజు డిటు పన్నిదము జేసె న - టంచు యాత్మను గుందుచుందువు ।
దిన కరుడు గ్రుంకకనుమున్నే - దీర్చెదను మెప్పించెదను నిను ॥కౌం॥
యెన్నగా - నుల్చి పురిని వెలసీ ॥యె॥
చెన్ను మీరగ ధరను చప్పిడి - పున్నయాఖ్యుని బ్రోచు శంకరు ।
డన్న రాధముగావ వచ్చిన - మిన్ను కేగినవాని విడుతునే ॥కౌం॥

వ చ న ము—

శ్రీకృష్ణుం డిట్లు దెల్పుచు ధర్మజా క్రోదశోక జ్వర విముక్తుండవై శాంతింబొందు నవసరంబున ధనుంజయుండు వచ్చి ధర్మజునకు మ్రొక్కి నిలిచినంజూచి యతండు సంతసంబున కౌగిలించుకొని దీవించి మందస్మిత వదనుండై యిట్లనియె.

## ర గ డ

నీవు గెలువగలవో పార్థా యిది । నిశ్చయంబు సుమ్మా
పద్మాక్షుడు నిను గెలిపించుటకై । పట్టుబట్టె ననుజా
అని యిటు దెలిపిన ధర్మనందనున । కర్జును డిట్లనియే
ధర్మజ నీ భద్రమునకు దేవకి । తనయు కరుణ గాదే
అగ్రజ నే స్వప్నంబున గంటిని । యాశ్చర్యం బౌకటీ
బంధుమిత్రగణ సహితముగా విన । వలయు ధర్మరాజా
ఫాలలోచనుని సన్నిధి కేగియు । పాశుపతాస్త్రమునూ
గైకొంటిని శైలాత్మజ వల్లభు । కరుణను యీ నేడూ
అందరు వినగా దెల్పిన సభవా । రందరు మోదమునా
భక్తి వినయముల ప్రార్థన జేసిరి । భవుని మదిని దలచీ
తదుపరి ధర్మజుచే ననుజ్ఞగొని । తరలి యోధులెల్లా
సంగర సన్నాహంబుల మెరయుచు । జనిరి నిలయములకూ
అంతట కృష్ణార్జునులు సాత్యకియు । నా యుధిష్ఠిరునకూ
అభివాదనము లొనర్చి వార లతి । హర్షంబుల జనియూ
అర్జునుండు వసియించు గృహంబున । కందరు జేరియునూ
అందు శౌరి తన రథము సమరమున । కాయత్తము జేయూ
సవ్యసాచి రణసన్నద్ధుండై । శస్త్రపాణి యగుచూ
వెడలియు విప్రాశీర్వాదములతో । వేగవచ్చి నరుడూ
అమ్మనీయ స్యందనంబుకడ । కరిగి చుట్టు దిరిగీ
సాష్టాంగ వందన మొనరించియు । స్యందనంబు నెక్కీ
మేరు శిఖరమున బొలుచు భాస్కరుని । తీరున విలసిల్లే

అంత కృష్ణ సాత్యకులు నొగలపై । నతని పిసుదనునా
బుధుడు శుక్ర. సహితంబగు చంద్రుని । పోలిక ఫల్గునుడూ
వప్పుచుండ గాయక పాఠకులును । వందిమాగధులునూ
పాఠకరవములు వినుచు జనిరి యా । పద్మాక్షుడు నరుడూ
అప్పుడు వారలకు జయ వాయువ । లంకురింపసాగే
కౌరవులకు నపజయ సూచనలను । గంధవహుడు వీచే
ఆవిధ చిహ్నంబుల సాత్యకితో । ననియె సవ్యసాచీ
మన కనుకూలంబయ్యెడు శకునము । లను దోచెను నేడూ
సేనాహవమున కేగెద సాత్యకి । నీ విచ్చట నిలిచీ
మానవనాథుని రక్షణ సేయఁగ । బూని యరుగుమయ్యా
ధర్మజు రక్షణ సేయ నీవు సైం । ధవుని జంప నేనూ
యిరువుర పని సరిగా వున చెరియొక । టరయ చేయవలయూ
యింతగ దెల్పు నదేమిటన్న నీ । వెరుగవె శరగురుడూ
ప్రతినజేసె శమనాత్మజు బట్టగ । నతిబల విక్రముఁడూ
సామాన్యుండేయని బల్కిన విని । సాత్యకి జని యపుడూ
ధర్మనందనుని కడ నిల్చిన గని । ధరణీశుడు వేగా
సమరోత్సాహుండై వచ్చియు తమ । సైన్యంబులలోనా
నిలిచె ననుచు సంజయుడు దెల్ప విని । యిట్లనె కురువిభుడూ॥

వ చ న ము—

సంజయా పుత్రశోకానలంబున గ్రాగుచు మృత్యుభంగి భీభత్సుం డేతెంచి నంత.

ముఖారి - ఆటతాళం

యేమందునో సంజయా, యీకురు వంశ - మేగతి గానున్నదో ।
యేమి మూడగ నుండె కొడుకున - కేల దుర్మార్గము జనించెను ।
యేమి చేటొనగూరెనో పురి - నిట్టి విపరీతములు గలిగె ॥యే॥
వినుచుండ పట్టణ - మున యార్తరవములు ।
వినవచ్చె నలుదిక్కులా ॥

మనము నడచుచునుండె నొక్క - మ్మడిగ ప్రతియింటింట శోక ।
ధ్వనులు ప్రబలుచునుండె యిది యే - మనగవచ్చును కాలగతిని ॥యే॥
తుంటరి సైంధవు - నింటి దిక్కు వినగా - దోచె విపరీతములూ ।
కంటకంబై విపులమా యూ - క్రందన ధ్వని నతిశయిల్లెను ।
మింటి శిఖడౌనుల్చి పురి ము- క్కంటిదయ యెటుగాగ నున్నదొ॥యే॥
వ చ న ము—

సంజయానాడు భీష్మ ద్రోణాదులు జెప్ప శౌరి సంధివాక్యంబులు వినడాయె కర్ణ దుశ్శాసన సౌబలు మాటలు విని కురువంశంబు నంత రింపజేసు కొనెయె.

## ర గ డ

పోరెను రుద్రునితో వెనుదీయక । పురుహూతాత్మజుడూ
యేమిట దక్కవ కేశవుండు దా । నెల్ల భువనములకూ
ప్రమింగజాలు మాధవుడు నరుని నొగ । లంగరువము నెక్కి
యెంతగ దెల్పిన రాజ్యలోభమున । వినడు సుయోధనుడూ
యేమిసేతునో సూతనందనా । యెటుల గలదో
అన విని ధృతరాష్ట్రునితో నిట్లనె । నా సంజయు డపుడూ
నీవు దుర్గయుడవై తనయుని పై । నెపము బెట్టనేలా
పాండురాజ తనయుల భాగపు సిరి । బంచి యిచ్చి యున్న
యిట్టి కాలమేటికి సంభవమా । యిందుకులాభరణా
యే కాలంబున కెటు లగునో విధి । నెవ్వ రెరుంగుదురూ
గడచిన దానికి చింతసేయు టిది । ఘనకార్యంబౌనా
గాన వినుము తదుపరి జరిగిన మన । కయ్యపు వర్తనమూ
చాపాచార్యుడు రేపకడను తా । సంగరోన్ముఖుండై
వెడలివచ్చి శంఖము బూరించియు । వేగ సేనజొచ్చి
గలయ మెలగు నప్పుడు మన యోధులు । గాంచి సంతసములా
తమ యాయుధములు గొని నొండొరులను । తగను బిల్చుకొనియూ
బిరుదులు బల్కుచు నొకరు నొకరితో । నరుడు రాడి దేమో
రాజీవాక్షుడు దేసదోలు కొని । రాక తక్కనేమో

భీముండైనను పోడసూపడు గద । యేమి కారణంబో
అనుచు సింహనాదములు శంఖ రా – వంబును మ్రోయుచునూ
సైన్యంబులు బొంగెడు సమయంబున । శరగురు డాతురుడై
సైంధవుతో ననె నీవును భూరి । శ్రవుడు రాధ సుతుడూ
శల్య కృపాచార్యశ్వత్థామల । సరసగూడి నిలువూ
మన బలములలో మేలగు ధీరా । గ్రణులనేకు పరచీ
అరువది వేలేనుంగులు గుఱ్ఱము । లరయ లక్ష గొనియూ
పది లక్షల భటవర్గంబులతో । పయనము గావలయూ
నాచే దీర్చగబడిన మోహరము । నకు యోజనత్రయమూ
నిర్మలమగు భూమిని సైన్యంబులు । నిలిచియుండ వలయూ
అక్లైనను మోహరము దేవతల । కైన చూడరాదూ
అని యిటు దెల్పుచు భారద్వాజుం । డతి తీవ్రంబుగనూ
శకటవ్యూహంబును సమకట్టియు । సరగ వ్యూహమునకూ
పశ్చిమార్ధమున గర్భ వ్యూహము । బన్నించిన యతడూ
సేనాముఖమున నిలిచియుండెనా । ద్రోణాచార్యుండూ
అట పిరుంద గృతవర్మ నిలిచె న । త్యంత బాహుబలుడై
అతని వెంట కాంభోజుడు శత స । హస్ర బలంబులతో
వారి వెనుక సైంధవుడు నిలుచు న । ట్లొప్పరుచుకనుండా
అమ్మహా వ్యూహము జూచి నిర్జరులు । నాశ్చర్యము బొందే॥

వచనము—

ద్రోణాచార్యుండు వ్యూహంబు బన్నిన సేనలు నిలిచియున్నంత వారలలో దుర్మర్షణుండు నర్జును నే నొకండ జయింతునని సింహనాదంబు జేయుచు వెడలివచ్చి నయ్యోద్ధనంబునకు వేయు నేనూరు విండ్లపెట్టు దవ్వున ముందట నిలిచినంత.

## రగడ

సింధురాజ రక్షణ కార్యార్థము । బంధుర విక్రములూ
అల వికర్ణ దుశ్శాసనులును నిజ । బలములతో డుతనూ

ఆ వ్యూహాము చేరువ కేగియు వా । రచట నిలిచియున్నా
ఆచార్యుండు నభేద్యంబగు వ్యూ । హామునకు ముఖమునమూ
నిలిచి ధవళ వస్త్రంబును శిరో । ష్ణీషంబును మరియూ
శ్వేతవర్మమును నరుణాశ్వంబులు । వేదికాధ్వజమునూ
చండతరంబగు కోదండుండై । దండధరుని మాట్కి
బొలిచి నిలువ సైన్యంబులు మనముల । బొంగుచుండిరంతా
అప్పుడు కౌరవులును కురుపతియును । హర్షంబుల నుండే॥

వ చ న ము —

యిట్లు దుర్యోధనాది కౌరవులు ప్రముదిత హృదయులై యుండి రా సమయంబున.

అసావేరిరాగం — ఆదితాళం

వెడలె నపారబలుండై పార్థుడు - వే సమరమునకునూ ।
కడువడి వానర పడగ కాంతులను - విడువక ధ్వజమున - వెలుగుచు
నుండగ ॥వెడలె॥

తనకు ననతి దూరంబున ద్రుపదా । త్మజుడు నకుల సుతునీ ।
గొని సైన్యంబుల బిరుదు మూకలను ।
నని భూమిని నడిపించె ధీరుడై ॥వెడలె॥

భేరి పణవ శంఖా రావంబులు - భోరున మ్రోయగనూ ।
భూరి సింహనాదంబు లెల్లెడలను ।
భోరుకొలుపుచుండగ రుద్రుండన ॥వెడలె॥

దేవదత్త మొత్తె నర్జునుడు బల్ - తీవ్రగతిని మ్రోయా ।
దేవకిసుతు పాంచజన్య రవ మప్పు ।
డావహిల్లె నల్దిశలు నిండగా ॥వెడలె॥

సమ్మతి నుల్ప్రపురమ్మున వెలసిన - కమ్మవిల్తు హరునీ ।
నెమ్మనమున స్మరియించుచు గాండీ ।
వమ్ము ధరించి రవమ్ము సేయుచును ॥వెడలె॥

వ చ న ము—

ఇట్లర్జునుండు గాండీవ గుణంబు సారించుచున్న విని మన సైన్యం బగ్గలించె మరియు.

రగడ

రాజా మన సేనల కతిశంబగు । రాలవాన గురిసే
నక్షత్రంబులుడుల్లెను పిడుగులు । నలు దిక్కుల బడియే
తమ యంతట తామే తూర్యధ్వను । లమితంబుగ మ్రోసే
అప్పుడు మన బలములు నొకరొకరిని । యూహ్వానించుకొనీ
సింహా నాదములు జేయుచు బలములు । జెలగుచుండి రంతా
చెలియలి కట్ట మహా సంద్రంబును । నిలిపిన తెరగుననూ
విజయు నిల్పెదనని దుర్మర్షణు । డేడ్తెరజని నంతా
గని పార్థుడు శ్రీ హరి కిట్లనియెను । గంటివె కరి గమితో
వచ్చుచుండె దుర్మర్షణుండు యా । తుచ్ఛుని దెస రథమూ
దోలుము యీా దుర్మదుని రణంబున । తొలి ముద్దగ జేతూ
ననిన శౌరి రథమును దోలిన నరు । డని మొననిల్చియునూ
ఆ దుర్మర్షణు నెన్నపైని శ । స్త్రాంబులు బర్వా
కౌరవబలములు మొత్తములై యా । కవ్వడిపై బొదువా
కని పార్థుడు తన శస్త్రంబుల చే । తను బలువును జూపా
కురుబలముల నర్జునుడు శరంబుల । నరకుచుండు నంతా
తాళఫలంబుల తెరగున పగతుర । తలలు డొల్లె భువినీ
తుండంబులు దెగి గజ తండంబులు । భండనమున బడియే
నెత్తుట దోగుచునుండె సామజము । లత్తరి రణముననూ
యీా రీతిని సైన్యంబుల గూల్చెడి । నింద్రాత్మజునకునూ
భయమందక నరుపై గ్రమిన కురు । బలములు ధీరతనూ
సకల శస్త్రచయముల గ్రమ్మిన గని । సవ్యసాచి యపుడూ
అన్ని శరంబుల మధ్యమధ్యనే । యవని గూలనేయా
పొదువుడు పార్థుని బట్టుం డనుచును । పోనీకుండనుచూ
కేకలు బెట్టుచు ధీరత కౌరవ । మూకలు గ్రమ్మగనా

కనలి పార్థు డత్యంత రోషమున । కౌరవబలములనూ
భండనమున శరకాండంబుల కరి । తుండంబులు నరికీ
తురగంబుల తనువులు చక్కలుగా । నరుకుచు రథములనూ
పొడిపొడి జేయుచు సారథులను త । త్పడమిని బడవైచీ
శరముల విండ్లను కాల్బలంబులను । నరుకుచుండు నంతా
నెత్తురేరులై బారుచుండ గని । చిత్తంబున నదిరీ
మరలెను దుర్మర్షణుడో నృపవర । మురమునవిలువకనూ
అని చెప్పిన విని ధృతరాష్ట్రుం డిట్లనె సంజయు తోడా॥

వచనము—

మరియు నిట్లనియె.

జంఝూటి — ఆటతాళం

తరిమి నరుకుచుండ నరు నెది - రించువారలు సంజయా ।
కురుబలంబుల నొక్కడైనను - పురుషవర్యుడు లేడొకో ॥త॥
చనిర దేవా పార్థు కోల్తల - కును సహింపగ లేకనూ ।
మనములను భీతిల్లి ద్రోణుని - మరుగు జొచ్చిరో సేననూ ॥త॥
శ్వేతవాహను గెల్చు మగలీ - భూతలంబున నుందురే ।
పాతకుని కృత్యంబె నాశన - హేతువయ్యెను సంజయా ॥త॥
ధరను నుల్చిపురీశుడౌ శం - కరుని కృపలే కిట్టులా ।
కురుకులము హరియించునని మది - గుందు గల్గెను సంజయా ॥త॥

వచనము—

యివ్విధంబున వగల బొగులుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

## రగడ

జనవర వినుమా దుశ్శాసనుడా । సమయంబున వెడలీ
కరి తురగ స్యందనములతోడను । కవ్వడి నెదిరించీ
దాకినంత నరు డల్లన నవ్వుచు । దర్పోజ్వలుడగుచూ
దేవదత్త మొత్తియు సరోషుడై । దివిపతి నందనుడూ
గాండీవ జ్యానాద మొనర్చియు । శరిత సాయకములా

దుశ్శాసను చతురంగబలంబుల । ద్రుంచుచు నేనుగులా
వెరగు పరచి యారోహజనంబుల । శిరములు నరుకుచునూ
క్రూరశరంబులు దాకి తునియలై । గూలు రథంబులునూ
బాణపాతముల దెగియు నొగలపై । బడెడి సారథులునూ
కరపాదంబులు దెగిపడు రథికులు । కార్ముక బాహులునూ
కలని నాల్గు దిక్కుల ఘోరంబై । గన్పట్టుచునుండా
దుశ్శాసను డా కోల్తల కోర్వక । దూరము జనుచుండా
అయ్యువరాజును వెనుకొని యర్జును । డరెరె నిలువుమనుచూ॥

వ చ న ము —

మరియు దుశ్శాసనుం గని యిట్లనియె.

శుద్ధకాంభోజి — ఆటతాళం

నిలు నిలురా దుశ్శాసన – నీ వెందులబోగలవుర ॥ని॥
ఖలుడా నీ వెట కేగిన – దొలగదురా చావు నీకు ॥ని॥
అలనాడా సభ నించుక – యలుక లేక మమ్మాడిన ।
పలుకుల మరచియు కలనికి – చలమున వచ్చితివేమొ ॥ని॥
సింగముపై బోరాడగ – సింధురంబ దేలవచ్చు ।
వెంగలి వచ్చితివె నాదు – మ్ముంగలిగా సేనలతో ॥ని॥
ధర చప్పిడి పున్నయ చౌ – దరి నేలిన శంభు కరుణ ।
దొరికితివీ రణములోన – దుర్మదాంధ పోకు పోకు ॥ని॥

వ చ న ము—

నరుం డిట్లనుచు దుశ్శాసను పెడతలయును వెన్నును పదితూపులా నేపారి యేసిన నతండు.

## ర గ డ

నరుని శరంబుల కోర్వలేక నీ । నందనుండు వడిగా
మరలి చూడకను పోయి పోయి యా । శరగురు జేరగనూ
అంతట నర్జునుడా సైంధవు దెస । కరుగుచున్న వేళా
మనసైన్యంబుల ముందు నిలుచు ద్రో । ణుని గని పారుండూ

అనతి దూరమున నిలిచి వందనం । బాచరించి యతడూ
శ్రీకృష్ణుని యనుమతిచేతను తన । చేతులు జోడించీ
వినయ విధేయుండై యిట్లని ద్రో । ణునకు విన్నవించే
మాయెడ మేలు దలంచి శుభంబుల । నీయుము గురువర్యా
పాండురాజ యా ధర్మజ కృష్ణుల । పాటిగాదె నీవూ
నిను ప్రార్థించి భవత్ప్రసాదము ను । గొన ననిమొన జొరగా
వచ్చితి గాన ననుజ్ఞనీయవే । వసుధామర వర్యా
నను యశ్వత్థామను నొక్కటిగా । బెనిచితివో దేవా
ఆ విశ్వాసముజూపి ద్రోహి । సైంధవుని జంపుటకునూ
ప్రతిన యొనర్చితి గాన దీర్పుమో । సుతభావము దలచీ
అని యిటు వేవిధముల ప్రార్థించిన । నర్జును వీక్షించీ
చిరు నవ్వొలయగ శరగురుండు న । న్నరున కిట్లులనియె
నను గెలువక సైంధవు నెటు జేరెద । వనుచు జాప గురుడూ
హరిపై రథ్యంబుల ముందుగ । నమ్ములు గ్రుమ్మగనూ
అని సేయగ శరగురునకు విజ్ఞా । పనముజేసి నరుడూ
అనుమతి విడసి నిశాత శరంబుల । నతని మేననేయూ
గని యాచార్యుం డవి మధ్యనె గడి । ఖండంబులుజేసి
తోడనె హరి మేనను నరునొడలను । తూపులు సంధింపా
గని పార్థుడు యాచార్యుని విలు విరు । గగనేయగనున్నా
అంతలోనె నరుపూర్విని ద్రుంచెను । యాచార్యుడు వేగా
అంత బోక గేశవుని పతాకా । శ్వములను ద్రోణుండూ
మార్గణచయముల ముంచి విడువకను । మరియుకుంభ భవుడూ
విజ్రుంభించిన గని క్రోధుండై । వివ్వచ్చుండలిగి
పటు తీవ్రముగను ద్రోణాచార్యుని । బాణంబుల గొట్టి
గురుని కెలంకులనున్న సైన్యముల । జొరబారియు నరుడూ
అరదంబుల నరవరలుజేసి కరి । యశ్వతతిని గూల్చి
బలముల నెల్లను చాపకట్టుగా । బడనరుకుచు నుండా
కని గురుండు సేనల కడ్డముగా । జని యొక నా రసమూ

అర్జును వక్షము దూరనేయగా । నతడు యెల్లబోయీా
కొంతవడికి డెలివంది శరంబుల । కుంభ భవునినేయీా
ఆత డైదు శరముల (శ్రీ) హరినిన్ । నరుని డెబ్బదింటా
కేతనంబు మూడింటను రథము ని । శాతసాయకములా
పొదివినంత నీ సేనలు కొందరు । భూరి విక్రమములా
నా యిరువుర్పై గ్రమ్మినంత ద్రోణాచార్యుడు రేగీ
బలునా రసముల గొట్టుచుండగా । పార్థుడు శరగురునీ
గడువంజాలక చిక్కువడిన యీా । గాండీవిని గనియూా
పార్థా రిత్తగ కాలముగడుపుట । పాడిగాదు మనకూా॥

వ చ న ము :-

అని మరియు నిట్లనియె నిత్తరి యాచార్యునితో యీా శుడిగిశగట వ్యూహంబు జొత్తము నొందు తలంపు వలదన విని గ్రీడి యీా హరి కిట్లనియె.

పూరికళ్యాణి — రూపకము

నీ యానతి దాటుదునే – నీరజోదరా । కృష్ణా। నీ॥
యే యెడకున్ జను మన నే – నా యెడకుం జనుదుగాని ।
కాయజ జనకా నీ పద – కంజములే దిక్కని మే ।
మే యెడ హృదయంబులందు – బాయక స్మరియింతుమయ్య ॥నీ॥
బావా నీ సత్కృపకే – పాత్రుడగద గానలోల ।
దేవ వినుత దివ్యచరిత – దీనావనగోపబాల ।
నీవే గద లోకంబులు – నిర్మింతువు పోషింతువు ।
నీవేగద హరియింతువు – నిఖిలలోక జీవకోట్ల ॥నీ॥

వ చ న ము—

అర్జునుండు ప్రార్థించి మరల నిట్లనియె.

## రగడ

తేరు ప్రదక్షిణముగ బోనిమ్మా । భారద్వాజునకూా
అనిన ప్రదక్షిణముగ దోలెను రథ । మూా హరి గురునకునూా

అరద మేగుచుండగ శర పంక్తుల । దొరగజేసి నరుడూ
పోవుచుండగా గనుగొని సవ్యాచు । భూమీసురు డపుడూ
పార్థా పగతుర బరిమార్పక నటు । బారుట న్యాయంబే
యనుచు వెంటనంటిన యాచార్యున । కనియె ధనంజయుడూ
దేవా గురుడవుగాక పగతుడవె । భావంబున దలపా
దురమున నిన్ను నెదుర్కొన నా కొ । క్కరునకు శక్యంబే
పురహరునకు సాధ్యం బనుచును దా । బోవుచుండ నరుడూ
చక్ర రక్షకులు పాంచాలాదులు । సరస నడుచుచుండా
కపికేతను డటు బోవుచునుండగ । కలశభవుం డపుడూ
కదిసి నిరువదేనమ్ములు వేయుగ । ఖండించియు వడిగా
దివ్య సాయకము లేసినంత గని । ధీరుడు కుంభజుడూ
అన్నిటి నరికియు సవ్యసాచియను । నద్రిని శరవృష్టి
గురిపించిన నతడేయక గురు శర । ముల నన్నిటి ద్రుంచే
అంత నిరువదేనమ్ముల నర్జును । హరిని డెబ్బదింటా
గొట్టిన నాగక పార్థుం డెత్తెర । కుంభజు నేయగనూ
అలవిగాని నా మేటి మగండట । నిలిచియుండునంతా
విద్యాచ్ఛుడు కృతవర్మ సైన్యముల । విడిబడి జొచ్చుటయూ
కార్ముక గురు డపు డేమి సేయలే । కను సేనాముఖమూ
జొచ్చి రక్షణకు నిలిచియున్న వి । ద్యాచ్ఛుడు మార్కొనినా
కృతవర్మయు పది నారసమ్ములను । సతనిగొట్టినంతా
చలమున నొక వాలమ్మున వక్ష । స్థలము దూరనేసీ
మూ డంబకముల నొవ్వసేయ నా । రేడు ధీరుడగుచూ
నరనారాయణులను నిర్వుర గని । సవ్యాచు నాతండూ
వెరువక నిరువది తూపు లేపునను । బరగించినయంతా
గని వసుదేవాత్మజు డా యర్జును । కనియె నిట్టులనుచూ
తడవుసేయ దగ దింక నితడు నె । క్కడి బంధుడు మనకూ
తెంపుసేయుమన నర్జునుండు వా । లంపగములు గొనియూ
వేసినంత కీలూడిన జంత్రము । విధమున బడె నతడూ

యీరీతిని భోజాధిపు మూర్ఛను । గూరజేసి యచటా
వదలిపోవుచుండగ భోజేశుడు । వ్రాలు మూర్ఛదేరీ
వెంటనంటి శరపంక్తులు నరుపై । వేయుచున్న యంతా
గని బాణాష్టకమున భోజాధిపు । ధనువు విరుగనేసీ
జనుచుండగ గని వచ్చి శ్రుతాయుధు । డను రాజేంద్రుండూ
మార్గోనిపై నింపెను తా । మార్గణత్రయంబూ
వాసుదేవుపై సప్తతిశరముల । వారితముగ నింపీ
కపికేతనమును నొక్కొకోలచే । కడువడి వేయగనూ

వ చ న ము—

గని యర్జునుండు క్రోధావేశుండై శ్రుతాయుధున కిట్లనియె.

దేవగాంధారి — ఆదితాళం

యెటులా జోకిట నిల్వరా – ఓరోరి శ్రుతాయుధ ॥యె॥
కుటిలచిత్త నేడ్తెర శరరాజిని – నిటుల బరపుచుంటివి రామేనను ।
పటు సాయకజ్వాలల నీ మస్తక – మిటుల ద్రుంతునెంతటి మొన గాడవో ॥యె॥

తారా తమ్ముము లెంచకా – భోజాధిప సుంతయు ।
ధీరుడవై యెదిరి బలము నీ బల – మే రూపంబని దలచవైతివో ।
క్రూర నారసంబుల పాల్జేసెద – నోరి రణంబున-గోరినివచ్చితివి ॥యె॥

వ చ న ము—

ఇట్లనుచున్న నర్జునుం గని శ్రుతాయుధుండు క్రోధావేశుండై. ॥

ర గ డ

వెడదవాతియమ్మున కపికే తన । పడల గొట్టినంతా
నరుడు నవతి విశిఖమ్ము వేయ న । న్నరవరుండు మరియూ
డెబ్బదేను సాయకముల నించిన । నుచ్చి విజయు డపుడూ
భోజాధిపుచే విల్లు ద్రుంచి సం । పూర్ణరోషముననూ
యేడు నారసంబుల నొప్పించిన । రేడు గిని సిమారలా
నొండొకచాపము గొని శరములచే । పాండవ మధ్యముని

యురము నాటుటయు వెలసన్వాల యగ । పురు హూడాత్మజుడూ
ఘోర శరము సంధించి శ్రుతాయున్న । సారథినింగూల్చి
రథ్యంబుల నాల్గిటిని జంపియూ । రాజేంద్రుని మేనా
పవిత్రుల్యంబగు సప్తతి శరముల । పతి నడలించియునూ
విరథునిజేయ శ్రుతాయు వలిగి య । వీరుడు గద గొనియూ
రథము డిగ్గి యా నరుపై గవిసె ను । రయమున నాతండూ
వరుణ తనయుడని గద వరుణునిచే । వచ్చె ననుచు మరియూ
వరుణుండా గద నొసగువేళ తా । వరము నొసగె దీనీ
గొనిన వారి పగతురు జయించ లే । రని దెల్పియు నొసగే
కాలము ప్రాప్తంబైనది గావున । గానకన్నృపవరుడూ
పంకజనాభునిపై విసరెను కురు । ప్రాలాగద యతడూ
ఆ గద విసరిన సగసిజోదరుని । నట్టున నిలిచియునూ
పుష్పమాలయై నిలిచియుండెనా । పురుషోత్తము మేడనూ
కురువర యిసుమంతయు నొంపదు నా । నరనారాయణులా
కుసుమాభరణంబై నిలిచెను యూ । గోవిందుని కపుడూ
హారి కడనుండియు వచ్చి శ్రుతాయువు । నంతం బొనరించే
వరుణ తనయు డటబడిన గనుంగొని । ప్రభువులు బలములునూ
అచ్చెరువును భయమును దోపగ వా । రందరు నట నిలువా
కడు వేగంబున వచ్చు నరునిగని । కాంభోజాధిపుడూ
అతిరయమున మార్కొని శరజాలము । లడరించిన యంతా
పార్థుండే డమ్ములనేసిన యూ । బలుడు సుదక్షిణుడూ
పదియు నైదు సాయకముల నర్జును । పద్మనాభు మూట
గొట్టినంత నా శరముల నన్నిటి । గూల్చె సవ్యసాచీ
అదిగని కాంభోజుడు మూడింటను । నర్జును నొప్పించీ
పేర్చి యార్చి నంగనిక్రోధుండై । భీభత్సుండపుడూ
అలుక గదుర పదునాలుగు తూపుల । నశ్వసూత ధనువూ
కోదండము కేతనమును చూల్చియు । క్రూరనారసమునా
ఆ సుదక్షిణుని గుండె బగులగా । నేసిన భువిడొల్లె॥

వ చ న ము—

కాంభోజనాయకుండైన సుదక్షిణుండు బడుట గని శూరసేనాది సకలదేశ రాజులందరా యర్జునుం జుట్టుముట్టి యనేక దివ్యాంబకంబు లేయుట గని యందర నురుమాడుట వీక్షించి దుర్యోధనుండు కళింగ దాక్షిణాత్యుల బలంబుల మ్లేచ్ఛబలంబుల బురికొల్పిన గని నర్జునుండు మార్గణాసారంబుల నందరిం బొలియించుచు కాంభోజాధిపు బడవైచి తరిమి భవదీయ సైన్యంబు జొచ్చి బహువిధ యోధుల ప్రాణంబులు బాణంబుల బీల్చుచున్నంత నీ కొడుకు నొంటరియై దేరు దోలుకొని కుంభసంభవు పాలికిం జని కటకటం బడుచు నిట్లనియె.

ముఖారి – ఆటతాళం

యిది న్యాయమా నీకు – వినుమో భారద్వాజా ।
కదనమున నర్జునుడు సేనల । గదిసి నృపతుల గోయజూచుట ॥యి॥
తెలియ క్షత్రియైనా జూ – డవు సేనలను కనుల ।
చలముగొని మన ప్రజల యోధుల–కలనిలో బడగూల్చుచుండా॥యి
వీక్షింప పాండవ – పక్షపాతివి సుమ్మ ।
రక్షణంబొనరింపవచ్చిన – దక్షుడవె యక్షీణబలుడా ॥యి॥
తలపగ కష్ట శబ్దము గల్గు బాములై ।
కలని ధర్మజు దెత్తునని వర । ముల నొసంగియు కల్లజేసితి ॥యి॥
ధర నల్పపురిని సుస్థిరముగా వెలసిన ।
హానిని దయ మా యందు లేకీ – తెరగు నీమది గల్గెనేమో ॥యి॥

వ చ న ము—

దుర్యోధనుం డిట్లు నిష్ఠురంబు లాడుచు మరియు.

రగడ

నిను నమ్మియెగద మరియొక కలనికి । జనక సైంధవుండూ
నిలిచె నిట్టి సైన్యములో నాతని । బొలియింపగ దలచీ
తేనె బూయబడు కత్తివైతి వోక । మానిసివే దలపా
అని యిటులాడుచు మరియు నిట్టులనె । యాచార్యుని కపుడూ
అర్జును కొల్లల కోర్వలేక ని । న్నంటిగాని దేవా

నాపై గోపింపక సైంధవునిక । గాపాడగ వలయూ
అనవిని ద్రోణాచార్యుం డిట్లనె । నా సుయోధనునకూ
నీమాటలకును నా సుతు డశ్వ । త్థామ వాక్యములకూ
కోపింతునె నే దెల్పు వచనముల । కురువర వినుమయ్యా
అర్జునుండు హరి సాహాయ్యంబున । నరదము దోలుకొనీ
మన బలములపై నడుచు నప్పు డా । ఘనుని నెదుర్కొనగా
జాలనైతి నదిగాక ధర్మజుని । సరంబున బట్టి
తెత్తు ననుచు వరమిచ్చితి యీ పని । నెత్తెరగున నైనా
దీర్పవలయు గద రెండు పనుల కని । ధీరత నిల్చితినీ
సవ్యసాచి నే నాగువాడనే । సామజపురిపాలా
అన్ని యెరింగియు నన్ను నిష్టురము । లాడ దగునె రాజా
అదియుగాక మన సేన విడిచి నే । నర్జును వెన్నంటి
పోయినంత గని పాండవ బలములు । భూరితోషమునూ
కడువేగంబున వచ్చిన సైంధవు । గాచు టరిది మనకూ
ధర్మనందనుని బట్టి తెత్తునని । తగనాడిన మాటా
తప్పనగునె యీ పనికై నిల్చెద । ధరణీ వర యిచటా
మిక్కిలి వృద్ధుడ నగుట జేసి నే । మీవలె సమరమునా
శీఘ్రముగా నడవంగజాలనా । సింధుపతిని గావా
నీవా పార్థుడు సమవయస్కులరు । నిలిచి వానితోడా
పగగొన్నాడవు తగు సహాయులగు । బలముల గూర్చు కొనీ
అడ్డపడుము వేవేగమె జను మన । నాతం డిట్లనియె॥

వ చ న ము—

అనుచున్న గురునకు దుర్యోధనుం డిట్లనియె.

తేగడరాగం — ఆదితాళం

అగునా మాకు సాధ్యమూ – పార్థుని నెదుర ॥న॥
పగతుడు నినుకృత – వర్మాది యోధుల ।
అగణితముగ గెల్చె – నట్టి వీరుని బోర ॥న॥

నేనెగాదు దేవ - నేత గణములతోడ ।
బూని వచ్చి నానా - తని మార్కొందురె ॥న॥
నీ వెట్లు దెల్పిన - నావిధి గావింతు ।
భావించి యశము - గొల్పకకుండ నిల్పుము ॥న॥
పొందుగ (శ్రీ) వుల్చి - పురమున వెలసిన ।
యిందు ధరునితో బోరు - నింద్ర నందను గెల్వ ॥న॥

వ చ న ము—

యివ్విధంబున బలుకుచున్న దుర్యోధనున కా ద్రోణాచార్యుం డిట్లనియె.

## ర గ డ

నిక్కముగాగను బల్కినాడ వీ । విక్కడ కురువర్యా
అక్కొంతేయుం డంతవాడుగా । దనసాధ్యం బౌనా
యిందుల కొక యద్భుత సదుపాయం । బిటు దెల్పెద వినుమా
కవచధారణం బొనరించిన యీ । కయ్యంబున నీవూ
రక్షితుండవై యీతని మార్కొను । నక్షీణంబుగనూ
శౌరియు నచ్చటనుండు జనంబులు । వెరగుపడుచునుండా
ధనంజయుని యస్త్రంబులు నీపై । దాకకుండ గలవూ ।
అని దెల్పియు నొక కనకక త్రళం । బాతని కొసగినమూ
గొని సంప్రీతుండై సుయోధనుడు । మనమున బొంగుచునూ
ధరియించుచునుండెకి వేళను యా । ధనుర్ధరుం డనియె॥
యిది మును నిర్జర రక్షణార్థమై । విధి యింద్రున కిచ్చె
అత డంగీరసునకు నిచ్చెను యత । డా బృహస్పతికినీ
అట్టి బృహస్పతి యగ్ని వైశ్యునకు । నతడు నా కొసంగే
అనియిటు దెల్పి సమంత్రకంబుగా । నతనికి దొడిగించీ
నానావిధ దీవనల నొసగి బొ । మ్మని యాజ్ఞను నిడగా
అమ్మహీవరు డుప్పొంగుచు తన యర । దమ్మును దెప్పించీ
చతురంగంబులు తన్ను గొలువగా । స్యందనంబు నెక్కి

వివిధ తూర్యములు మ్రోయ ధనంజయు । వెనుకొని దాకిననూ
ఆతరి పాండవ సైన్యము లొక్కట । ననికి దరలినంతా
వృథయ బలంబులు దాకినంత నో । యిభపురి పరిపాలా
అతిఘోరంబై చూడ భయంకర । మై దోచెను రాజా
యేకాలంబున నట్టి రణము గని । యెరుగము భూపాలా
ఆ కయ్యం బటులుండగ ద్రోణుం । డా ద్రుపదాత్మజుడూ
మార్కొని చాపాచార్యుడు నింపెడి । మార్గణముల నెల్లా
వారించుచు మన సేనల జొచ్చియు । బాణ పరంపరలా
నేలకు గోలకు వెద్చుచుండగను । నీసైన్యము లెల్లా
ధృష్టద్యుమ్నుని కోల్తల కోర్వక । దీనవదనములనూ
మూడు పాయలై చెదరిన గనుగొని । ముదుకడు గినిసియునూ
గడిసినంత గని కేకయ ప్రముఖులు । కడువడి దాకిననూ
మన సేనలు బురికొనుట గాంచి ధ । ర్మాత్మజు డనుజులతో
వీరయోధ సహితంబుగ గ్రమ్మిన । కౌరవ నాయకులూ
చిత్రసేన భీములు దాకిరి నతి । చిత్రంబుగ ననిలో
బాహ్లికుండు ద్రౌపతి తనయులు ద । ర్పంబుల దాకిననూ
సాత్యకితో దుశ్శాసనుండు బల్ । సాహసమున దాకే
మాద్రి తనయుఁను మార్కొనె శకుని య । మానుష రోషుండై
షేరు డలంబసు డా ఘటోత్కచులు । పోరికి దలపడిరీ
ఛండతరంబుగ నొకరినొకరు బోరు । చుండగ శల్యుండూ
సైంధవు కడనుండియు నగ్గలికను । సమరంబున గదిసీ
ధర్మజు దాకిన వారి బలంబులు । తామసముల ముట్టీ
శస్త్రాస్త్రంబుల బోరి రుభయు లతి । సాహసములు మెరయా
అతి ఘోరంబై దోసె నప్పు డా । యాహవ మెల్లెడలా
అప్పుడు నకుల సహదేవుల కో । త్రలకు నోహటించీ
గాంధారపతి ద్రోణుని డెసకును । కడువడి బర తెంచే
ఇట్టి సంకులం బగు సమరంబున । నాచార్యుడు వడిగా
ధృష్టద్యుమ్నుని వీడి వేగమున । ధీరమానసుండై

భారద్వాజుం డంతట పాండవ । బలముల జొచ్చియునూ
తరిమి సేనలను గూల్చుచుండగా । ధరపతి నందనుడూ
ధృష్టద్యుమ్నుడు మిక్కిలి కోపో । ద్దీపితమానసుడై
తన రథ్యంబులు గురు నశ్వంబుల । దాకునట్లు రథమూ
బరపి వాలునుం బలకయు గొని తా । శరగురుపై ధుముకా
సాయకజ్వాలలగురుడు నింపగా । జేయార్పక నతడూ
క త్తి డాలుగొని త్రదధమును తుర । గంబులపై విసరా
గని కుంభజుడు కృపాణము చెక్కలు । గావించియు మరలా
హరుల నూతుధ్వజ ఫలకంబుల వెస । నవని ద్రొల్లనేసీ
నారస మొక్కటి ధృష్టద్యుమ్నుని । దూరనేయు నంతా
వచ్చెడి శరమును మధ్యనె సాత్యకి । జెచ్చెర నరికియునూ
ద్రుపదనందనుని రక్షించుటకై । దొలగించుకపోయే ॥

వ చ న ము—

అని దెల్పిన విని ధృతరాష్ట్రిం డా సంజయున కిట్లనియె.

గీ॥ వ్యాఘ్రముమాహారముగ గొను ♦ ఫలసమితి
గొనిన చందంబుగా శ ♦ ర గురుని వాత
బడిన పాంచాల తనయుని ♦ విడిచినట్టి
సాత్యకిని వీడులేమొకో ♦ శరగురుండు.

వ చ న ము—

యిట్లడుగుచున్న మానవ పతికి సంజయుం డిట్లనియె.

బిల్హారిరాగం - చతురశ్రగతి

వినవయ్యా భూపాలా - విన్నవింతు సమరగాథ ।
ననిలో నా సాత్యకీ - నతనిని దొలగించినంత ॥
ఘనుడాచాపాచార్యుడు రెక్కలు-గల పెనుబాముల బోలుశరంబు
వనజనాభు సోదరుడౌ సాత్యకి - తనువునిండ నింపగ విసినంతనె ॥వి॥
ఆతడు తన నిజసారథితో ని - ట్లనె నా విప్రుడు ధర్మజు జేరగ ।
యీతరి వచ్చుచు నున్నవాడు మన - మాతని గదియుగ బోవగ
వలెననె ॥వి॥

సందియంబు నిసుమంత లేక మన – స్యందనమ్ముంబోనిమ్ము నుల్చిపుచి।
యిందు ధరుడు పరమేశుని హృదయము – నందు మరువకను జను
మనియెను ॥వి॥

వ చ న ము—

మరియు చాపాచార్య సాత్యకులు ఒకరినొకరుం గదిసి భల్లంబుల నెట్లాడం దొడంగిన.

## రగడ

గొడుగులు పడగలు గూల్చుచుండిరా । గురుసాత్యకు లపుడూ
అరదంబుల కరితురగంబుల భట । వరుల డొల్లసేయా
ర క్తమేరులై బారుచుండగా । రణములోన ప్రజలూ
వుభయ బలంబులు వెరగుననుండగ । నుప్పరవీధిననూ
నిర్జర సంఘము లాశ్చర్యంబున । నిలిచి చూచుచుండా
శరగురుచే విలు రెండుగ ద్రుంచెను । సాత్యకి రోషమునా
విలు విరిగిన నొండొక విల్లెత్తిన । విరచెదాని యతడూ
యీ రీతిని గురుడెన్ని ధనువు లె । త్తిన నన్నియు విరచే
అశ్వత్థాముడను గురుడాత్మగతంబున । నాలోచించియునూ
జొరా యిట్టి బలంబు కార్త వీ । ర్యార్జును నందుననూ
పరశురాము డా శంతనాత్మజుని । పాండవ మధ్యములా
యందు గలదు చూడగ నీ సాత్యకి । యిందు నెటుల గలిగే
అద్భుతమయ్యెను నాకు జూడగా । నని యగ్గించుచునూ
ఖేచరమున చారణ సిద్ధులు సం । కీర్తనములు జేయా
మరియొక చాపముగొని యాచార్యుడు । మార్గణములు వైవా
నవి యెల్లను దుత్తుమురుగ జేసిన । నతడు గోపముననూ
ఆగ్నేయాస్త్రం బడరించిన నది । యంబరమున కెగసీ
జ్వాలలు గ్రక్కుచు వచ్చుచుండగా । సాత్యకి గనుగొనియూ
వారుణాస్త్ర మేసిన నవి రెండును । ఘోరంబుగ గవిసీ
బోరుచుండె నొండొంటితోడ నవి । భుగభుగ మండుచునూ

ఆహాకారము లెసగ సేనలం । దద్భుతంబుగానూ
పోరిపోరి నవి రెండును శాంతత । బొందియుండునంతా
శమనాత్మజుఁ డా మాద్రీ తనయులు । సాత్యకికిని ద్రోణై
తరుముచుండ గని ధృష్టద్యుమ్నుఁడు । తక్క యోధవరులూ
కుంభజుఁ దాకిన గని దుశ్శాసను । గూడుక మనబలమూ
దలపడినంతనె నుభయ బలంబులు । కలనిలోన నిలిచీ
సాహారి నోహారిగా బోరాడెడి । సమయము నచ్చటనూ
అచ్చటి దొరలును దూలక బోరిరి । యర్జునుపై వడిగా
అప్పుడు గాండివి కురుబలములపై । నలుగులు ముంచియునూ
అడవులగాల్చెడి నగ్ని చందమున । నందరి గూల్చియునూ
అచ్చోటను విడి యతిరయమున వి । వ్యచ్చుడు జనుచుండా
అతని మేను తన హయముల తనువులు । నపుడు డస్సియున్నా॥

వచనము —

అంత నర్జును రథంబు సైంధవు డున్నయెడకు దూరంబైయుండుటా కౌరవయోధులు గాంచి సింహనాదంబులు జేసి తరుము నా రథికో త్తముం డచ్యుతుని గని యిట్లనియె.

ధన్యాసిరాగం — చాపుతాళం

అంబుజోదరా - హరులెంతో డస్సెను జూడు ॥అం॥
శంబరారి జనకా - శస్త్ర సమితి నిండె తనువు ॥అం॥
అందుచేత వేగ - మరుగా వశ్వమూలు ।
యిందిరేశ యలుగు - లెడలించుట మేలుగాదె ॥అం॥
నొగల పగ్గముల - నొప్పుగ సడలించి ।
నగధరా హరుల మేఁ - లరలేక సవరించుమయ్య ॥అం॥

వచనము —

ఇట్లు దెల్పుచు గిరీటి, దేరు దిగి గాండీవ గుణధ్వని గావించి యబ్బలంబుల నేత్రాంతరం గదిసి మహాస్త్ర శస్త్రంబులు నుగ్గునూచంబుగా గావించుచున్న మన బలంబు లెల్ల జుట్టుముట్టె.

# రగడ

సాహసమున మన నాయకు లెల్లను । సవ్యసాచి బోదివీ
పోరుచుండ యాతని లావును మన । వారికి గన్పడియే
అట్టియెడను చతురంగ బలంబులు । నవని గూలె నరుచే
జచ్చుచున్న మనసేనలు వెరువక । సవ్యసాచి దాకీ
పైపై గ్రమ్మిన గుంపుల గన్గొని । పాండవ మధ్యముడూ
పాదచారియై యున్న జూచి మన । బలములు గుములగుచూ
గ్రమ్మినంత నరుడా కురువీరుల । కడువడి నరుకుచునూ
మాతంగంబుల యశ్వనికరముల । మార్గణముల నరికీ
స్యందన సందోహంబుల భటజన । బృందము నరుకుచునూ
కడువడి కౌరవసేనల నెల్లను । గఱుపుగొట్టి నగుడూ
నవ్వుచుండగా కమలనాభు డా । కవ్వడి కిట్లనియె
తురగంబుల మేనులుగల నలుగులు । పెరికితి కౌంతేయా
తనువుల నెల్లెడ నివితి హాకు లి । త్తరి నీళులు ద్రావా
ద్రావకున్న దెప్పిరలవు నెట్లొకొ । ధర్మానుజ యిపుడూ
వెన్నుమునుగు నటు నిల్వ నీరు లే । కున్నను ద్రావవుగా
సలిలపాన మొనరించి హయంబులు । గెలిపించును నిన్నూ
అనియిటు శ్రీహరి దెల్పిన యజ్ఞను । డస్త్రంబులు గొనియూ
బాహుబలంబున భూమి బ్రద్దలుగ । బగులగొట్టినంతా
పావన జలములు పొంగి పూర్ణమై । ప్రవహించుచునుండా
దానికి శరములచే నొక విల్లును । పూనికగల్పింపా
అదిగని మనసేనలు వెరగందిరి । యవనీశా వినుమా
అప్పుడు మురహరి నార్ష మంది య । శ్వంబుల నాల్గిటినీ
నీర్త్రావించియు హయ శరీరములు । నిర్మల మొనరించీ
అంబరమున సురసంఘము లెల్లను । యర్జును మహిమకునూ
సంతోషంబున సుమవర్షంబులు । జల్లులు గురిపించే
కౌరవనాథా ముల్లోకంబుల । గలడె యిట్టివాడూ
శ్రీహరి యశ్వ చతుష్టయమునకును । సేద దేర్చి మరియూ

సంపూర్ణంబుగ ఘాణము మేపియు । శౌరి తురగములా
స్యందనంబునకు బూన్చిన గని యా । సవ్యసాచి యెక్కె
అనతి దూరమునను్న సుయోధను । డా హరి నరు గనియూ
వచ్చెడి దుర్యోధనుని హరియు వి । వ్వచ్చుడు గనడాయే
అట్టి సమయమున నచ్చటి నరవరు । లంత వెల్లనైరీ
దీనవదనులై తమలో నిట్లని । దలచుచుండిరంతా॥

వ చ న ము—

యివ్విధంబున నందరు వెరగంది డెందంబుల గుందుచు దమలో నిట్లనిరి.

నవరోజు — చాపుతాళం

యిది యేమియేతువో - యెరుగంగ రాదురా ।
ముదమున దివ్యాస్త్రముల - ముంచె నరుడు మన బలముల ॥యే॥
ఒక్కపెట్ట సైన్యముల — నొక్కడె రూపడగించెను ॥యే॥
గురుని నమ్మియున్న మనకు - మరణము వాటిల్లెనిది ॥యే॥
ఆనాడు శౌరివలుకు - లాదరించడయ్యె కురుపతి ॥యే॥
చప్పిడి పున్నయ్యనేలు - శంభుకరుణ లేదాయెనో ॥యే॥

వ చ న ము—

అయ్యయో యిప్పార్థుండు సమరస్థలంబెల్ల పీన్గుపెంటలు గావించె నితని జయించువార లెవ్వరని మనంబుల విచారంబులు నొందుచు వీరయోధులందరు బెండు పడియుండిరిగాని యందు నొకడేనియు నుక్కునమార్కొనువారు లేరయ్యె నట్టి సమయంబున.

## రగడ

గోవిందుండును సవ్యసాచి తమ । భావము లలరగనూ
బాలక్రీడ విధమున విహరించియు । బవరమునందుననూ
గమన విలాసము మెరయ నిద్దరును । కడువడి చని చనియూ
ప్రోద్ధువాలగని పాంచజన్యమూ । పురుషోత్తముడొత్తే
దేవదత్త మద్భుతముగ నొత్తెను । దివిపతి నందనుడూ
అతిశయమున నిట్లిరువురు జని రటు । నరదము దోలుకొనీ

పోవుచున్న నరపతు లొండొకులను । బుడికొల్పక మరియూ
అడ్డపడిన రాజన్యులసేనల । నయ్యర్జును డపుడూ
శరవర్షంబును గురిపించిన యూ । సైన్యము రథికులునూ
కోల్తలకొర్వకనో హటించిరట । కురుకులు లందరునూ
సైంధవు పసి జాలించి దొలగిరట । సర్వసేన లెల్లా
అత్తరి దొలగిన బలములగని తల । లెత్తిచూచి వారూ
తమలో నిట్లని దలచుచుండె సైంధవుడు । వీడెయనుచూ
వీనిచుట్టు గురుసుతకృపశల్యులు । వేచియున్న వారూ
కర్ణుడు కర్ణసుతాదులు కావలి । గాచియున్నవారూ
పోటు మగలుగావున వారల నిట । పూచి పట్టవలయూ
అనియిటు బలుకుచు వారల మధ్యను । నా సైంధవు గాంచీ
సింధుపతిని వీరేమి గాచెదరు । సిరివర యీవేళా
జంభవైరి గావాడ వచ్చినను । సైంధవు జంపకనూ
విడుతునే యీ ద్రోహిని దుర్మార్గుని । పుడమిని గూల్పకనూ
అని కృష్ణునితో బల్కెడి పంతము । లా కౌరవబలమూ
విని భయమున చల్లాకు చదురులై । వెడలె నల్దిశలకూ
తమ హృదయంబుల విస్మయమందిరి । నమిత కంపములనూ
యిటులుండియు కొనియాడుచునుండిరి । యిందిరవరు నరులా
భూవల్లభ విను పురుషోత్తము డా । పురుహూతాత్మజుడూ
కనుగొన లెక్కగజేసి సైంధవుని । గనుగొని యార్చుచునూ
గడగినంత దుర్యోధనుండు యూ । ఘనుల గూడవచ్చీ
కార్ముక గురు డపు డొసగిన కవచము । కతనజేసి యతడూ
నిర్భయంబుగా తన సైన్యంబుల । నేర్పున దలకడచీ
అందముదోలుక సైంధవు దిక్కున । కడ్డముగానిలువా
అతని ప్రక్కలను నిలిచిన సేనలు । యద్భుతంబుగానూ
భేరి శంఖ కాహాళములు మ్రోసిరి । భూరివిక్రమములా
సింహనాదములు జేయుచు సేనలు । చిత్రగతుల మెరసీ
తన రథమున కెదురై నిలిచినగని । వనజనాభు డపుడూ॥

వచనము—

అట్టియెడ నర్జునుం గని శ్రీకృష్ణుం డిట్లనియె.

శంకరాభరణం — జొల్వ

ఆలసింపదగునె పార్థ – ఆపద వేళా ।
యీలాగున దుర్యోధను – డేడ్తెర నరదంబులోన ।
నాలమునకు వచ్చుచుండె – నతి కోపోద్దీపితుడై ।
యేల యిటుల వేమారెద – వేల జాగరూకత నుండుము ॥ఆ॥

వచనము—

కావున యర్జునా మన కీ దుర్యోధనుండు సైంధవుని ఫణంబుగా నొడ్డె గాన నీ వేమరక రణద్యూతంబున సైంధవునిం గూల్పుమని మరియు నిట్లనియె.

## రగడ

యింద్ర నందనా మీ యాపదలకు । యీదుర్యోధనుడూ
మూలకారణం బదియు గాక యీ । మూర్ఖుడు ధర్మజునీ
ద్యూతకాలమున పరిభవించిన । పాతకు డీతండూ
సుగుణాత్మిక పాంచాలిని సభలో । నగడు పరచినాడూ
ఖండనమున నీ చేతుల లా వెరు । గండు సుయోధనుడూ
నీకు విశిష్ట శుభం బొనగూరుట । నిశ్చయంబు పార్థా
కరిపుర నాధుడు వచ్చెడి లోనవె । నరుకుము సైంధవునీ
అదియుగాక మున్నే సుయోధనుని । కదనంబునగూల్పా
గని సైన్యంబులు నలు దిక్కులకును । గదలిపోదు రపుడూ
సైంధవు జంపగ సులభము మనకో । సవ్యసాచి వినుమా
అని యీవిధమున పెక్కురీతులను । హరి దెల్పగ నరుడూ
అంభోజాక్షుని నాలోకించియు । నాత డిట్టులనియె
బావా ద్రౌపది పడ్డ బిన్నములు । భావంబున గలవూ
మానస మగ్ని దహించుచు నున్నది । యానాటను నుండీ
మరచితి నని నను హెచ్చరించితివో । మాధవ నాబలమా

నీవు మెచ్చ జూపించెద నరదము । నీతడుండు యడకూ
నడుపు మనిన హరి యతివేగంబున । నడుపుచున్న యంతా
తన కభిముఖుడై వచ్చుచున్న య । ర్జునుని సుయోధనుడూ
గాంచి మనంబున గొంకక నెదురుగ । కడు నుద్ధతి నడచీ
పోవుచున్న నీ కొమరుని సాహస । మునకు మెచ్చి రంతా
అప్పుడు సేనల నినదంబెసగెను । నద్భుతంబుగానూ
వారల రమ్మని బిలుచుచు నృపతి య । వారణగతి జనగా
సర్వసేనలను చిత్తములలరగ । శంఖంబుల నొత్తే
అతరి హరిపార్థుల శౌర్యోన్నతు । లా సేనలుగాంచీ
శోకతప్తులై కురుసైన్యంబులు । నా కురుపతి యడకూ
అసలువిడి పతిచచ్చె చచ్చెనని । యరచుచుండు నంతా
నీదు యోధవీరులతో నిట్లని । నీ కొమరుండనియె
భయమేటికి మీరందరు దిక్కుల । బారగ నేమిటికీ
హరి నరులను నా శరకీల జ్వా । లల నేర్చెద నిపుడూ
మీకు నేత్రపర్వం బొనరించెద । లోక విభులు మెచ్చా ॥

వ చ న ము -

అని పలికి పార్థుల గనుంగొని యవష్టంభంబున దుర్యోధనుం డిట్లనియె.

శంకు స్థి — ఆదితాళం

వినరా కిరీటి - విశదముగా నా మాట ॥వి॥
వినరోరి దివ్యాశర - వేదివి గావున - నను జయించుము నీదు
ఘనత తెలియు నిక్కముగా ॥వి॥
మునునేను లేనిచో - టను జెల్లె నీశౌర్యమూ ।
రనజోదరుడు నీ - వాడనీ దలచితో - అనిమొన నా బల ।
మంతయు గందువు ॥వి॥
హరినేర్పుజూడగా - ననికి వచ్చితి నేనూ ।
విరికి పందవుగాక - బెదరకనిల్వుము - శరజాలములనిన్నీ ।
దురమున గూల్చెద ॥వి॥

పోరికివచ్చితి - వేరా పీరుని వలె ॥
క్రూరాత్మ పాండురాజు - కనుజనించితివేని ।
తేరగాడవుగాక - దెలి శౌర్యము జూపుము ॥వి॥
ధరనుల్చి పట్టణ - ధాముడై వెలసియు ।
అరయ చప్పిడి పున్న - యాఖ్యని బ్రోచెడి ।
హరుని సాక్షిగ నీవి - తరి జిక్కితివి నాచే ॥వి॥

వ చ న ము—

దుర్యోధనుం డివ్విధంబున పౌరుషవాక్యంబుల నర్జును నధిక్షేపించుచు.

## ర గ డ

అనుచు క్రూరసముల మాటెని । నర్జునుపై వేసీ
హయముల నాల్గిట నొప్పించియు పది । యమ్ముల హరినేసీ
వెంటనె మునికోలను నొక శరమున । తుంటలు గావింపా
గని పార్థుడు మనమున గుచ్చించుచు । జనపతి మేనుననూ
పరగ చతుర్దశని శితాస్త్రములా । కురుపతిపై నేయూ
అవి యా దుర్యోధను మైమరువును । దవిలిమిట్టిపడినా
గనుగొని యంతట దొమ్మిది తూపులు । కౌరవపతినేయూ
అవి యెల్లను నిష్ఫలమాటను గని । యర్జునుండు మరలా
అరువదెనిమి దమ్ములు నడరించిన । నవియు విఫలమైనా
కడు విషాదమున వాసుదేవుడా । కవ్వాడి కిట్లనియె
యిదివర కెన్నడు నీ బాణంబులు । నిట్లు వృథాయగుటా
గని యెరుంగ నీ భుజబలశక్తియు । గాండీవ మిట్లగుట
చిత్రముగా దోచెను నా మనమిటు । చీకాకయ్యెనుగా
అల్లన నీ విడు దివ్యశరంబులు । బొల్లుబోయె నేడూ
చెడుటకు హేతువయని విస్మయమును । జెందుచుంటి విజయా
అని యిటు తను తానిందజేసుకొను । యంభోజాక్షునకూ
యింద్రనందనుం డిట్లని బల్కెను । నిందీవరశ్యామా

కౌరవనాథున కింత ధైర్యమిది । కవచధారణంబూ
మున్ను కుంభజుడు దెలిసియుండె నిది । నిన్న నాకు జెప్పే
అట్టి కవచధారణ మీా కురుపతి । కబ్బియుండవలయూ
ఆ కవచంబీ మూడు లోకముల । కలవిగాని దనుచూ
నీ వెరింగి నన్నడుగనేలనో । నీరజపత్రాక్షా
నీవెరుంగనిది ముల్లోకంబుల । నేది గలదు దేవా
గావున నీతడు ద్రోణాచార్యుని । కరుణబడసినాడూ
తనువున కడ్డముగా దగిలించుక । తరలివచ్చినాడూ
అంగీరసు డొక దివ్యాస్త్రము మును । యమరపతికి నొసగే
అదినాకొసగెను నిర్జరనాథుడు । యాదరమున నాడూ
అఖిల కవచ నిర్భేద్యము జేయును । నాయస్త్రము వలనా
అనుచు సమంత్రక పూర్వకంబుగా । యంబకము విడువా
గని యపుడశ్వత్థామ బహుబల । గర్వం బలరగనూ
అధిప వినుము సర్వాస్త్రఘాతి యై । నట్టి శరంబుననూ
ఆ యస్త్రంబును దెగవైచిన దెర । గంది యర్జునుండూ
దేవా యశ్వత్థామ విశిఖమున । దెగియె మన శరంబూ
మరల ప్రయోగము జేయుట కొప్పదు । మాధవ యాశరమూ
సమరంబున నా వింటిబలువుచే । సాధించెద జూడూ
అనుచుండగ హరి నకుల నిర్వురను । నా దుర్యోధనుడూ
పదునేనిమిది వాలమ్ములపై । పటుశరములు గప్పె
అప్పుడు మనదెస తూర్యరవంబులు । నద్భుత ప్రమోసే
నార్పులు జెలగెను మనసైన్యంబుల । నలుదిశలందుననూ
అదిగని పార్థుడు యాడుగరచి దు । ర్యోధనుపై గవిసీ
తురగంబుల సారథిని ద్రుంచియును । యరదము నరికియునూ
అరచేతులలో సాయకపంక్తుల । తరుచుగ నాటింపా
విరథుడయ్యు ధనువందుటకును తా । వికల హస్తుడగుచూ
నరనాథుండు విషణ్ణహృదయుండై । తెర వెదిగానకనూ
కంకటంబు నిష్ఫలమని తనమది । కటకటబడి యుతడూ

కవచమ విడినట్లైచియు మరియొక । కవచము దొడిగియునూ
గదలి నంత గని తత్సైన్యంబులు । గదలె శీఘ్రగతినీ
చతురంగంబులగూడి నృపోత్తము । డతిరోషముతోడా
జుట్టుముట్టినరుపై నారసములు । నట్టై విసరినంతా
అదిగని తాగ్రమూర్తుండై సేనల । గదిసి విజృంభించీ
తేరుల గజముల తురగ వ్రాతముల । ధీరత నరుకుచునూ
రథికసారథుల బట బృందంబుల । పృథివిని బడగూల్చీ
భీకరరూపుండౌ యర్జును గని । యా కమలోదరుడూ
ఘోరంబుగ శంఖారావంబును । బూరించిన యంతా
అత్యధికంబగు భయసంభ్రమములు । నావహించి యధిపా
సేనలెల్ల నలుదిక్కుల బరచిరి । చీకాకును బొందీ
బలములెల్ల బరచుట గాండివిగని । బహుసంతోషమునా
గాఢ్పున మండెడి యనలము తీరున । కవ్వడు మెరయుచునూ
అట్టి సమయమున సైంధవు రక్షణ । కై నిలిచిన బలమూ
ధైర్యంబులతో భేరిఫణవ వా । ద్యములు బోరుగొలుపా
కొందరచ్చటను సింహనాదములు । ఘోరముగా జేయా ॥

వచనము—

భూవరా మనసేనలం గల్గు భేరీఫణవ వాద్యంబులు విని పాండవ బలంబు లచ్చట చిడిముడిబడుట నాలోకించి కృష్ణార్జును లట్టిసమయంబున నేను గనుచుండ.

ఆరభిరాగం — ఆదితాళం

యిందు వంశసంభవా వినుమూ-అందు నేను గాంచినట్టి తెరగెల్లా॥యిం॥
మందస్మితవదన నారవిందులై - మాధవార్జునులు నేత్రైరభియముల ।
డెందంబుల నానందంబుల నీ - నందనుపై నురవడించిరయ్యా ॥యిం॥
అంతట మనసేనలు రథములతో ।
దంతి ఘటలు తురగవ్రాతముతో ।
పంతంబులు బలుకుచు ధీరత న ।
త్యంత రయంబున గ్రమ్మతు మనుచు గదలె ॥యిం॥

వ చ న ము—

కురువరా కృష్ణార్జునులపై గ్రమ్మిన వా రెవ్వరెవ్వరన వినుము.

రగడ

వృషసేనుండు శలుండు సైంధవుడు । వీరావేశములా
కర్ణుడు గృపుడును గురునందనుడును । కడువడి శల్యుండూ
భూరిశ్రవు డాదిగ రథికో త్తము । లా రణమున గదిసీ
సవ్యసాచిపై దలపడి యందరు । శంఖము లొత్తిననూ
దిక్కులు బీటలువారగ విజయుడు । దేవదత్తమొత్తే
ఆ రవంబువిని మనసేనలు జెవు ల । విసిన వెరువకనూ
సైంధవు దిక్కుకు బోసీ కడ్డము । జని శరవర్షమునూ
గురిపించిరి దుర్యోధన కర్ణులు । నరునిమేన వడిగా
అశ్వత్థామాదులు వడి గ్రుచ్చిరి । యంబకచయములనూ
యీావిధమున పెక్కుంద్రొక మొత్తము । గా వడి నేయగనూ
గని కిరీటి నవ్వుచు రౌద్రంబున । కనులు నెఱ్ఱజేసీ
రాధేయుని పండ్రెండు శరంబుల । రయమున స్రుక్కించీ
అతని తనయుని మూడు తూపులను । నడలగొట్టి మరియూ
మిక్కిలి రయమున శల్యు చాపమును । చెక్కులు గావించీ
తోడనె యాతని తనువున గ్రుచ్చెను । తొమ్మిది యమ్ములనూ
మూడు బాణముల సోమదత్తు మేఁ । గాఢ నేసి మరియూ
యెనిమిది బాణంబుల గురు తనయుని । నేత్రర గొట్టియునూ
యిరువది నెనిమిది శరముల గృపు స । త్వరగా స్రుక్కించీ
అంతట సైంధవు డున్నచోటికిని । నరుగుచున్న వేళా
భూరిశ్రవు డతి క్రోధావేశత । క్రూరనారసమునా
హరిచే మునికోలను నొక శరమున । నతి శీఘ్రత దుసిమీా
పార్థుని మేన త్రిసప్తతి శరములు । బరగించినయంతా
తక్కటి బలములు మూకలు గట్టుక । నొక్కుమొగిని గ్రమ్మి
క్రూరనారసము లర్జును మేనను । గుప్పించిన యతడూ
కోపాటోప మహోగ్రమూర్తియై । ఘోరశరంబులనూ

మనసేనల సమయించుచున్న గని । మరియా సైన్యములూ
విచ్చుచు దెరలుచు మరలి వచ్చుచును । వీరావేశములా
మనవారలు యిటు బెనగుచుండిరట । మనుజేశా నేడూ
అని దెల్పిన విని ధృతరాష్ట్రుడు నూ । తున కిట్లని బల్కే
మనవారందరు జుట్టు ముట్టగా । మడిసిరె యెవరైనా
శరగురు దర్పంబున నా ధర్మజు । సైన్యము లేమయ్యే
తెలియబలుకుమన సంజయు డప్పుడు । దెలిపె నిట్టులనుచూ
నరవర శరగురు నరు కయ్యమును । నరయజాల నైతీ
ఆయెడ ఖేచరులకు వెరగయ్యెను । నాచందము జూడా
శరగురు ధర్మజు బలము లవెంతో । తరుచుగ బోరగనూ
సంకుల సమరంబయ్యె జూడ నా । సమయంబున నధిపా
వుభయ బలంబులు గదిసి బోరి రట । నిభముల చందమునా॥

వచనము—

కురువరా యిట్లొకరి నొకరు గదిసి బోరుచుండుతరి.

కేదారము — ఆదితాళం

నకులుని దాకెనుగా – వికర్ణుడు ॥న॥
అకలంకుండగు సహదేవునితో – ప్రకటితముగ దుర్ముఖుడు దాకెవడి ॥న॥
దవిలి వ్యాఘ్రదత్తుడు సాత్యకినిం – దాకినంత మద్రనాథుడతి ను ।
త్సవమున ద్రౌపతి తనయుల మార్కొనె – భవన్నందనులు సంతస మందగ ॥న॥
వాయుకుమారు నలంబసుండును – బాయక ధర్మజు నాచార్యుండును।
సాయకములుగొని దాకినంత న– మేయబలుడు కౌంతేయుడుజూడ॥న॥

వచనము—

యివ్విధంబున దాకిపోరుచున్నంత యుధిష్టరుండు.

## రగడ

ఆచార్యునిపై తొమ్మిది సునిసిత । నంబకములు వేయా
గని సక్రోధుండై కుంభజు డా । కౌంతేయాగ్రజునీ ।

యిరువదేను సాయకముల నాతని । యురముగాఢనేయా
అరద మశ్వముల సారధి తనపై । దొరగు నస్త్రసమితీ
తగుబాణంబుల వృధగావించెను । ధర్మనందనుండూ
అదిగని శరగురు డతని శరాసన । మపుడేడ్త్రుంచీ
పెక్కుమ్ముల రథ సూతాశ్వంబుల । చొక్కగొట్టినంతా
సైన్యంబులుగని మనుజనాథు డిట । జచ్చునేమో లేకా
యోడి పారునో బలహీనత నీ । బాడబు చేజిక్కీ
పాడైపోవునో యనెడు నంతలో । పాండవాగ్రజుండూ
మరియొక విలుగొని తనపై గ్రమ్మిన । శరములు ఖడించీ
జ్వాలలు గ్రక్కుచు మండెడు శక్తిని । శరగురుపైవా
చూపరులెల్లరు నబ్బురలెత్తుకొని । జూచుచు నిట్లనిరీ
యీయెడ యాచార్యుని శక్తిని మా । యించునో యనుచుంశా
కుంభసంభవుం డవ్వాడు బ్రహ్మా । స్త్రంబు బ్రయోగింపా
అది యాశక్తిని నేలగలిపి ధ । ర్మజుపై నడరగనూ
శమనాత్మజు డది గని బ్రహ్మాస్త్రము । సరగ బ్రయోగింపా
ఆబ్రహ్మాస్త్రము బ్రహ్మాస్త్రంబున ! నడగునట్లు జేసీ
అయిదు తూపులను ద్రోణుని తనువున । నడరించియు నొకటా
అతని జాపమును దునుమగ గదగొని । నతని పైచె గురుడూ
అంతట నొకగద గైకొని ధర్మజు । డాచార్యుని పైవా
పావక జ్వాలలు చదల నిగుడ తన । పై వచ్చుచునుండా
అతికుపితుండై ధర్మతనయు ర । థ్యంబుల ధరగూల్చీ
ధనువు కేతువును దున్మాడియు మరి । తనువు నొంప నతడూ
అరదము డిగ్గి నిరాయుధుడై తా । నచలత్వంబుననూ
పూర్ధ్వబాహుడై యేక మనంబున । నూరకుండె నధిపా
అదిగని ధర్మజు నేమిజేయు జా । లకయుండెను గురుడూ
ప్రక్కల నిలిచిన ధర్మజుసేనల । నుక్కడగించుచునూ
పట్టుడు కొట్టుడు కుంతీతనయుని । భద్రపరచు డనుచూ
కేకలువేయగ ధర్మజు డా । కేకలువిని వేగా

అటనిలువక జని సహదేవుని రథ । మల్లన నెక్కెననూ
స్యందన మనిలో దాలగ దోలుకొని । సహదేవుడు జనియే
మరలవచ్చి సహదేవు డుగ్రుడై । నిరమిత్రుని దునిమే
నకులుడు కోపారుణ నేత్రుండై । యఖిల సైన్యములతో
వచ్చిన గనియు వికర్ణుడు దాకిన । వాని బారదోలే
వ్యాఘ్రదత్తు డత్యంత రోషమున । శీఘ్రమె జనుదెంచీ
సాత్యకి దాకి విరామములేకను । శరవర్షము ముంపా
అదిగని సాత్యకి కోదండముగొని । యతని సూతు జంపీ
హయముల ద్రుంచియు చండశరంబుల । నతని శిరము నరికే
అంతట శల్యుడు ద్రౌపది తనయుల । నందరి దాకియునూ
అందరిపై నైదైదు శరంబుల । నా శల్యుడు ముంపా
వారు చలింపక సౌమదత్తుపై । దారసిల్లినంతా
అతడు నందరికి నన్నిరూపులై । యచట బెనగుచుండా
ద్రౌపదేయులా సౌమదత్తిపై । దర్పంబున గదిసీ
నరు నందను డాతని రథ్యంబుల । నరికి నంతలోనా
భీమ తనూజుడు కోదండము బల్ । తామసమున నరికే
అల యుధిష్ఠిరాత్మజుడు కేతువును । నవని ఱొల్ల నేసే
నకుల పుత్రకుడు సూతుని జంపగ । నతడు జిక్కువడియే
సహదేవుని సుతు డాతని శిర మొక । సాయకమున నరికే॥

వ చ న ము —

అంత వృకోదరుండు నలంబసునితో బోరుచుండుతరి నద్దానవుం డేయు నంపగమి బలువున భీముండు మూర్ఛిల్లి కొంతవడికి మూర్ఛ దేరి పటు రోషాయత్త చిత్తుండై నలంబసుం గని యిట్లనియె.

శంకరాభరణము — ఆది

పోక నిల్చుమో యలంబసా — యీ కదనము విడి ॥పో॥
పోక నిల్చుమో దానవ — పోగరణగించెద తృటిలో ।
నీకోరకై వచ్చితిరా — యీ కయ్యమునందు నేడు ॥పో॥

ఓ నిశాటవంశా ని - న్నీ నా లక్షితికి నేడు।
పూనిక బలి బెట్టెద సం - పూర్ణాయుష్షు లేదు నీకు ॥పో॥
యెందరు వీరాగ్రగణ్యు - లెందరు నిను గావ జనిన।
యిందుధరుం డుల్చిపురి - విశ్వేశుని సాక్షి ద్రుంతు ॥పో॥

వ చ న ము—

భీమసేనుం డిట్లనుచున్నంత వినిగిని యలంబసుండు తనమాయో పాయ శరంబులు ప్రయోగింప వృకోదరుం డమ్మాయను మాయించి తరిమి తరిమి శరంబుల గ్రుమ్మి యా రక్కసునిం బరపినంత.

## ర గ డ

అప్పుడు మనదిక్కున జేయంగల। యవనీశుల చావూ
బారిపోవుటను జూచి కుంభజుడు। బహు రోషాతురుడై
కనుగొన లెట్టగజేసి సేన తల। గడచి సాత్యకాది
ప్రముఖ నాయకుల పాండవ వీరుల। ప్రథితాస్త్రంబులచే
గొట్టి నిలువరించియు సైన్యములో। ధిట్టత నిలుచుటయూ
అంతట ఘటోత్కచు డా ద్రోణునిపై। నడరుట గనుగొనియూ
అపుడవలంబసుడు గదియ ఘటోత్కచు। డా సాత్యకి మిగిలీ
నిశిత శరంబుల లంబస దనుజుని। నిగిడించిన గనియూ
చక్రాయుధ మాతనిపై విసరిన। సరగ ఘటోత్కచుడూ
భూరి గడంగొనివైచి చక్రమును। పొడిపొడి గావింపా
చక్రంబిట్లగుటం గని రాత్రిం। చరు డలంబసుండూ
వివిధశక్తులను బరపినంత గని.। వేగ ఘటోత్కచుడూ
అర్ధచంద్ర బాణంబున సన్నిటి। హత మొనరించగనూ
యిరువురు దానవు లీవిధిబోరిరి। వివిధోపాయములా
అతి చిత్రంబుగ డేగల రీతిని। యంబరమున బోరీ
ధరణికి దిగి బెబ్బులుల చందమున। దాకి యొకరి నొకరూ
వేయుచు నొడుచుచు బొడుచుచు నిరువురు। బాయక బోరుచునూ
యిట్లనేకరీతుల నా దనుజులు। విడువక బోరాడా

కిమ్మీరానుజుడైన యలంబసు । డమ్మోడస్సిననూ
వాయుకుమార తనూజుడు బలమున । వానిని బడవైచీ
పిడుగులజోలిన ముష్టిఘాతముల । బొడిచి స్రుక్కజేసీ
తొడలు నెమ్ము లొక్కుమ్మడిత్రుటిలో । పొడిపొడి గావించీ
నేలబెట్టి కాల్జమరిజంపెనా । నీచుయలంబసునీ
అంత సింహనాదము లొనరించిరి । యా పాండవబలమూ
అప్పుడు వెంటనె తూర్య నినదములు । నద్భుతముగ మ్రోసే
ఆ ఘటోత్కచుడు ధర్మనందనున - కభివందనమిడినా
ఆతడు సంతుష్టాంతరంగుడై । యాహిడింబసుతునీ
గారవమున కొనియాడెననుచు విని । కౌరవభూవిభుడూ ॥

వ చ న ము—

అప్పు డాంబికేయుండు సంజయున కిట్లనియె.

కురటు - అటతాళం

అయ్యయో యిదియేమొ సంజయా ।
కయ్యమిటులయ్యె ॥న॥
అయ్యయో యిదియేమి హేతువో ।
కయ్యమున భీమాత్మజుడు తా - నియ్యెడను జంపెన నలంబసు ॥న॥
యెవ్వరెవ్వరే మొనర్చిరో - అవ్వలిరణమున ।
యెవ్వరెవ్వరెటుల జేసిరో ।
కవ్వడి నెదిరించునట్టి - ఘనులు మన సైన్యముల లేరో ॥అ॥

వ చ న ము—

అని యిట్లడుగుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

## రగడ

నరవరసాత్యకి మనమొన జొచ్చియు । తరిమినరుకుచుండా
ద్రోణాచార్యుడు వీరావేశత । తో సాత్యకి నెదిరి
మూడు నారసంబుల నయ్యాదవు । గాఢ నేసినంతా
సాత్యకి పంచాశద్బాణంబుల । చాప గురుని నొంపా

ఆయన తొమ్మిదియమ్ముల సాత్యకి । యంగమ్ముల గ్రుచ్చీ
వెంటనె శరపంక్తిని గిచ్చి న । వృష్ణివమం డపుడూ
గినియలేక వెరగందిన సాత్యకి । మన సేనలు గనియూ
మనములనుబ్బుచు యార్చినంతనీ । తనయులు గురునాథా
అపుడా ధర్మజుడా యార్పులు విని । ద్రుపదసుతాదులతో
గంటిరె మీారలు పులుగునుత్రాటను । గట్టు బాలులీలా
ఆడెడు పోలికగురుడు సాత్యకిని । యాడించుచునుండే
గాన మీారు యాతని బాధువుం డీ । తని కడ్డము జనుడూ
భీమ పురస్సరులై మారొ్కనుడని । బిగ్గర దెల్పియునూ
తానువెడలి దరుమంగ సైనికులు । దర్పాంబుల వెడలీ
సాత్యకి గడచియు నాచార్యునిపై । సత్వరమున గదియూ
బందుగులనుగాంచిన వారలవలె । మందస్మితుడగుచూ
అందరి మేనుల మార్గణజాలము । లను గ్రుచ్చినయంతా
యిరువదివేవురు పాంచాలురు నా । ద్యారు కేకయు లపుడూ
కరినికరము రొంపిని బడుగతి ధర । దొరగిరంద రచటా
పాండవయోధులు ద్రోణాచార్యుని । పై జనజాలకనూ
అని నిలిచిన నట పాంచజన్య ధ్వని । వినవచ్చిన యంతా
ఆలకించి ధర్మజుడు మనంబున । నడలి యిదేమనుచూ
గాండివ ఘోషము వినరాదయ్యెను । కారణ మదియేమో
అయ్యో యిది యేమంచు హృదయమున । నడలుచు యెలుగెత్తి
సాత్యకితో నిట్లనుచు గేకలిడె । శమన నందనుండూ
విజయుం డొక్కడు జనె గాండివ రవ । మిన రాదయ్యెనుగా
పాంచజన్యరవ మద్భుతముగ విన । వచ్చె హేతువేమో
ధరణీరజ మెగసెను నలుదిక్కుల । దట్టముగా గ్రమ్మె
అక్కట జిక్కెనొ కౌరవ వీరుల । కా పార్థుడు నేడూ
నీ కంటెను బందుగు లెవ్వరు చూ । కీ కయ్యములోనా
అందున నిను ప్రార్థించెద నచటికి । నరుగు మతి త్వరగా
ధనంజయుడు నీ సఖుడు గురుండు గ । దా యెనుకులవర్యా

అల జయద్రధుని గావగ నుండిన । కలశభవాత్మజుడూ
కర్ణ శల్య కృప భూరిశ్రవు లతి । ఘన సాహసబలులూ
గ్రమ్మి సంత వారలతో మార్కొని । గాండివి సమరమునా
నొచ్చె నేమొనని బొడముచున్న దా । ను రుభుజశౌర్యండూ

వచనము—

ధర్మజుండు దీనవదనుండై సాత్యకితో మరియు నిట్లనియె.

ముఖారి రాగం — ఆటతాళం

యేమందునయ్యో - సత్యక తనయా ॥
యేమందునయ్యో నా - కేమి దోచదాయె ।
ఆమేను భుజములు - నామేను గలదెందు ।
భూమిపతు లీలాటమూర్తులు - నీ మహిని గనరాదు వెదకిన ।
యేమిగానున్నదో రణమున - సామి సంఘట నెటులనున్నదో ॥యే॥
ద్వైతవనమున గుణ । ధన్యుడు గాండీవి ।
నాతోడ దెల్పె న్నగజయని బిలిచియు ।
భూతదయ గలవాడు సాత్యకి - భూరి సాహస విక్రముడు సం ।
ప్రీతి మనకు సహాయుడగునని - యేమొ నిను గొనియాడె నతడు ॥యే॥

వచనము—

గావున సాత్యకీ నీవతిరయంబున నేగి యర్జునునకు సహాయుండవు గమ్మని యిట్లనియె.

# రగడ

హరి యొకండు నీ వక్కండవు పర । మాప్తులు గదమాకూ
గొప్పభారమైనట్టి పనికి నీ । కూర్మిజూప వలదే
కరుణారసమున బంధుభావమున । గాని బలమునైనా
పార్థుని గావగబొమ్ము సాత్యకీ । పరమాప్తుడ వగుచూ
అతడొక గతియైనను నాగతియే । మగునో దెలియదుగా
హరి నరు లిరువురు నీకు గురులుగద । యట్టి గురుల యెడకూ
దీర్పగ నిను ప్రార్థించితి నిప్పుడు । దీనిని పాటించీ

పోమ్మని ప్రార్థించిన ధర్మజు వచ । నమ్ము లాలకించీ
సాత్యకి యిట్లనె కౌంతేయాగ్రజ । సవ్యసాచి నాతో
సైంధవు వధకై బోవునపడు నను । సాత్యకి యని బిలిచీ
హరి వినుచుండగ జెప్పిన మాటల । తెరగు విన్నవింతూ
మనకు దివ్యశకునమ్ము లెంతయో । ననుకూలములయ్యే
గెలుతు మాహవమునకు జనియెద నే । సలుపు ప్రతినదీర్పా
ధర్మసుతుని రక్షణభారము నీ । దనియె సవ్యసాచీ
అమ్మహానుభావుని వాక్యంబుల । కనుచరణీయుడనై
గురుడగుటను నే యాతని యాజ్ఞను । కురుచసేయ వెరచీ
నీ రక్షణకై నిలిచియుంటి నిట । ఫాల్గుణి వరనేడూ
వలవని వెరపును బెట్టుకొంటివది । వలదు ధర్మరాజా
హరి సారథ్యంబగు రథమున కా । నరున కేమి భయమూ
గలుగదనుచు నీ మనమున దలపుము । వలవని వెరపేలా
అని యిటు బల్కిన సాత్యకి వచనము । లను విని ధర్మజుడూ
నాకై నీ విట నిల్చుటకంటెను । యా కవ్వనికడకూ
పోవుట మేలని దోచెను నామది । బొమ్ము వేగిరమునా
ద్రుపద విరాట ఘటోత్కచులాదిగ । దోర్బలులిట గలరూ
పాంచాలసుతు డాచార్యుని జం । పగ బుట్టినవాడూ
గాన నాదెసను నిసుమంతయు నను । మానము వలదికనూ
అర్జునుగావగ బొమ్మని ధర్మజు । డనిన యంతలోనా
సాత్యకి విని నొక్కింత దడవు మది । చాలగ చింతించీ
యొట్టకేలకును పార్థుని గావగ । నేగదలచి యతడూ
నరవరుయానన మాలోకించియు । మరియు నిట్టులనియే
భుజగర్వంబుల కౌరవబలములు । పోరిలోన నిలిచీ
రారాజుకు గల కార్యము దీర్పగ । రణ సంరంభములా
పూనికతో నున్నా రీ దట్టపు । మూక లెట్టులగునో
జూచుచుండుమూ నా కోల్తల నిట । నేచెద బలములనూ
అని యిటు పౌరుష వాక్యములాడుచు । నా సాత్యకి మరియూ॥

వచనము—

అంత సాత్యకి ధర్మజున కిట్లనియె.

కేగుప్తి — చాపుతాళం

సమ్మతించినాడ సవ్య - సాచి జేరగా ।
యిమ్మై నీయానతి హృద-యమ్మునవనిల్పి ర - ణమ్మునకనుబోవ ॥స॥
దవ్వని యెంచకు పగతుర - క్రొవ్వడంచెదా ।
అవ్వనుమతి పతి సైంధవు - ద్రెవ్వనేయగ నున్న - వివచ్చుజేరగ॥స॥
స్యందనంబు దెప్పింపుము - సారథి జీరీ ।
అందు జవనతురంగముల వ-సందగు కేతన మందు బూన్పింపుము॥స॥
ధరను నల్చిపురమున ను - స్థిరముగ వెలసీ ।
వర చప్పిడి పున్న యచ్చా-దరిని బ్రోచెడి గౌరి-వరు కరుణగలదిపుడు ॥స॥

వచనము—

ధర్మజా రథ్యంబుల శ్రమయును దప్పియుం దీర్పను సారథిం బిలిచి సవిశేష సన్నాహంబు జేయింపు మన బ్రీతినొంది యుధష్ఠిరుండు.

## రగడ

ఆజ్ఞనిడిన పరిచారక జనములు । సత్తురగంబులనూ
తనువులెల్ల మాలిన్యము లేకను । తడవి సంతలోనా
దారుకానుజుం డగు సారథి నిం । పార యశ్వములకూ
బొజ్జలు నిండగ నాహారంబిడి । భూరిశరంబులనూ
అరదముపై సమరించి గజ్జముల । నా రథమున బూన్చి
సింహధ్వజ మెత్తించి తయారుగ । జేసి తెచ్చి నిలుపా
అంతకుమున్న కృతస్నాతుండై । యా సాత్యకి మరియూ
మధుపానం బొనరించి వచ్చి ధ । ర్మజుని పదంబులకూ
ప్రణుతియొనర్చిన గౌగలించుకొని । పాండవాగ్రజుండూ
అంచితముగ నాశీర్వాదం బొన । రించి సంత యతడూ
పెండ్లికి బోయెడు లీల దేరిపై । బిగ్గర నెక్కియునూ
యెక్కిడు విల్లును శరములు దొడపై । చక్కగ నిడుకొనియూ

కదలిపోవుచుండెడి సమయంబున । కరువలి నందనుడూ
అగ్రజునకు సాష్టాంగ వందనము । లాచరించి యతడూ
అతనితోడ ఖోదలచినంత గని । యా సాత్యకి యనియె
భీమసేన రావలదు నాకు భయ । మేమిలేదు యచటా
యీ సైన్యంబులు నాకు భారమే । యిచట నిలిచి నీవూ
ద్రోణుని వలనను ధర్మరాజునకు । దోడను గలుగకుండా
కాచియుండు మెంతయు నీ విచ్చట । కౌంతేయాగ్రజునీ
అన విని భీముండట్లగాక యని । యతని కిట్లులనియె
రాజరక్షణమునకు నే నిలిచెద । రయమున నీవేగీ
విజయుని కట జయ మొనరించుము నీ । వేగుమనిన యతడూ
కవ్వడు సైంధవు ద్రుంచి బేర్చిన । కౌతుకంబు గనియూ
వచ్చి నిన్ను మీ యన్నను గౌగిట । గ్రుచ్చి గాగలింతూ
అని సాత్యకి దగవినిపించియు భీ । ముని నటకల్పియునూ
లేళ్ళ గమిం గను బెబ్బులి తెరగున । లేచి ధీరుడగుచూ
నీ సేనలపై నడుచుచుండె నని । నా సంజయు డనగా
విని ధృతరాష్ట్రుడు సంజయుతో ని । ట్లనియె సూతవర్యా
ధర్మసుతుడు బంపించిన సాత్యకి । తక్షణమే వెడలీ
మన బలముల దెస గవిసి నంత గని । మనవా రాతనినీ
పోవ విడిచిరే కారణమేమని । భూవిభు డడుగుటయూ
సంజయు డా కురుపతునకు నిట్లని । సమర విధానమునూ
సాత్యకి బోయిన పిదప ధర్మజుడు । శరగురు దెస గనియూ
ఆ శైనేయు పిరుంద నుదరి మన । యట్టి సమయముననూ
ధృష్టద్యుమ్ను డవష్టంభంబున । ధీరత నెలుగెత్తీ
పురిగొల్పిన పాండవ సైనికు లతి । త్వరిత గవియూ
మనవారందరు పగరసేనపై । మార్కొనిరో భూపా
అప్పుడు ధృష్టద్యుమ్నుడు శరములు । నద్భుతముగ నింపీ
శిరములు గరములు యురములు దొడలును । జరణంబులు గప్పా
పాంచాలాత్మజు కోల్తల కోర్వక । భయమున నీ బలమూ

శారుమారాకలకు నడ్డము జొచ్చి న్ను । పాలుర నేమ్వారనూ
యమపురి కంపెను ధృష్టద్యుమ్నుడు । నవింత సాహసుండై
ఆ సమయంబున కుంభసంభవుం । డాతని మార్గోనియూ
యేడుతూపులేసిన యాతడు గని । యేడింటను ద్రుంచే
చాపాచార్యుం డలిగి యస్త్రములు । స్యందనంబు గప్పి
ఆ సాత్యకిను పలక్షించియు గురు । డనియె నతనితోడా
నిక్కము నాచే బలువున కోడియు । నీగురుండు దొలగే
నీవిట నాచే దప్పించుక యెటు । బోవు వాడ విపుడూ
నిన్నెటు స్వక్షించెదనో జూతువు । నిలువుము యనిలోనా
అనవుడు సాత్యకి యిట్లని దెల్పెను । యాచార్యునితోడా॥

వ చ న ము—

మరియు ద్రోణాచార్యునకు సాత్యకి యిట్లనియె.

శంకరాభరణం — ఆటతాళం

శరగురువర్యా - మందరధైర్యా ॥శ॥
శరగురువర్య నా - మొర యాలించుము దేవా ।
నరవరుడాయుధి । స్థిరుడు బంపగ వస్తి ॥శ॥
పురుహూతు సుతునీ - జేరగబోదు - భూసురవరనే ।
పరమదయాళానా - ప్రార్థన మాలించి ।
నరునిపైగల ప్రేమ - నామీన జూపుము ॥శ॥
నిన్నెదిరించూ - వీరుడు జగతీ - నెన్న లేడనుచూ ,
పన్నుగ శ్రీవుల్చి - పరమేశుసాక్షిగ ।
మున్నే వింటినిగాని - మన్నించి బంపుము ॥శ॥

వ చ న ము —

సాత్యకీ ద్రోణాచార్యు నిట్లు ప్రార్థించి దొలగిపోవ దలంచి సారథీ యీ ద్రోణుండు మనల బోనీక పెనంగనున్నాడు గాన మనమిచ్చట నాలసించిన మన ప్రయత్న భంగంబగు నల్లదే సైన్యంబు లడ్డంబు రానున్నవి వచ్చిన వారల భంగపరచి పార్థునిం జేరబోవుదమని మరియు.

# రగడ

తొలగిపోవుచుండెడి సమయంబున । ద్రోణుని సైన్యములూ
అడ్డమువచ్చిన బాహ్లీకాదుల । నచట జిక్కుపరచీ
ధీరత నిల్చిన సాత్యకి వీడి బ । కారి బలంబులపై
గలిసినంత గని శైనేయుండట । గడచి చనియె భూపా
అన విని ధృతరాష్ట్రుడు సంజయుతో । ననియె నిట్టులనుచూ
మన సేనలు సాత్యకి సాయకముల । మడియుచున్న యపుడూ
జూచి సుయోధను డనుజు లెంతగా । శోకించిరొ యకటా
దెలుపు మనిన సంజయు డా నృపతికి । దెల్పె నిట్టులనుచూ
కురువర నీ యవినయ మాపదలకు । కుదురై నిలిచెనుగా
శోకాయత్తుడ వగుట దగదు నీ । వీ కాలంబుననూ
స్థిరచిత్తుడవై సమరరంగమున । తెరగెల్లను వినుమా
సాత్యకి యర్జును జేరగబోయెడి । సమయంబున నచటా
కృతవర్మం డడ్డము వచ్చిన గని । నతి రోషావశుడై
ఒక్కశరంబున విల్లు ద్రుంచి రయ । మొప్ప నాలుగింటా
రథ్యంబుల నాల్గిటిని గూల్చి సా । రథిని నొకట ద్రుంచీ
ఆతని యాటోపంబును మాన్పియు । నటుల నేగుచున్నా
కోపావిష్టుండై దుశ్శాసను । డేపుమీర నపుడూ
పారద్రెంఖణ ప్రముఖ బలంబుల । బరువడి గూడుకొనీ
వచ్చి సాత్యకిని జుట్టుముట్ట గని । యచ్యుతు ననుజుండూ
సాహస విక్రముడై దుశ్శాసను । సర్వబలంబులనూ
బాణ పరంపర పంక్తులచేతను । బారి సమరుచుండా
రథములు దొరగెను శుండాలంబులు । రణభూమిని గూలే
తురగవ్రాతము భటకోటులు తు । త్తునియలౌచు రాలే
సారధి కేతనములు డొల్లెను రణ । ధారుణి నిండగనూ
నెత్తురుటేరులు బారె భూతములు । నిండె నాల్గుదిశలా
కని దుశ్శాసను డతిరోషుండై । కార్ముకంబు బూనీ
పాషాణ ప్రదరంబు లేయ శ్రీ । పతి యనుజుం డపుడూ

అన్నిటి చూర్ణము జేసీ విశిఖముల । నా సేనల గప్పా
నొచ్చి బలంబులు పలుదిక్కులకును । విచ్చా గొరవేళా
బారెడి బలముల వెంటనంటి యెదు । వీరుడు సాత్యకియూ
అంపవెల్లి దేల్చిన వెగడొందియు । నధిపా నీ కొడుకూ
యోధవీరులం గూడుక ద్రోణుని । యొద్దకు జని నంతా

వచనము—

యివ్విధంబున తన చేరువకుం జనిన యా దుశ్శాసనుం గనుంగొని మున్ను సాత్యకి దెసబుట్టిన కోలాహలం బాకర్ణించుచున్న యగ్గురుం డతని కిట్లనియె.

యెరుకల కాంభోజి — ఆటతాళం

యేమీ - యువరాజా వచ్చితివే ॥యే॥
యేమి యిటు వచ్చుటకు కారణ - మేమొ తెలియదు దుస్ససేనా ।
క్షేమమా నీ యగ్రజునకును - క్షేమమే దొరలెల్ల ననిలో ॥యే॥
ధీరూ - డొ నరు డా సైంధవునీ ॥ధీ॥
జేరి యే మొనరించె కర్యము - గోరితిరి నీ యన్న నీవును ।
సారసాక్షుడు వచ్చి దెల్పిన - సంధి వినకింతకును దెస్తిరి ॥యే॥

వచనము—

అని మరియు ద్రోణాచార్యుం డిట్లనియె.

## రగడ

యెందుజొజొచ్చెదవు దుస్ససేననీ । వీరధస్తోమముతో
అడుకులు దినినప్పుడె కుట్రెత్తునె । యవనిలొ మనుజులకూ
ఒడ లెరుంగకను పాండుసుతుల నా । డడిగిన మాటలనూ ।
మరచితివే పాంచాలిని సభలో ! మాన్యగుణోత్తరనూ
బరచిన పాటులు మరచినారె యూ । పాండురాజ సుతులూ
గావున నొక సాత్యకిచే నోటరి । వై వచ్చితి వకటా
భీమ కిరీటుల బారిం బడి నీ । వేమి బ్రతుకగలవూ
నాటి క్రొవ్వు యెటుబోయెనొ యీతరి । నాకడ జొచ్చితివి

గావున నే నొక హితవు దెల్పెదను । భావంబున నిల్పీ
బ్రతుకదలంచిన పాండు నందనుల । భాగంబుల నెల్లా
నిచ్చినట్లు నీ యగ్రజుతోడను । నచ్చజెప్పుమయ్యా
యిన్ని యేల భీష్ముని బుద్ధులు విన । కిట్లు జెడితిరయ్యా
ఆచార్యుడు దెల్పిన వాక్యంబుల । కా దుశ్శాసనుడూ
విననియట్లు మరి యేమియు బలుకక । జనియె కయ్యమునకూ
తదుపరి ద్రోణుడు పాండవ బలముల । దాకి శరము లేయా
పాండవ సేనల వీర కేతుడను । దండిమగడు దాకా
అతని నొక్క వాలమ్మున ద్రుంచియు । నా చార్యుడు వడిగా
సారథులను రథ్యంబుల దొరలను । సమరి జంపుచుండా
ధృష్టద్యుమ్నుడు నాలోకించియు । ధీరోదాత్తుండై
కోపతామ్రనయనుండై వేగమె । కుంభజుపై గవిసీ
వత్సము దూరగ క్రూరాస్త్రంబుల । వైచిన మన బలమూ
ఆహాకారము జేయునంతలో । నాచార్యుం డచటా
మూర్ఛిల్లిన గని ధృష్టద్యుమ్నుడు । మోదంబున లేచీ
వాలుబలకయుం గొని సత్వరమున । నేలకు లంఘించీ
మెరుగు మెరయు తెరగున జని శరగురు । శిరము దరుగ దలచీ
యేడ్తెర సాత్యకి స్యందనంబు పై । కెగిరి వంతలోనా
ఆచార్యుడు తన మూర్ఛదెలిసి ధైర్యంబున నటనిలిచీ ।
తనపై వచ్చెడి ధృష్టద్యుమ్నుని । గని నతికోపమునా
జేన కొలది తూపులు ద్రుపదాత్మజు । మేనను నొప్పింపా
అవి యన్నియు గడుదురుల చందమున । నతని మేను గరువా
వెగడొందియు జని స్యందన మెక్కియు । విల్లు చేతగొనియూ
బాణపంక్తులను శెల్లేసిన గని । భారద్వాజుండూ
అతని సూతు దెగవైచి నంత రథ । హయములు నిల్వకనూ
తొలగి తేరు నీడ్చుక జనినంతనె । ద్రోణాచార్యుండూ
పాండవ సైన్యంబుల నట నిల్వక । బారదోలుచుండా
ఆతని కొల్తల కోర్వలేక ధర్మాత్మజు బలమెల్లా ।

ఎదిరించగ లేకను యా బలములు । నొదిగియుండునంతా
గడికండలు గావించుచు బలముల । పుడమి డొల్లజేయా
మిగిలినవారలు నలుదిశలకు బా । రగ గని భీముండూ
ద్రుపద నందనుడు విన నిట్లనియెను । ద్రోణాచార్యుండూ
రూపడంచె మన సేనల నెల్లను । పాపభీతి లేకా
అన విని ధృష్టద్యుమ్నుడు మార్గాను । నట్టి సమయముననూ
తలగడచియు నట చేకితాను డను । నిలపతి గదిసియునూ
ఆశుగముల సారథి నొప్పించియు । నశ్వధృతిని మాన్పా
కన్నుల నిప్పులు రాల ద్రోణు । గ్రమ్మగు బాణములా
గొట్టినంత నా చేకితాను డా । కొల్తల కొర్వకనూ
విరథుండై జన దొరలందరు తన । వెంటజనిరి వేగా॥

వ చ న ము—

ఆసమయంబున పాంచాలపతి యా బ్రాహ్మణుండు వృషభంబులం బోని భూపాలుర నెల్లను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాడు వారింపవలదే యని కడంగి మొనలం బురికొల్పుకొనుచు నకృజం బగు కయ్యంబు సేయుచుండం బాండవాగ్రజుం డాత్మగతంబున.

ముఖారి — అటతాళం

వెంట నెవ్వరులేక నర్జును - డొంటివాడై జనియె సమరో ॥
ద్ధారుడూ ॥ యింద్ర కుమారుడూ ॥ వెం ॥
మనసు నిలకడలేక సాత్యకి - జను వటంచును బుచ్చితిని నట ॥
జూడగా ॥ నరునకు దోడుగా ॥ వెం ॥
పోవుటను గనుగొంటి నిద్దరు - భూరిబాహాబలులు సేనల ॥
జిక్కిరో ॥ సమరము దక్కిరో ॥ వెం ॥
ధర నుల్చిపురీశుడౌ శం - కరుని దయ యెటులున్నదో గన ॥
జాలమూ ॥ యేమీ కాలమూ ॥ వెం ॥

వ చ న ము—

ధర్మనందనుండు తనలో విచారంబునొందుచు మరియు నిట్లనియె

## రగడ

యేమైరో పార్థుడు సాత్యకు లట । యేమిజేసిరొక్కొ
వారికి దోడుగ నేగు టెట్లకో । వాయుకుమారుండూ
తమ్ముని కొరకై సాత్యకి నంపెను । ధర్మజుండు యపుడూ
చిత్తమ్మున తమ్ముని దలంప డది । యెత్తెరగోగానీ
అని యచ్చటనుండెడి ప్రజలెల్లను । యువమానింతురుగా
బాహుబలుం డద్భుత విక్రము డీ । పావని బంపిననూ
యీయెడ నా హృదయంబున శోకము । వాయవలయు జుమ్మా
అని బహువిధుల విచారించియు భీ । ముని జేరగ నరిగీ
పెద్ద యెలుంగున భీభత్సా యని । పేరున నరుచుచునూ
కన్నీరొలుకుచు మాటజెప్ప లే । కార్తి బొందియున్నా
గని భీముం డిట్లనియె మేము గలు । గంగ విచారంబే
యేమని యాజ్ఞ యొసంగిన నాపని । యేదైనను దీర్తూ
అన విని భీమున కగ్రజు డిట్లనె । నను జా నచ్చోటా
పాంచజన్య రవ మినవచ్చిన నతి । భయమున సాత్యకినీ
దోడుగ బంపితి నట యెట్లుండెనొ । దోచదు నామదికీ
నీవుబోయి పార్థుని గని సంతస । మావహిల్లునటులా
సింహనాద మొనరింపుమయ్యా నా । చిత్తము రంజిలగా
నీ తమ్ముడు పసి వా డతి రూపసి । నీతివిదుడు గానా
మద్భక్తుం డాతని కెడరగునని । మనము తల్లడిల్లే
అనుచుండగ నాలించియు భీముం । డన్న కిట్లులనియే
వగువనేల త్రదధ రథ్యంబుల । నగధు సారథినీ
గాండివ శరముల కొలది యొసంగుదు । గాదె ధర్మ తనయా
ఆజ్ఞ యొసంగిన నేను బోయి కృష్ణార్జున సాత్యకులా
గలిసి వారి క్షేమంబులు నీ కిట । దెలియ నెరుక జేతూ
నని బల్కియు పాంచాల నందనుని । గనుగొని యిట్లనియె
శరగురు ప్రతిన నెరుంగుదుగాదే । మరువకుండు మిపుడూ
యేమరకను జాగ్రతగాయుండుము । భూమీశుని యడనూ

అని దెల్పిన విని ధృష్టద్యుమ్నుం । డా భీముని కనియే
విను నా తనువున ప్రాణములుండగ । మన ధర్మజు దెసకూ
రాగలండె ద్రోణాచార్యుని సే । రానిత్తునె యిటకూ
తడయక సందేహము విడి యర్జును । కడకు నరుగు మనినా
ఆ ధృష్టద్యుమ్నుని వాక్యంబుల । కలరి వాయుజుండూ
అన్న పదంబులకు నుబ్రణతుండై । యా ధర్మజువలనా
ఆలింగన యాశీర్వాదంబుల । నా రదమున బడసీ
పోవదలంచిన యంత నచ్చటను । భావజజనకుండూ
శంఖనినాదము జేసినంత విని । శమన తనూజుండూ
అదె వినవచ్చెను పాంచజన్య ధ్వని । యర్జును రోటమినీ
గని శ్రీకృష్ణుడు జేసెడి రభసం । బని తలంతు నేనూ

వ చ న ము—

అన విని భీమసేనుం డత్యంతరయంబున నర్జునునిం జేరబోవం దలంచి ప్రయాణోన్ముకుడై సారధిం గని యిట్లనియె.

జంఝూటి - ఆటతాళం

ఆ రదము దెమ్మా - అల్లదె సారధి ।
బరువడి నేగియు - తురగముల బూన్చుక ॥అ॥
శర చాపంబు ల - స్యందనమున నిడి ।
త్వరితగతిని కే - తన మెత్తించియు ॥అ॥
తరుచుగు తూర్య - ధ్వనులు జెలంగగ ।
సరసను భేరీ - స్వనములు మ్రోవగ ॥అ॥

వ చ న ము—

యిర్విధంబున విశోకుండు దెచ్చు రథంబు నెక్కి సింహ నాదంబు జేయుచు బోవుచున్న భీమసేనుపై నీ కొడుకులు దలపడి వివిధ విశిఖంబుల బరగించిన లేళ్ళగమింగను సింగంబు చందంబున జెలంగి మనవాడు వేయు శరంబులు మగిడించుచు గదిసి మూడు నారాచమ్ము

బుల ముప్పారం జంపిన మిగిలిన వారందరు భయంబున పలుదెసల బారుచున్న వారల దివ్యాస్త్రంబుల గొట్టి తెరపి గావించి రథంబు బరపుటంగని ద్రోణాచార్యుం డప్పుడు.

## రగడ

పోవుచున్న భీముని మార్గోన్నియును । భూరి విక్రమమునా
వుగ్రాస్త్రంబుల గప్పి నిల్పెనట । శ్రీఘ్రమె నొక శరమూ
నిటల తలంబున నాటించినయట । జలిచె వాయుజుండూ
నిలిచిన వాయుజు గని తనలోనన । దలచె కుంభజుండూ
వీడు యర్జునునివలె నా యిష్టము । తోడ బోవువాడూ
అని దలచియు పవనాత్మజు గనుగొని । యనియె నిట్టులనుచూ
నన్ను గెలువ కెక్కెడిగలవు నీ । వెన్ని విధుల నైనా
యింతకు మున్నుగ నీ తమ్ముడు నెం । తెంతో శ్రమ జెందీ॥
కడకు నాదు యనుమతి గొని గాదే । కయ్యమునకు జనియే
గురు డిట్లన విని కీచ కాంతకుడు । కోపంబున ననియే
ప్రియముబల్కి తప్పించుకపోవను । భీభత్సుడుగాడూ
పగర బాహుబల మర్దనుండు యీ । పవన తనూజుండూ
నీవు బంధుడవు తండ్రివి గురుడవు । నిర్మల హృదయుడవూ
గాన నాదు దర్పము జూపించెద । గనుమని భీముండూ
గద సారించి చెలంగియు తన భుజ । గర్వంబున వైవా
గని కుంభజు డుర్వికి దాటిన యూ । గదరశ్మలు మింటా
బర్వగ బెట్టిదమగు మ్రోతలతో । బల్ పిడుగులమాట్కి
వచ్చి ధాకి గుఱ్ఱముల సారథిని । చెచ్చెర బడగూల్చి
అరదము పొడిగావించిన సైన్యము । లదరి బారుచుండా
శరగురు డొండొక తేరునెక్కి స । త్వర భీమునిదాకీ
శరవర్షము గురిపించుచుండగా । కరువలి నందనుడూ
పొలివోకను యరదంబుడిగ్గి గురు । భూరిశరావళికి
మోమువంచి కడుయొప్పున జనె స । మ్మోదముతో నపుడూ
పోవుచు నొగ లొక చేత బట్టి తే । రావైపున విసరా

అని దెల్పిన విని ధృష్టద్యుమ్నుం । డా భీముని కనియే
విను నా తనువున బ్రాణములుండగ । మన ధర్మజు దెసకూ
రాగలండె ద్రోణాచార్యుని నే । రానిత్తునె యిటకూ
తడయక సందేహము విడి యర్జును । కడకు నరుగు మనినా
ఆ ధృష్టద్యుమ్నుని వాక్యంబుల । కలరి వాయుజుండూ
అన్న పదంబులకు నుబ్రణతుండై । యా రథ్మజువలనా
ఆలింగన యాశీర్వాదంబుల । నా రదమున బడసీ
పోవదలంచిన యంత నచ్చటను । భావజజనకుండూ
శంఖనినాదము జేసినంత విని । శమన తనూజుండూ
అదె వినవచ్చెను పాంచజన్య ధ్వని । యర్జును రొూటమినీ
గని శ్రీకృష్ణుడు జేసెడి రభసం । బని తలంతు నేనూ

వ చ న ము—

అన విని భీమసేనుం డత్యంతరయంబున నర్జునునిం జేరబోవం దలంచి ప్రయాణోన్ముఖుడై సారథిం గని యిట్లనియె.

జంఝూటి - ఆటతాళం

ఆ రదము దెమ్మా - అల్లదె సారధి ।
బరువడి నేగియు - తురగముల బూన్చిక ॥అ॥
శర చాపంబు ల - స్యందనమున నిడి ।
త్వరితగతిని కే - తన మెత్తించియు ॥అ॥
తరుచుగు తూర్య - ధ్వనులు జెలంగగ ।
సరసను భేరీ - స్వనములు మ్రోవగ ॥అ॥

వ చ న ము—

యివ్విధంబున విశోకుండు దెచ్చు రథంబు నెక్కి సింహ నాదంబు జేయుచు బోవుచున్న భీమసేనుపై నీ కొడుకులు దలపడి వివిధ విశిఖంబుల బరగించిన లేళ్ళగమింగను సింగంబు చందంబున జెలంగి మనవారు వేయు శరంబులు మగిడించుచు గదిసి మూడు నారాచ

బుల ముప్పూరం జంపిన మిగిలిన వారందరు భయంబున పలుదెసల బారుచున్న వారల దివ్యాస్త్రంబుల గొట్టి తెరపి గావించి రథంబు బరపుటంగని ద్రోణాచార్యుం డప్పుడు.

## రగడ

పోవుచున్న భీముని మార్గోనియును । భూరి విక్రమమునా
వుగ్రాస్త్రంబుల గప్పి నిల్పెనట । శీఘ్రమె నొక శరమూ
నిటల తలంబున నాటించినయట । పలిచె వాయుజుండూ
నిలిచిన వాయుజు గని తనలోనన । దలచె కుంభజుండూ
వీడు యర్జునునివలె నా యిష్టము । తోడ బోవువాడూ
అని దలచియు పవనాత్మజు గనుగొని । యనియె నిట్టులనుచూ
నన్ను గెలువ కెట్లేగగలవు నీ । వెన్ని విధుల నైనా
యింతకు మున్నుగ నీ తమ్ముడు నెం । తెంతో శ్రమజెందీ॥
కడకు నాదు యనుమతి గొని గాదే । కయ్యమునకు జనియే
గురు డిట్లన విని కీచకాంతకుడు । కోపంబున ననియే
ప్రియముబల్కి తప్పించుకపోవను । భీభత్సుడుగాడూ
పగర బాహుబల మర్దనుండు యీ । పవన తనూజుండూ
నీవు బంధుడవు తండ్రివి గురుడవు । నిర్మల హృదయుడవూ
గాన నాదు దర్పము జూపించెద । గనుమని భీముండూ
గద సారించి చెలంగియు తన భుజ । గర్వంబున వైవా
గని కుంభజు డుర్వికి దాటెన యా । గదరశ్మిలు మింటా
బర్వగ బెట్టిదమగు మ్రోతలతో । బల్ పిడుగులమాట్కి
వచ్చి ధాకి గుఱ్ఱముల సారథని । చెచ్చెర బడగూల్చి
అరదము పొడిగావించిన సైన్యము । లదరి బారుచుండా
శరగురు డొండొక తేరునెక్కి స । త్వర భీమునిదాకీ
శరవర్షము గురిపించుచుండగా । కరువలి నందనుడూ
పొలివోకను యరదంబుడిగ్గి గురు । భూరిశరావళికీ
మోముపంచి కడుమోప్పున జనె స । మ్మోదముతో నవ్వుచూ
పోవుచు నొగ లొక చేత బట్టి తే । రావైపున విసరా

సేనాముఖమున నిలిచి యెంతో మన । సేనల గాచెదనూ
నీతో వచ్చుట కర్జముగాదది । నేగుమనిన యతడూ
మరలి తన్ను దా బురికొల్పుక స । త్వర నేగిన యపుడూ
వుత్తమౌజ మొదలగు యోధులు వా । రత్తరి నరు కడకూ
వచ్చుచున్న దుర్యోధనుండు గని । వారింపగ దలచీ
దాకినంత వారలతో కయ్యము । దారుణముగ జరిగే
అప్పు డుత్తమౌజుడు పతి చాపము । నార్చుచు ఖండించీ
తోడనే యాతని వక్షము దూరగ । తోమరమును నింపా
మరియొక చాపముగొని సుయోధనుడు । శరములు సంధించీ
అతని హయంబుల సారధిగూల్చిన । నరిగియు ధామన్యూ
తేరెక్కియు పతిసూతు హయంబుల । ధారుణి బడగూల్చి
విరథుండై పొలిబోక సుయోధను । డరథముపై గదనూ
గొని చని వాని తురగంబుల నూ । తుని దెగవైవగనూ
రథము డిగ్గి దొలగిరి వా రిద్దరు । రాజరాజు మరియూ
మద్రేశుని రథమెక్కి జనియె స । మ్మదమున నరవరుడూ
వుత్తమౌజుడును యుధామన్యుడును । నత్తరి సేనలనూ
బారి సమరుచును దేరులెక్కి వే । పార్థుజేరి రపుడూ॥

వ చ న ము—

అనుట విని నాంబికేయుండు సంజయున కిట్లనియె.

**తోడిరాగం — ఆదితాళం**

మనవా రెంతటి - మందభాగ్యులో - గనరాదో నూతా ॥
మన కర్ణుడు పాండవుల గెల్చునని-మనముల పెనుయాసల నుండిరి గద॥
జననాథుండెట్లు దల్లడిల్లెనో - ననిలో నూతజు నోటమి గన్గొని ॥మ॥
ధర్మజుండు గర్ణుని యాటోపము-దలచి రే యికన్ను మూయుడటయా।
నిర్మలాత్ము డీమాటవిన్న-దుష్కృద్మ్మడు కర్ణుడ నాధయునునొగడ ॥మ॥
విరథుడగుచు పోయినట్లె పోయెను-మరలిరాడు కయ్యమున కదేమొ।
నెరుగబల్లు తేటపడగ సంజయ-ధరనునుల్చి పురపర శివుసాక్షిగ ॥మ॥

వ చ న ము—

యివ్విధంబున మనంబున నురియాడుచున్న కురువల్లభునకు సంజ యుం డిట్లనియె,

## ర గ డ

జననాథా విను నీ వడిగిన దె । ల్లను వివరంబుగనూ
ధీరమానసుడు భీముం డర్జును । జేరబోవుచుండా
కర్ణుడు పేరెలుగెత్తి పిల్చె నా । కరువలి నందనునీ
ఆతని కంఠధ్వని విని భీముం । డత్యుగ్రత మరలీ
మార్గా-ని నంతనె నిరువురు గదిసీయు । మార్గణ జాలములా
బోరుచు దురగంబుల సారధులను । దేకుల నొంచుచునూ
చాపంబుల మైమరువుల ద్రుంచుచు । కోప చిత్తములనూ
పోరాడెను తరి కీచకాంతకుడు । భూరి విక్రమమునా
రాధాత్మజు నిలు నుగ్గుజేసి । గు ఱ్ఱంబుల బరిమార్చి
సూతు దెరల్చియు పవితుల్యంబగు । శౌతశరము లేయా
తనువు డస్సి సిగ్గిరియొం డొక రధ । మునకు జనియె నధిపా
అన విని కురుభూవిభుడు సంజయున । కనియె నిట్టులనుచూ
ఆ కర్ణుని బింకం బెటు లయ్యెనో । నదియు దెల్పుమనినా
కురువర కర్ణుడు మరలవచ్చి బల్ । క్రోధమాన సమునా
భీషణకాపా యితలోచనుడై । భీము దెరకుమరలీ
గవిసినంత నయ్యిరువుర కతి సం । గ్రామమయ్యె నధిపా
డేగలతీరున పులులచంద మే । డ్తెర బోరుచు మరియూ
మత్తగజంబుల పోల్కి- సింహము ల । మాట్కి-బోరుచుండా
కర్ణుని దిక్కు-నగల బలమెల్లను । కయ్యమునకు గదిసీ
భీముదాకి యాతని కోల్తలకును । భీతిగూలి రంతా
సంజయు డిటు దెల్పిన విని యిట్లనె । సామజ పురవరుడూ
సంజయ సూతసుతుండు పాండవుల । సమరములో బోరీ
మనల జయింపగ జేయునంచు నె । మ్మనమున నమ్మియునూ
దుర్యోధనుడు మదాంధుడు క్రూరుడు । దుష్టబుద్ధి నాడూ

శౌరివచ్చి సంప్రీతిగ దెల్పిన । సంధిని వినడాయే
నిష్కళంకు తా పాండుకుమారులు । నీతివంతు లగుటా
దైవము వారికి చేటు దలంచునె । ధర్మ సమరమగుటా
కావున రాజును తమ్ములతో చెడి । పోవుట నిశ్చయమూ
యేది యెట్లైనను సమర విధానము । నెరిగింపు మటనినా
సంజయు డిట్లని దెల్ప దొడంగెను । సామజపురి పతితో
సమసిన మన సేనల గని కర్ణుడు । సమరమునకు జొచ్చి
ముప్పది నారసముల నా భీముని । ముంచినంత యతడూ
నడుమనె నరికియు తొమ్మిది శరములు । నాతనిపైనింపా
గని రాధాత్మజు డంపసోన భీ । మునిపై గురిపింపా
యిట్లిరువురు గదిసియు వృషభంబుల । యట్లు బోరుచుండా
ఘోరమగుచు గనుపట్టెను చూచెకీ । వారల కా యుడనూ
అంతట గర్ణుని విల్లు హయంబుల । కుంతి నందనుండూ
నుగ్గునూచ మొనరించి రాధజుని । నోనేసిన యంతా
ద్రోణుడు దుర్జయుడను నీ కొడుకను । దోర్బలమునబంపా
వచ్చి రౌద్రముగ దాకినంత గని । వాయునందనుండూ
తురగంబుల సూతుని బలు శరముల । శిరములు దెగవైచీ
ఒక్క శరంబున దుర్జయు మస్తక । మొప్పగ ఖండించే
ఆతడు బడుటకు కర్ణుడు కనుగవ । నశ్రులు రాల్చుచునూ
అతి శోకాతురుడై రథ మెక్కిన । నా భీముడు గనియూ
హేమభూషితంబగు మార్గణముల । నేడ్తెర గొట్టెనూ
అన్ని కనకమయ పుంఖంబులచే । నా భీముని గొట్టా
దానగనలి మూడమ్ములు రాధా । త్మజుని వక్షమునసూ
గాడిబార నేసిన కడు నొచ్చియు । గర్ణుడు తన రథమూ
దొలగదోలుకొని బారె నప్పు డా । కలని నిల్వకతడూ
అనవిని ధృతరాష్ట్రుం డా సంజయు । కనియె నిట్టులనుచూ
దైవవిధిని దప్పింపగ నెవ్వరి ॥ తరమగునో సూతా
సురగరుడోరగ యక్షులకైనను । కరువలి నందనుడూ

యెదిరింపగ రాడందుకు కర్ణున | కెట్లు సాధ్యమగునూ
పాండు నందనుల నాజిని గెలువ గ | లండని రాధజునీ
అగ్గించుచు నుండెడు నా కొడు కిపు | డా భీముని వలనా
యెంత దీనుడై యుండెనో నామది | కెరుగరాదు సూతా

వచనము—

అని పలు మాటలాడుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

మోహన రాగం — అటతాళం

తగునా రేడా - తగ నిటులాడా ॥త॥
సగము ధర పాండవుల కివ్వగ - సమ్మతించగ వైతి వకటా ॥త॥
వెంగలీ యొకడు - విషముకు గ్రోలి ।
యంగముల నారటను బెట్టిన - యన్యులను గోపించి నటులా ॥త॥
ముందు వెనుక యోచనలేక పాండూ।
నందనుల కానలకు దోలిన - మందమతి నీ కొడుకుననుమా ॥త॥
యిలలోనుల్చి పురీశుడో హానునీ ।
కలనిగెలిచిన నరుని బలిమిని - దలచవైతివి చులకజేసీ ॥త॥

వచనము—

యింక పలుమాటలేల బవరంబు తెరంగు వినుము.

రగడ

నీకొడుకులు దుర్మర్షణుడాదిగ | నేపురు సమరమునా
కర్ణునోటమినిజూచి యోర్వక ను | కసలి భీముదాకీ
తూపుల నడరించిన గని వారికి | దోడుగ కర్ణుండూ
మార్గణపంక్తిని బరపినంతనా | మారుతాత్మజుండూ
ఆవిశిఖంబుల దూలించుచు నా | యేపురపై గవిసీ
తురగ సారథులతోడ నేపురను | ద్రుంచి యార్చినంతా
కోదండమునొని రాధా తనయుడు | క్రూరాస్త్రము లేయా
నవి ఖండించియు దివ్యాస్త్రంబుల | నతని నూతుజంపీ
విలు ద్రుంచియు హాయ సందోహంబుల | నిలబడ గూల్చియునూ

కీచకాంతకుడు హాసము జేయగ । కేరుచు గర్ణుండూ
గదవైచిన నది భగ్న మొనర్చెను । కరువలి నందనుడూ
పాదచారియై కర్ణుడు భీముని । పై దాకిన యంతా
కురుపతి చిత్రాక్షాది కుమారుల । త్వరితగతిని బరపా
భీమునిపై గవిసిన నాతడు బల్ । తామసమున గదిసీ
రథరథ్యంబుల సారథి సహితము । రయమున నేద్వారనూ
సమరావని పాల్జేసినంత నా । సమయ మెరింగియునూ
మరియొక స్యందనమెక్కి కర్ణుడా । మారుతి దాకగనూ
అప్పు డిరువురకు ఘోరంబగు సమ । రంబయ్యెను నధిపా
శత్రుంజయు డాదిగ నేద్వారుబల్ । స్సాహసమున వెడలీ
మగటిమి మీరగ భీమసేనుపై । మార్గాని శరములచే
గప్పినంత యత డందరి శరముల । గండడగించియునూ
సప్తనారసంబుల వారందరి । సమయించియు నార్చె
తమ్ము డొనర్చిన సింహనాదమట । ధర్మజుడాలించీ
భీముని నిజవిజయం బిదియనుచును । తామసమున బొంగీ
అప్పుడు ద్రోణుని దెసకు దరిమి క । య్యం బొనరించుటయూ
అనుజులు పలువురు గూలిన దుర్యో । ధనుడు మనంబుననూ
అయ్యో జూదం బప్పుడు విదురుడు । నెయ్యముతో నాకూ
జెప్పినట్లె యగుచున్నది యిప్పుడు । సేయున దేమనుచూ
గుందుచు సభలో పాండుకుమారుల । గొందల పెట్టితినీ
అట్టి పాప ఫల మనుభవింపకను । నది యెట్టుల బోవూ
నని వగ బొగలుచు నుండెను సుయోధను । డని సూతుడు దెల్పా
విని కురుభూపతి గడచిన దానికి । నింత వగవనేలా
దుర్మతివై కార్యము దప్పెను యా । దుర్యోధను డపుడూ
కావున లాభంబేమి కుమారుల । కథ జెప్పుము సూతా
అనవిని సంజయుడా ధృతరాష్ట్రున । కును దెల్పగ దొడగే
కర్ణుడు భీముని దాకి ఘోర సం । గర మొనర్చుచుండా
వా ని సైన్యంబులు జుట్టుముట్ట గని । మారుతాత్మజుండూ

భల్ల ప్రముఖ బాణంబుల కేతువు । పరియలు గావించీ
ఛత్ర చామరంబుల రథ్యంబుల । స్యందన సారథులా
సుభటకోటి మాతంగ వ్రజముల । చూరుజేయుచుండా
బారుచుండె నెత్తురుటేరులు రణ । ధారుణి నెల్లెడలా
మిగిలిన బలములు నిరుగెలంకులకు । వగను దొలగి చనినా
తాధేయుం డా భీముని దెస కతి । రయమున జని దాకీ
పోరుచుండ నమ్మారుత తనయుడు । క్రూరాస్త్రంబేయా
కర్ణుని కర్ణాభరణము డొల్లెను । ఘన నుల్కము రీతీ
అంతట విడువక నొక భల్లంబున । నతని యురస్థలినీ
గాఢనేయ నత డల్గి గొట్టె శత । కాండంబుల నతనీ
అదిగని కనుగొన కెఱ్ఱజేసి రా । ధాత్మజు డతి వేగా
పవనజు దాకియు చాప మశ్వముల । పగ్గంబులు నరుకా
కాడితోడ నవి బెనగుచుండ నొక । కాండంబున ధ్వజమూ
గూల్చి సూతు మే నవియగ నేసిన । కోయని బరతెంచే
అప్పుడు భీముడు నుగ్రశక్తి గొని । యా కర్ణుని పైవా
దానిని నవ నారసముల కర్ణుడు । తప్పక ద్రుంచుటయూ
పలక వాలు గొని వాయునందనుడు । బల్మిని దాకగనూ
పలక పరియులు నరికినంత నా । పవనాత్మజు డపుడూ
కరవాలంబున యా రథికుని విల్ । ఖండించిన యతడూ
నొండొక నిష్ఠుర చాపం బెత్తగ । నుండు నంతలోనా
అతిజవమున భీముం డా కర్ణుని । యరదముపై దుముకా
అదిగని కర్ణుడు కేతనంబునకు । కుదురుగ గావించూ
పీఠము నడుగున దాగిన కర్ణుని । భీముడు గానకనూ
నలుదిక్కుల పరికించి యతని స । న్నలు లేకుండుటనూ
అరదము క్రిందుగ దూరెనేమొ నని । యాత్మను దలచుచునూ
అతని బట్టుకొనువాడై బిగ్గర । న రథము డిగ్గిననూ
వికల సాధనుం డగుట భీము గని । యిదియె సమయమనుచూ

పెక్కు నారసమ్ములు నొక్కుమ్మడి । భీమునిపై వేయా
యే సాయకములు లేకుండుటకును । వెన్నియగ వెరచీ
అంతకుమును వివ్వచ్ఛుని చేతను । నంత మొందియున్నా
సామజములు తురంగంబుల తిట్టల । సందున దూరియునూ
ఆశవములపై గప్పుకయుండిన । నతని గానలేకా
కదనభూమి నెల్లను వెదకుచు నట । కరులగు మూలలోనా
అశ్వశవంబుల గప్పుకయుండిన । నా భీముని గాంచీ

వ చ న ము—

పోరిపోరి సాధనంబులు లేక నిరాయుధుండై డస్సి బెండు పడియుండి సామజ శవంబుల మధ్య దాగియున్న భీమసేనుం గని నవ్వుచు కుంతి వాక్యంబులు దలంచి వింటికొనను కడుపు బొడుచుచు యిట్లనియె.

బేహాగ్ — ఆదితాళం

భండన మేటికిరా – ఓ తిండిపోతా ॥భం॥
భండన మేటికి–పావని నీ యు–ద్దండము కూటి–కుండ యుకుంగను॥భం॥
తుంటరి నీకీ–దుర మేలసు పెర–బంటుననుచు మూ–ర్ఖొంటివిమూర్ఖా॥భం॥
అడిచిపడెదు నీ – కని యేలను రా – వడ ముడి నీ వింటి – కడనే యుండుము ॥భం॥
మునిపై యడవుల–గని ఫలమూలము – లను దిని శాంతము – గొని యుండుమురా ॥భం॥
పౌరుష ముండియు – బవర మొనర్చిన – మీరియు నాదగు – పీసల జేరకు ॥భం॥
పరమ పాపినీ–బ్రతు కిటులయ్యెను–నరుశౌరులదరి–కరిగి బ్రతుకరా॥భం
యెన్నగ చప్పిడి – పున్నయ నేలిన – పన్నగ భూషణు – భజియించుమురా ॥భం॥

వ చ న ము—

కర్ణుం డాభీము నవమానించుచున్న తరి శ్రీకృష్ణుని పనుపున నర్జునుండు.

# రగడ

సుశిత నారాచంబుల కర్ణుని । జొక్కనటులగొట్టీ
భీమసేను దైన్యంబును బాపియు । భీభత్సుం డపుడూ
అంగరాజుపై మంటలు మండెడి । యంబకములు బర్వా
వచ్చెడి సాయకముల గురుతనయుడు – వడిగా ఖండించీ
అశ్వత్థామరువది నాలుగు సా । యకముల నొప్పింపా
అన్నరుండు నిలుమనుచు యదల్చిన । సూరా శరగురు సుతుడూ
దెరలి కరుల గమి జొచ్చి వంతలో । కరువలి నందనుడూ
తేరా యిత మొనరించి సూతుడట । దెచ్చినంత నెక్కి
విన్న మొగంబున పార్థకడకు జనె । వేగ వృకోదరుడూ
అతని కడకు సాత్యకి సగర్వమున । నతివేడుక జనియె
అని దెల్పిన విని కురు విభుండు సూ – తున కిట్లని యనియే
బలవంతుల తోపగ గొనుట మేల్ । గలుగునె యెందైనా
పాండుకుమారుల పాలియగదగు । పాడిదలంచియునూ
యీాయకున్న గలిమియు గీర్తి నసి । యించుట నిశ్చయమూ
విను మాతని యదుగుల పైబడి యై । నను యిచ్చుట మేలూ
తా నెరుగడు పరులెంత జెప్పినను । మానడు దుర్గుణమూ
బ్రతుకు రాకపోకలు నెరుంగ డా । పాపాత్ముడు సూతా
యెంతగ వగచిన నేమిఫలము గల । దేమందును విధినీ
సమర విశేషంబుల నెరిగింపుము । జాగుచేయ కనినా
నరవర సాత్యకి యటువచ్చుట గని । యల త్రిగర్త బలమూ
అడ్డంబై చన సాత్యకి వేగమె । నా సేనల గదిసీ
పంచ శత స్యందనముల గూల్చిన । బారె మిగులు సేనా
వారి దళమినటు మెరసిన సాత్యకి । శూరసేన బలమూ
గదిసినంత నా బలముల నెల్లను । కడకు బారదోలీ
అట కళింగులను గండడగించి ప్ర । స్ఫుట చిత్తముతోడా
మడుగునుండి దరిజేర సింధురము । మాటికి వచ్చుచున్నా
సాత్యకి గని హరి పార్థునితో కడు । సంభ్రమమున ననియే

కృతవర్మాదుల నెల్ల జయించెనో । నతిధీరత నొకడూ
సేనలెల్ల దప్పించుక నేడ్తెర । జేరె నొకడు నిటకూ
ధర్మజు పనుపున నీ స్నేహముకై । దరలివచ్చె నిటకూ
సాత్యకి భుజగర్వం బింతని యన । సాధ్యమగు నె మనకూ
అనిన గృష్ణునకు నింద్ర నందనుం । డనియె నితనిరాకా
నా కప్రియమై దోచె నిక్కముగ । నది యెట్లంటేనీ॥

వచనము—

వాసుదేవా విన్నవింతు వినుమని యిట్లనియె॥

హిందూస్తాని తోడి — చాపుతాళం

ఖగరాడ్వాహన - కౌంతేయాగ్రజు ।
డగణితశౌర్యం - డత డెట్లుండెనో ॥ఖ॥
దిగులు బనించె యు - ధిష్ఠిరు దలచిన ।
పగవా రాతని - బట్టుదు రేమొ ॥ఖ॥
ధర్మజుగావ సా - త్యకి నట నిల్పితి ।
నర్మిలి యీతడు - నాకడ జేరెను ॥ఖ॥

వచనము—

దేవా ధర్మజుం డేమగునో నెఱుంగ రాకున్నది భారద్వాజు బారిం బడి యుండె యిచ్చట సైంధవుండు నేలకు వ్రాలండు బ్రొద్దునుం బెద్దయు వ్రాలెనది యట్లుండ బలసారోదారులైన గురు కృతవర్మాదులగు ననేక యోధవీరులతోడం బోరి యిప్పుడు పార్థపరుండు దపిం బడి దెప్పిరిలి వచ్చె నిప్పుడు కయ్యంబున డయ్యనివాడును సహాయసంపన్నుండగు భూరిశ్రవుం డదెవచ్చుచున్నవాడు గాన నక్కురుసింహుండు.

## రగడ

శక్తి ధైర్య వీర్యంబులు గలిగిన । శౌర్య సమగ్రుండూ
గావున నిది సత్యక తనూజునకు । కడు దెప్పరమైనా

తెరగు నుండె కౌంతేయాగ్రజు డీ । ధీరు నిటుల బంపే
యేడ్తెర గురు డట ధర్మజు బట్టగ । నేచియున్న వాడూ
యేమి దోచ లేదీ రెంటికి నే । నేమి జేతు కృష్ణా
అనెడి తరిని భూరిశ్రవుండు న । త్యధిక రోషముననూ
సాత్యకి కడ్డంబై నిలు నిలు మని । సరగ నిట్లులనియే
నిను బంపించిన పాండవాగ్రజున । కును దలవంపులుగా
నిను గని సంతోషించు శౌరికిని । తనువు ఝల్లనంగా
నిను గెలిపించెడి యాస నున్న య । జ్ఞునునకు నా లావూ
తెలియ నాయుధంబుల రథ్యంబుల । దెగటార్చెద సూతూ
నీ తనువున శోణితము నింపెదను । నిలువు మెటుల జనకా
భూరిశ్రవు డిట్లన విని సాత్యకి । పొంగుచు నవ్వియునూ
నాతో సమరము జేయగడంగిన । యాతడె బంధువుడూ
వినవే మీకే వేరు విత్తునె । వెలసిన వీరుడనూ
నాయెదుటకు రా వెరచి దూరముగ । బోయి యుండనేలా
పెచ్చు పెరిగి యా వలవని మాటల । ప్రేలెదేల నిన్నూ
యిత్తరి నాలుక గోసెద మానుము । రిత్త ప్రలాపములా
అనియిటు లిరువురు బరుసము లాడుచు । ననికి దారసిల్లీ
పలురీతుల వాలమ్ములు నొండొరు । పై నిగిడించుచునూ
ఒకరొకళ్ళ మార్గణములచేతను । ఒక రొకళ్ళనేయా
కవచంబులు వ్రయ్యలుగా జేయుచు । కార్ముఖములు విరచీ
తనువున శోణిత ధారలు గురియగ । తగ నిర్వురు బోరా
తురగంబుల వారణ సారథులను । యరద చయంబులనూ
భట సమూహముల ధ్వజముల నరుకుచు । పరువడి నిర్వురునూ
కరవాలంబులు బలకలునుంగొని । గర్వోద్ధతు లగుచూ
పాదచారులై చిత్రగతుల రణ । భారంబులు బూనీ
మల్లయుద్ధ మొనరించుచున్న యూ । మాధవుండు గనియూ
పార్థా మన శైనేయున కీ యుని । భారమయ్యె నిపుడూ

భూరిశ్రవుడే మేలుచేయిదై । పోరాడుచునుండే
మన సాత్యకి పెనుసైన్యంబులతో । మరిమరి పోరాడీ
మిక్కిలి డయ్యూట భూరిశ్రవు చే । జిక్కి శ్రమంబొందే
నినుగావను గద నతిశ్రమచే వ । చ్చిన వా డీతండూ
సింహాము బారింబడిన సామజము । చెలువు నయ్యె నితడూ
గావున చేకొని గావ వలయునో ॥ గాండివి యీతరినీ॥

వ చ న ము—

మరియు కృష్ణుం డా యర్జునున కిట్లనియె.

మలయమారుతము — రూపకము

ఆపదసమయం బిదియే – గాపాడగవలయు వీని ।
ఓ. పాండవ ముధ్యమ యిత – డోపికలే కచట జిక్కె ।
యీాపగిదిం జూచుచుంట – యెంతయొ పెను మోసముగాను।
పాపియైన భూరిశ్రవు – పాల్బడె నా యనుజు డిపుడు ॥ఆ॥
ఆశినిప్రవరుం డీయడ – నరిచే నట పట్టుబడియె ।
నీ శిష్యుడు బంధుడు గద – నీవే రక్షింపవలయు ।
ఓ శశివంశాధ్యక్షా – నూరకుంటమే తానే ।
నీ శరముల పాల్జేయుము – నీచుని యాభూరిశ్రవు ॥ఆ॥

వ చ న ము—

శ్రీకృష్ణుం డర్జునున కిట్లు దెల్పుచున్న యడ నచ్చట.

రగడ

భూరిశ్రవు డా సాత్యకి బట్టియు । పుడమిని బడవైవా
క్రిందై యాతడు యోపినంత శ । క్తిని బోరుచునుండా
హరి గని పారునితో నిట్లనియెను । అయ్యో నీ కొరకూ
దోడ్పడ వచ్చిన నీ శిష్యుండిట । దురవస్తను బొందా
నూరకుంట మేలగునే యన విని । సారస నాభునితో
దేవా యాదెస జూడరాక మరి । దేహుఁ లగుము లెల్లా

పై పై గ్రమ్ముక యుండె పోను గ । స్ఫుటంలేదు కృష్ణా
శరమెటు లేయగ దోచకున్నదా । నిరుతిట్టలలోనా
జొచ్చిన శిష్యుడు నెచ్చెలి జావును । జూడజాల కిపుడూ
రథికుల వారించెద శైనేయుని । రయమున గాచెదనూ
అని నరుడను చున్నంతనె యచ్చట । నాభూరి శ్రవుడూ
చాల డస్సి యున్నట్టి సాత్యకిని । చయ్యన బడవైచీ
యురమును వలచేయిని నేడ్తెర తన । నిరుగాలను ద్రొక్కీ
మణికంకణ కిరణములు మెరయు ద । క్షిణ కరమున నతడూ
ఘన కృపాణ మెత్తియు శైనేయుని । కంఠము దునియుటకూ
వేను దలంచియు పైకెత్తిన భుజ । మింద్ర ధ్వజముబోలే
నిలిచినంత వేనుకల నుండిరట । నీ సైనికు లెల్లా
అప్పుడు నీరజ నాభుడు గన్గొని । నతి వేగిరముననూ
వేయుమేయు మని కేకలు వేసిన । విస్పష్టాం డపుడూ
మనమున భూరి శ్రవు నగ్గించుచు । మార్గణంబు దొడిగి
ఆకర్ణాంతము లాగి విడువగా । నతి రయమున జనియూ
భూరిశ్రవు దక్షిణ భుజమారణ । భూమిం బడనరకా
అటబడి భూరి భుజంగ మొయు । ను నటు నది శోభిల్లగనూ
అచటిసేన లెల్లను దురపిల్లిరి । నా సమయంబుననూ॥

వచనము—

అంత నా భూరిశ్రవుండు తన భుజంబు నరికినవాడు గాండీవిగా నెరింగి తీరని కోపంబున గర్హించు మనంబుకో నతని దిక్కునూచి తగు నెలుంగున నిట్లనియె.

మధ్యమావతి — ఆటతాళం

తగునా - పార్థ ॥త॥ తగునె మగతన మిదియెనేనీ - మొగము దెసగన కుండగను యీ ।
నగధరుని సోదరునితో జో - రగను మగటిమి జూపితివి యిది ॥త॥
ధర్మమును కడద్రోసి నీవు య - ధర్మమును నొడిగట్టు కొంటివి ।

కర్మరహితుని తమ్ముడవు యీా - ధర్మ మెట్టుల దోచునో యిది ॥త॥
శరగురుండో యింద్రుడో పుర-హరుడో మరి యింకెవ్వరోయీా ।
తెరగు గరపిరొ సరసిజోదరు-డరయ యీా పాపమున కోర్చెనె ॥త॥
ధరనునుల్చి పురీశుడౌ శం - కరుడు విన్నను మెచ్చునేయీా ।
పరమ నీచపు కార్యమునకై-పాలు బడితివి రాజువై యిటు ॥త॥

వ చ న ము—

భూరిశ్రవుం డిట్లు నిందించుచున్న విని యర్జునుండా బాహ్లిక పౌత్రుని తోరణంబున జొచ్చి రాజులు బోరుచుండు నెడ బంధు జనులు దోట్పడుట నీచకార్యంబే పగవారు నిన్ను జంపగ గావలేని నీ బంధుల దూరము సాత్యకి యతిశ్రమ మొందినచోట దాకి కష్టపరచి చంపెదు వినుము.

## రగడ

నీ చేతను యీా సాత్యకి జచ్చె । నె నేను గలిగియుండా
నేను లేనియెడ మీారందరు । నా సూను ధర్మము నా
తెంపుజేసి చంపిన దెరుగవె యీా । తెరగున బల్కెదవూ
ఆ నరు డన విని నిరుత్తరుండయె । నా భూరిశ్రవుడూ
అప్పుడు దను నీ కొడుకులు గొందరు । యవనీ పతులచటా
నిందించిన యీానృపతుల । చందంబుల నుడివీ
భూరిశ్రవును పలక్షించియు మది । భూరి శోకముననూ
అతని కుందు మాన్పగ దలంచి యి । ట్లనియె ధనంజయుడూ
క్షత్రధర్మమున గలిగిన కీడున । సాహసింపవలసే
అయ్యయ్యో నీ యట్టి మహాత్మున । కధిక పీడజేయా
వలసెనా ప్రతిజ్ఞను నీ మనమున । దనవు మెల్లవిధులా
అన్నిటికిని మూాలము దుర్యోధను । డిన్ని మాటలేలా
ఆనరపతి నరకమున గూల గ । లండు నిశ్చయముగా
నీవు సద్గతిని బొందెదవన విని । నిర్మల మానసుడై
భూరిశ్రవుడా శైనేయుని సం । పూర్ణంబుగ విడిచీ

అపసవ్యపు కరమున శరమునుగొని । యాత్మవిడువనుండీ
ప్రాణాయామ పరాయణుండను । బూనియున్న యడనూ
తనువున కుత్సాహంబుగల్గి సా । త్యకి యంతట లేచి
కరవాలముగొని భూరిశ్రవుపై । గదిసి కోవుచున్నా
కృష్ణార్జున భీమాశ్వత్థామలు । కృప కర్ణాదులునూ॥

వ చ న ము—

అట్లు కరవాలంబుగొని భూరిశ్రవు కడకేగుచున్న సాత్యకిని కేకలు వేయుచు నిట్లనిరి.

దేవగాంధారి రాగం — ఆదితాళం

వలదూవలదూ సాత్యకీ-యిటు ద్రోహ కార్య మొనరింపగ నటుజన॥వ॥
ఖలునిరీతి కరవాలము బూనుక-చలమున నేగెను-గళముగోయుగా॥వ॥
తులువతీరు బరుగిడెదవు నీవీ-యిలలో బహునిందకు బాల్పడెదవు ॥వ॥
యిట్టి ఘోరకృత్యం బొనరించిరె-యెట్టివారలైనను మును ధరలో ॥వ॥
ఝట్టిననుచు బొంగెదవేమో నీ - యట్టి వారలకు దగవగునేపో ॥వ॥

వ చ న ము—

ఇట్లందరు మెలుగెత్తి వారింప వినక క్రోధోన్మాదంబున బోయి భూరిశ్రవు శిరచ్ఛేదంబు జేసిన నతండు సిద్ధచారణ గణాభి నందితుం డగుచు బుణ్యాలోకంబున కరిగె నప్పుడు శైనేయుండు దన్ను వారించిన వారి కిట్లనియె.

## ర గ డ

ఘోరకృత్యమని కేకలు వేతురు । మీారందరు వడిగా
కౌరవులే న్యాయంబున జేసిరొ । కయ్యము నానాడూ
అభిమన్యుని యే ధర్మపథంబున । నవని గూల్చివారో
మోసకృత్యమున పదుగురొక్కటై - జేసిన క్రూరమునూ
దలపవలదె మనమున సుంతైనను । ధర్మపరాయణులూ
అని బల్కుచునుండెకి సమయంబున । మన సైనికులెల్లా
యిది దగునేయను వారలు కొందరు । విధివశమునువారూ

పలురీతుల ననుచుండి రనుచు భూ । పాలునకును దెల్పా
విని ధృతరాష్ట్రుడు సంజయుతో ని । ట్లనియె నూ తనయా
భూరిశ్రవ సాత్యకు జరిగిన । పోరు వింటిగానీ
అటమీదట సమరంబెటు జెల్లెనొ । నదియు దెల్పు మనినా
సర్వము వినిపింపగ దలచెను యా । సామజపురి పతికీ
సౌమదత్తి బడిపోయిన పిమ్మట । సంభరంబుననూ
నరుడు రథము సైంధవుని దెసకుజన । నడుపబంచె నపుడూ
గురుసుతాది యోధులు బలు రథికులు । కురుపతి మొదలుగనూ
అడ్డపడిరి నరనారాయణులకు । నట్టి సమయముననూ
కర్ణ సాత్యకుల కచ్చట ఘోరపు । కయ్యము దలపడియె
అప్పుడు కృష్ణుడు సర్వమెరింగియు । ననుజునకును మరియూ
సాహాయ్యము జేయుగ దలంచి నిజ । సారథి దారకునీ
పార్థప్రతిన నెరవేర్పగబూనిన । పలుకు నెపంబుననూ
రథము నెల్లి దోలుక రమ్మనియును । రయమున దా వచ్చే
ఆ కారణమున పాంచజన్య రవ । మద్భుతముగ జేయా
ఆ నినాద మాలించి దారకుడు । నరదమునకు నపుడూ
అపుడు శైబ్యసుగ్రీవ మేఘపు । ష్పక వలాహకములా
యనెడు వాహములబూన్చి గరుడకే । తన మెత్తించియునూ
అతివేగంబున దేరుదోలుకొని । యచ్చుతు జేరగనూ
అచ్చెరువందుచు దారకునిం గని । మెచ్చుచు హరియపుడూ
సాత్యకి కొసగిన గని ధనంజయుడు । సంతోషింపగనూ
సన్నద్ధుండై నరునకు సాత్యకి । సాహాయ్యంబుగనూ
కౌతుకమున జనుచుండ నడ్డమై । కర్ణుడు దాకగనూ
అక్కిరీటి గని వనజనాభుతో । నవ్వుచు నిట్లనియే
సౌమదత్తి జచ్చుట సైరింపక । సరగ రాధ సుతుడూ
మన సాత్యకితో బోర దొడంగెను । మనము దడయజనదూ
అనవిని మురమర్దను డిట్లనియెను । నతడొక్కడె జాలూ
అదియుగాక మన చక్రరక్షకులు । నతనికి దోడైరీ

గావు నక్కడిచింత వలవదని । కమలాక్షుడు దెల్పీ
తేరు సైంధవుని దెసమర్పగని । యా రాధేయుండూ
శైనేయునితో బోరుచుండగా । సర్వబలము లపుడూ
వెరగున జూచుచునుండి రప్పుడా । వీరుల కిర్వురకూ
సురదానవ గంధర్వాదుల యడ । జూడ నుట్టిపోరూ
పోరిపోరి శ్రీకృష్ణు తమ్ముడు । భూరిశక్తి నత్తీ
వైచి రాధజుని తనువు శోణితము । వఱ్ఱుగ గావించి
తురగములను సారధిని సిడముంలెస । ద్రుంచి రధము గూల్చీ
శ్వేతచ్ఛత్రంబును చామరములు । భూతలమున గూల్పా
తమ్ములు రాజులు జూచుచుండ చి । త్రముల పార్థివులూ
జొచ్చి వేగమున సాత్యకి రధమును । జుట్టుముట్టినంతా
శరవేగంబున సాత్యకి వారల । బరపె కౌరవేశా ॥

వ చ న ము —

సంజయుండిట్లు దెల్ప విని ధృతరాష్ట్రుండా సూతున కిట్లనియె.

బేగడ— ఆదితాళం

యింత యధికుడాయనా - సాత్యకి నే ॥డిం॥
యెంతవారలైన - నెదిరింప రారేమొ ।
పంతముతో నంగ - పతిని భంగపరచె ॥యిం॥
తేరురధ్యములు - సారసాక్షుని వౌట ।
దారకుడా శౌరి - సారధి యగుటను ॥యిం॥
పొందుగ శ్రీవుల్చి - పురమున వెలయు బా ।
లేందు ధరుడీతని - యిందున లేకున్న ॥యిం॥

వ చ న ము—

అన విని సంజయుం డతని కిట్లను అట్టియెడ మున్ను దారకుండు దేరు దెచ్చుట నది కృష్ణుని పనుపని యెరుంగక గయ్యంబునకేగి సాత్యకిం దాకుటయు శైనేయుండా దారకుండు దెచ్చు రధంబెక్కుట

గని నీ కొడుకులు కర్ణుని రథారూఢుం గావించిరన విని యాంబికే యుండు గిరీటింగలిసి భీముం డేమొనర్చెనని యడిగిన సంజయుం డిట్లనియె.

## రగడ

కర్ణునిచే నవమానింపగ బడి । కురువలి నందనుడూ
చిన్నబోయి పార్థుని కడకేగియు । మిన్నక యుండియునూ
కొంత దడవునకు భీమసేను డతి । కోపమానసమునా
కర్ణుడనిన యవమానపు నుడువులు । కవ్వడికిం జెప్పి
వానిని మార్కొని యేవిధినైనను । బూని వధించెదనూ
అనవిని నరుడా మాటలు నాచెవి । వినవాడుట నెల్లా
నన్ను బలుకుటలు గాక నీకుయే । మున్నది నట నిలుమూ
అని యిటు దెల్పియు రాధేయుని రథ । మున కభిముఖుడయ్యా
ఓరి కర్ణ భీముని నటులేటికి । దూరితివట జెపురా
అతడు దోల సిగ్గరుగక బారితి । వా నాడని లోనా
నిన్నపు డెవ్వరు దిట్టిరి దెల్పుము । నిజముగ రాధేయా
కదన మొనర్చెడి వేళ దప్పిదము । గల్గిన దిట్టుదురే
యింత గర్వమేల రమును నీ వే । గిన దెరుగవె సూతా
యింతయేల సాత్యకి నిన్నిచ్చట । నిపుడె గెల్వలేదే
గెలుపోటములును సంగరమందున । గలుగు నెవరికైనా
యిట్టుల బల్కుదురే తగు వారిని । నెట్టి వారలైనా
తులువా నీకుల గుణ ధర్మంబులు । దోచె ప్రజలకెల్లా
నేను లేనియెడ జూచి యధర్మము । బూని నాదుసుతునీ
వెనుక భాగమున నిల్చి దొంగవలె । విల్లు ద్రుంచితివిరా
అందుకు ఫలితము ధర్మము దప్పక । ననుభవింపజేతూ
నీవుజూడ వృషసేనుని మస్తక । మిల బడగూల్చెదనూ
నీ తోడను యట ద్రోహ మొనర్చిన । నీచుల నందరినీ
నిన్నెటుల జేసెదనో జూడుము । నీచ పరాయణుడా
అనుచు దరిమి నంతను మనసేనల । నర్జునిపై గలియూ

అట్టి సమరమతి దారుణమై గను । పట్టెను భూపాలా
అంతగ గనమణి మందస్మితుడై । యగపడు చుండగనూ
ఆయెడ నట దుర్యోధనుండు । రాధేయున కిట్లనియె
సాత్యకి భీముడు నిరుదెస జనగా । సవ్యసాచి యపుడూ
సైంధవు దెస నేడ్తెర దరిమె దరిట । జనదు తడవు సేయూ
యించుక ప్రొద్దిట బెనగుచుండగా । నినుడు హా స్తమించూ
గాన నీకు దోడుగ శల్యుని గురు । సూనుని గృపునొక నీ
దుశ్శాసనుడును నేను నేడ్తెరను । దోట్పడి నతనికినీ
చేయార్పగ వలనౌనె విజయునకు । చేటు గాలమైనా
ప్రతినబట్టె గావున యాతని దో । ట్పాటున సోదరులూ
చనినయంత యీ రాష్ట్రం బెల్లను । మనమె నేల గలమూ
అంగరాజ నీ చలము బలము జూ । పంగవలయు నిపుడూ
అన విని కర్ణుండా మానవ పతి । నాలోకించియునూ
నరవర భీముని బాణ పాతముల । నాతను వంతయునూ
చాల నొచ్చియున్నది యైనను యీ । సమరంబున కేగి
భూవరబేర్చెద నార్చెద నర్జును । బోకార్చెద నిపుడూ
అనవుడు దుర్యోధనుడు ప్రీతుడై । నట్టి సమయమునసూ
సాత్యకి భీముల సాహాయ్యుండై । సవ్యసాచి మరియూ
భల్లాది ప్రముఖాస్త్రంబుల నీ । బలముల్పై బర్వా
నలుదిక్కుల చతురంగ బలంబులు । బొలియుచుండు నంతా
దుర్యోధన వృషసేన కర్ణులును । దోడ్తో వెడలగనూ
శల్యకృపాశ్వత్థామలు గడగిరి । సాయుధములతోడా
ఆజయద్రథుని దరిమి పోవున । యర్జును మార్కొనియూ
తీవ్రశరంబులు బరగించిన నవి । కివిరి నొక్కటొకటీ
పెక్కు తునియలుగజేసి యందరిని । నొక్కమ్మడి దరుమూ
అందరొక్కటై ఒక్కొక శరమున । హరి నరులను గొట్టా
పెక్కు నారసంబుల నొక్కొక్కని । స్రుంక్కించియు నరుడూ
సైంధవు దెస జనుచుండగ గో । పాంధత గర్ణుండూ

అడ్డపడిన పదియైదు నిశిత బా । ణంబులు నర్జునుడూ
మూడు శరంబులు వాయు నందనుడు । మూడు శిని వరుండూ
కర్ణునితనువును గాఢ నేయగా । కర్ణుడల్గి మరియూ
అరువది యరువది నా రసముల ము । వ్వుర నొవ్వగ నేయూ
అప్పు డర్జునుడు నూరు సాయకము । లా కర్ణుని గప్పా
అతని తనువు శోణిత ధారలు గురి । యగ రాధాత్మజుడూ
అట్టి నూరుశై దడరించిన గని । యర్జునుండు వడిగా
కర్ణుని విలు దునుమాడి వక్షమును । గాఢనేసి మరియూ
జీవములం గొనునట్టి విశిఖ మే । సిన గని గురుసుతుడూ
అర్ధచంద్రసాయకమున గూల్చిన । నా రాధాత్మజుడూ
వెంటనే తీవ్రశరంబులు బరపిం । విజయుం డది గనియూ॥

వ చ న ము—

మరియు కర్ణున కర్జునుం డిట్లనియె.

ఆరభిరాగం — ఆదితాళం

నిలు నిలు నిలు నిలురా ఓరోరికర్ణా ॥ని॥
చలమున తీవ్రంబగు నా రసములు ।
బలిమి మెరయ బరగించితివోరా ।
తులువ నీ మదికి నే నెవండనని-దెలియ వేమొ నర్జునుండ నీవిట ॥ని॥
నాడు విరటు పట్టణమున గోగ్రహ ।
ణంబునాడు నీ బల శౌర్యంబులు ।
యేడబోయె నీ సమరంబున మొన-గాడ వనుచు వచ్చితివోరోరా ॥ని॥
ధారుణిలో చప్పిడి పున్నయ చా ।
దరిని నేలు శంకరు డెరుంగడా ।
వోరి వోరి మాశైనేయునిచే - బారి పోతి విప్పు డిప్పుడే గద ॥ని॥

వ చ న ము—

అర్జునుం డిట్లనుచున్న విని యతం డర్జునా కర్ణునెరుంగవే యనుచు ననేక ప్రదరంబుల బొదివె నట్టియెడ.

# రగడ

అయ్యిరువురు నొండొరులతో బోరెడి । నట్టి సమయమునను
సురలగ్గించిరి గంధర్వులు బాగ । డిరి యంబరమునను
అత్తరి కురుపతి తనవారికి నెలు । గెత్తి కేకవేసీ
రాధాసుతునకు దోట్పడు మనుచును । రయమున బంపగను
అపుడు గిరీటి మహాగ్రత నెంతయు । నా కర్ణుని గదిసీ
అశ్వవ్రాతముగూల్చి సూతుతను । వల్లన దున్మాడీ
పవితుల్యాంబక నిహతిని యంగం । బార్తిని నొందింపా
దర్పహీనుడై కుంభజు తనయుని । దరికిజేరి యతడూ
మద్రేశుడు దోట్పడ యేసెను నొక । మార్గణ మూనరుసీ
అంత గృపుడు వృషసేనుడు వారల । చెంతకు నరిగియునూ
పార్థు మేన దివ్యాంబక సమితిని । బరపినంతలోనా
ఆనల్వురమాటున బొంచుక యు । న్నట్టి సైంధవుండూ
విజయునిపై నిగిడించె క్రూరతర । విశిఖంబులు కొన్ని
వచ్చెడి నస్త్రచయంబు గూల్చి వి । వ్యచ్చుడు వేగమునా
శరజాలంబులు బర్వె నప్పుడా । సైంధవుపై వడిగా
గని సుయోధనుడు తన సేనలకును । కరము విసరినంతా
మొత్తములై విమ్యచ్చునిపై శర । ములు నిగిడించినను
గనలి గడంగి కిరీటి గాండీవ । ధ్వని మ్రోయించినను
ఆ నినదము యాకసమున బర్వియు । నలుదిక్కులు నిండే
ఘోటకస్యందన వేదండంబులు । గ్రూరాస్త్రంబులచే
భగ్నము గావించిన నీ సేనలు । బరచెను నల్దిశలా
మధ్యందిన మార్తాండుండోయన । మఘువాత్మజు డెలిగే
ఆరీతిని సైంధవుపై గవిసిన । నమ్మహారథుండూ
చలముమెరయ హాయ కేతన గాండీవ । ములను నరునిమేనా
ఛండతరంబగు నలుగులు గ్రుచ్చిన । సైన్యంబులు సురలూ
మెచ్చుచుండి రా సింధురాజు వి । వ్యచ్చు డంతలోనా
ఆ సైంధవుని వరాహధ్వజమును । నాతని సారథినీ

అక్కజముగ ధర బడనేసిన మన । ప్రక్క సేనలెల్లా
జలజపత్రమున నీటి చందమున । దలకుచుండిరధిపా
అప్పుడు నీ రధికోత్తము లందరు । నసువులకును రోసీ
సింధురాజునకు నడ్డముగాగను । జేరిన పార్థుండూ
సవ్యసాచి నెడగానక యుండెను । సైంధవు జంపుటకై
పార్ధుదిక్కు వీక్షించుట గన్గొని । పురుషోత్తము డనియే
జనదిక బెనగుట పశ్చిమాద్రికిని । నినుడు సేరబోయే
గాన దీని కొక సదుపాయము । నే గల్పించెద పార్థా
ఆ సదుపాయముచేతగాని బడ । డా జయద్రధుండూ
అది యెయ్యది యంటేని దెల్పెదను । నాలించుము విజయా
సూర్యమండలము మరువడజేసెద । జూడు తమముచేతా
గ్రుంకెడు చందంబున గనుపించిన । కురు వీరులు మరియూ
సైంధవాదు లతి ప్రమదము నుందురు । చాలప్రొద్దుగనియూ
కౌరవు లందరు నీ ప్రతిజ్ఞ భం । గంబయెనని యెంచీ
కయ్యపు వేడుక మానియుందు రతి । గాఢానందములా
విచ్చలవిడిగా నొండొరులను బల్ । మెచ్చుకొనుచు బొంగీ
చలగుచుందురా సైంధవ కౌరవ । జనములెల్ల నచటా॥

వచనము—

అప్పుడు నీ ప్రతిన దీర్చుకొమ్మని పలికిన విని మనోవ్యధం జెందు చుండు సవ్యసాచిం గనుంగొను సమ్మాధవుండు.

పూరికల్యాణి – చతురశ్రగతి

కప్పెను తిమిరము – కంజలోచనుడు ।
నుప్పరమున భాను తేజ మరువడ ॥ క ॥
అప్పుడు కౌరవు – లా సైంధవుడును ।
తప్పక మనముల – నుప్పొంగిరి యట ॥ క ॥
నినుడు గ్రుంకుటది – నిజమను భ్రమచే ।
తను మదముల యార్చిరి సేనలు వడి ॥ క ॥

వ చ న ము—

మన సైన్యంబులు నాప్పుచున్న హర్షాస్పదుండై సింధుపతి పడమర దిక్కు నిక్కి చూచుచుండె నట్టియెడ.

## ర గ డ

అరథముపై నిలువంబడి సైంధవు । డఝ్ఝపైకి నెత్తీ
పడమర దిక్కున జూచుచున్న యడ । పద్మాక్షుడు గాంచీ
ధనంజయునితో యిద్దురాత్మ సైం । ధవుని శిరము ద్రుంపా
తడవుసేయ దగదింక వీని మ । స్తకము నరుకు మనినా
అతడు గంధమాల్యార్చితమై దొన । యందు మెరయుచున్నా
శితశరంబును గ్రోద్ధతినేయగ । చెచ్చెర జనుదెంచీ
డేగ పులుగుగొను క్రియ సైంధవుపై । నేగి శిరమునరికే
అదిగని శ్రీహరి సత్వరుడై న । య్యర్జునుతో ననియే.
పార్థపార్థ సైంధవు తలనిలపై । బడిన ముప్పు వచ్చూ
గాన నిభంబున నిల్పుము దానికి । కారణ మెరిగింతూ
అనిన నతడు పటు శరముల శిరమును । నవని వ్రాలకుండా
ఆకసమునకును దాపట వెలుపటి । కపర భాగమునకూ
ముందు వెనుకలకు నడిపె శిరంబును । కందుక మోయనగా
అట్టియెడను మా యాతి మిరము జను । నంతలో భానుండూ
యెప్పటివలె దోచిన గని నీ బల । మప్పుడుగ్ర తనుడై
గదిసి నిసిత బాణము లానరుపై । గప్పిన యంతయునూ
అన్నిటి దూలించుచు యాశిర మే । మరక యుండీ రపుడూ
చిత్రముగా విక్రమ విహారమును । జేయుచుండి మరియూ
దానవ భంజన యీ శిరమెంతటి । తడవు నిల్పవలెనో
దీని నభంబున నెటుల నేయుదునో । తెల్పుము మురవైరీ
యీ మస్తకమిటు నిల్పగ కారణ । మెరిగింపుము బావా
అన విని దెల్పెద వృద్ధక్షత్రుం । డను నృపవర్యుండూ
సింధుదేశమున కధి నాథుండై । చెలగుచు నాతండూ
సంతానముకై తప మొనర్చి యీ । జయద్రథుం బడసే

యితడు కోపయుక్తుడై వర్తిలుచును తన । యింటనున్న యడనూ
ఒకనాడాయ శరీరవాణితా । వ్యోమంబున నుండీ
పలికె వీడు సంగరమున నేమరి । తల దునుమం బడునూ
అన విని వృద్ధక్షత్రుం డిట్లనె । నందరు వినుచుండా
వీని శిరం బెవ్వడు యీ మహిబడ । నేసే వాని శిరమూ
శతశకలములై నుర్వింబడు నని । శాపమిచ్చి యతడూ
యీ సైంధవునకు పట్టము గట్టియు । నేగె తపము కొరకై
యితని శిరము ధరపై బడకుండగ । నెట్టులైన గానీ
వృద్ధక్షత్రుని తొడపై బడునటు । విసరుము సాహసివై
పాశుపతాస్త్రము చేతగాని యది । పడదు యతని మోలా
అలశమంత పంచక సమీప మం । దాతడున్నవాడూ
ఆమహనీ యాస్త్రము కడు భక్తిని । నాశ్రయింపుమని నా
అర్జును డట్లొనరించిన వచ్చియు । నా దివ్యాస్త్రంబూ
శిరముం గొని చని యతని తొడలపై । చెచ్చెర వైచిననూ
జపయుక్తుండై యుండి నతడు శిర । స్పర్శనంబు వలనా
యేమోయని దిగ్గున లేచిన శిర । మూ మహి బడినంతా
పగిలి వృద్ధక్షత్రుని మస్తము శత । పరిలయ్యె నధిపా
అప్పుడు పార్థుని నగ్గించెను మరి । నంభోజాక్షుండూ
సకల భూతచయమెల్లను నద్భుత । సంతముల బొంగే
సవ్యసాచి యా పాశుపతాస్త్రము । సంహరించె నపుడూ
సైంధవు తలపై నడిపెడి శక్తిని । సైన్యంబులు గనియూ
వెరగున నుండిరి రధికులు దొరలును । విస్మయులైరంతా
తల భూమిం బడునంతకు సైంధవు । తనువు దేరిపైనా
నిలిచియుండె తల బడ తను బడియెను । నీ సుతులందరునూ
కన్నీళులు నించుచు శోకించిరి । గలన సేనలెల్లా
నందనందనుడు సవ్యసాచి యా । నందంబుల బొంగే
పవననందనుడు సింహనాద మొ । ప్పార జేయ నపుడూ
విని యుధిష్టిరుడు విజయు జయంబని । వేడుకతో నుండే

ఉల్లసిల్లిరాతని సైన్యంబులు । యోధులెల్ల నలరే
అచ్చట నాప్పులు దూర్యరవంబులు । నద్భుతముగ జెలగే
ననుచు సంజయుం డా ధృతరాష్ట్రున । కును నెరిగించెననీ
వైశంపాయను డా జనమేజయు । వసుధీశున కనినా
విని యవ్వలి వృత్తాంతము మునివర । వినిపింపుమటనియే॥

వ చ న ము—

వైశంపాయనుం డా జనమేజయున కిట్లనియె నట్లద్భుతోదారంబగు నరనారాయణుల విక్రమ విహారంబు విని వెరగంది యాంబికేయుండు సంజయు దిక్కు మొగంబై యిట్లనియె.

మోహనరాగం—ఆదితాళం

వినుమా సంజయా – ఓ – విమలహృదయ సూతవంశరాయ ॥వి॥
వినిపించితి వా సైంధవు వధ నే – వినంతనె హృదయ మవిసెనిప్పుడు।
నని నడ్డమువచ్చు యోధవీరుల – పని వడి నొక్కండేదో లెనుగద ॥వి॥
కవ్వడిచే సైంధవుండు మడిసిన – కౌరవు లెల్లిరో యని నాలో ।
నొవ్వు గల్గె నేమిసేయువాడను – నవ్వలి కథయెట్లో వివరింపుము॥వి॥
పరగ నుల్చిపుర వరమున వెలసిన-హరుని కరుణలేకను మనవారలు।
మరణంబులపాలైరి యింతకును – మందుండగు దుర్యోధనుచేగద॥వి॥

వ చ న ము—

యివ్విధంబున బొగలుచున్న నాంబికేయునకు సంజయుం డిట్లనియె.

## రగడ

కృపు డశ్వత్థాములు గడంగియును । క్రీడిని మూర్కొనియూ
శరవర్షంబులు గురిపించిన యవి । సవ్యసాచి ద్రుంచీ
కుపితుడు గాకను విశిఖ కోటులను । కృపుని గప్పినంతా
రుధిరము గ్రమ్మిన మూర్ఛ వచ్చి తన । రథముపైన నొరిగే
అదిగని సారథి రథము దోలుకొని । యవ్వలికిం జనియే

ఓర్వజాలకను యశ్వద్ధామపు । డోహటించి దొలగే
తక్కిన యోధులున్పై జన జాలక । నక్కడనే నిలువా
కృపుడు తన శరంబుల మూర్ఛిలుటకు । నపుకు నసుదువగవా
కంసాంతకుడా సవ్యసాచినిం । గౌగలించు కొనియూ
మరదీ కురుబలముల గెలువగ సుర । వసులకైన వశమా
పోర గెల్చితివి బహుబలంబును । బొగడ తరమె విజయూ
కర్ణుని నోర్చిననాడు నిన్నుగని । కడుప్రియ మందెదనూ
అని కొనియాడు జనార్ధను గని మా । హాత్మా నా ప్రతినా
నీ సత్కారుణను గాదె నెరపితిని । నీరజ భవ వినుతా
పాండవులకు విజయం బెప్పుడు నీ । భారమె గద కృష్ణా
అన విని మందస్మిత వదనుండై । యతని కిట్టులనియే
భానుడు గ్రుంకుచునుండె జూడుమో । పార్థా మన మిపుడూ
ధర్మజు జేరగ బోవలె మన మిట । తడవు సేయదగదూ
అనవిని పార్థుడు గదలి నంత భీ । మాదులు సాత్యకియూ
సముచిత సల్లాపంబుల నడువగ । శౌరి నరుని తోడా
కంటివె గరులు రథంబు లశ్వములు । గాలు బలంబులునూ
నరువను లస్త్రచయంబులతోడను । దొరగియుండి రచటా
నీ బాహాబల సంపదగాదే । నిటు లొనర్చె విజయా
అని యగ్గించుచు సమయోచితముగ । నని జాలించియునూ
అయుధిష్ఠిరాదుల సమీపమున । కరుదెంచియు నచటా
పాంచజన్యమును బూరించిన విని । పాండవాగ్రజుండూ
తను సమరము జాలించి రథము డిగి । తగుహర్షాశ్రువులూ
గ్రమ్మదేర తన కరముల నొత్తుచు । నమ్మహీవరుండూ
సంభ్రమ మొసగగ నెదురు కొనుటయును । సవ్యసాచి హరియూ
పాదచారులై వచ్చి ధర్మజుని । పదములకును మ్రొక్కా
అయ్యెడపుర నా లింగన మొనరించి । నయ్యర్జును కనియో॥

వ చ న ము—

మరియు ధర్మజుం డిట్లనియె.

జంఝూటి - ఆటతాళం

తమ్ముడ విజయా వినరా - వినరా - వినరా ॥
తమ్ముడా విను నాకను - దమ్ముల కానందముగ ।
యిమ్మె నిను గనెడు భా - గ్యమ్ము లభియించెగద ॥త॥
చేనెత్తురు గాకుండగ - సింధుపతి గూల్చి యిటు ।
రానోచితి నాపుణ్యం - బీ నారాయణు కరుణను ॥త॥
భండనము కేగు నా - డండజ యానుడు నీ ।
యండ గల డనుచు నా - గుండె లదర వయ్యెను ॥త॥
పొందుగా ధర చప్పిడి - పున్న యాఖ్యు నేలిన ।
యిందుమౌళి కృప మన - యందాగల దింతకును ॥త॥

వచనము—

అని యర్జునునకు వాసుదేవుం జూపిన నయ్యదువల్లభుండు కౌంతేయాగ్రజా నీ కోపవేగంబున దుర్జనుండగు సైంధవుండు మడిసెనన విని యమ్మహీపతి యమ్మహాత్ము నుద్దేశించి యిట్లనియె.

## రగడ

దేవా సురులైనను వీవలిగిన । దేరి చూడగలరా
నీవు సర్వ కలుషములు హరించెడి । నీరజోదరుడవూ
అట్టి నీకు భక్తుల మాటను మా । కంతరాయమున్నె
అనియిటు గొనియాడుచు నుండగ భీ । మాది సాత్యకులునూ
తనువు గంట్లు గ్రొత్తలు మాయకనే । ధర్మజు కడకేగీ
పద తామరలకు భీమసాత్యకులు । ప్రణతులైనవారీ
గ్రుచ్చియెత్తి గాగిటను జేర్చుకొని । కుంభసంభవాదీ
కృతవర్మాదుల సంరంభము స్తు । తించుట బేర్కొనియూ
తక్కినవారలు మొక్కిన గనుగొని । తగిన తెరంగుననూ
గారవించగా తత్సైన్యంబులు । కడు మోదంబులనూ
కయ్యమునకు గాల్ద్రవ్వుచుండిరా । కౌంతేయుని బలమూ
ఓ కురువర నీ కొడుకచ్చట నతి । శోక వివశుడగుచూ

అంతర్గతమున ద్రోణ కర్ణులిటు । లడలుట గతమేమో
సురలకైన జనకంగవచ్చునె । శరగురు డలిగిననూ
అట్టివారల క్షీణపరాక్రమ । డైన క్రీడి నిపుడూ
యేమిసేయగా జాలరైరి యిది । యేమి హేతువయ్యో
అనుచును ద్రోణుని కడ కేగియు ని । ట్లనియె సుయోధనుడూ
శరగురువర మన వారలందరిట । నరునిచేత బొలిసే
సవ్యసాచి తన ప్రతిన దీర్చుకొనె । సైంధవు తలనరికీ
చెప్ప నోరురా దేమిసేతు నే । నెప్పుడుగురువర్యా
ఐన గాని పాండవ పాంచాలుర । నని దెగజూడకనూ
అందరిజంపిన రణమెటుదీరు న । యాచార్యానేడూ
నరుడు యనుగుబంటౌటను యాతని । బొరిగొన జనవీవూ
చాలబోరి రాధేయుడు సైంధవు । గోలుపోయె నేడూ
అని కటకటబడుచుండు సుయోధను । కాచార్యుం డనియే
ననుదూరిన ఫలమేమి యింతగా । ముదుదెల్పనె నీకూ
నరుని జయింపగరాని చోటులను । నెరుగబల్కలేదే
దేవకోట్లకైనను నజయ్యు డా । ధీరవిక్రముండూ
భీష్ముడు ప్రధనంబున బడునాడే । భీతిదోచెనాకూ
కౌరవులకు నిక బ్రతుకులేదనుచు । గలిగె మనములోనా
అభిమానము గాచుటకై బెనగెద । ననుమానంబేలా
నాటి శకునిచే యుద్ధసాల్లు యీ । నాటి గాండివమునా
శరము లగుచు నిను యార్తి యొనర్చెను । నెఱుగవేమొ నీవూ
అట్టివాని నే నెట్టుల మాన్పగ । నగును కురుకుమారా
విదురుడు వలదన సభలో ద్రౌపతి । నీడిచి తెచ్చితివీ
ఆమెను బరచిన క్రూరపాప ఫల । మనుభవింప వలదే
సభలో నీవును కర్ణుడు దుశ్శా । సనుడు ముచ్చారపుడూ
శీలవ్రతులగు పాండవులకు నట । జేసిన కీ డెల్లా
యెల్లభంగులను జెరుపదె మిమ్ముల । వేరె దలపనేలా
దయలేకను వారల కానలకును । దరిమిన జనివచ్చి

అయ్యాసగం బిల నిమ్మని వేడిన । నియ్యాకుంట జేసీ
మానుకయుండిరి వారల మార్గాన । నేనొక బ్రహ్మాడనే
యిన్ని యేల పాంచాలురు పాండవు । వీరే యెట్టులైనా ।
సమరము తలపెట్టక పోవరు వా । రమిత క్రోధములనూ
చలమునసే జని సమరములో । పాంచాలుర నందరినీ
చంపక నా కవచంబు విడువనని । శపథం బొనరించీ
నరనాథా నీ సేనలెల్ల సం । గరము సేయు నటులా
ఉత్సాహము గల్పించి సైన్యముల । ప్రోత్సహింపు మనుచూ
నెరుగ బలికి నరనాథా నేనొక । తెరగు విన్నవింతూ
అదియే మన పాంచాలురు నాచే । నని దెగమిగిననూ
అట్టివారి నందరిని జంపుమని । యశ్వత్థామకునూ
బోధించుము నీ వనుచు దెల్పియటు । బొమ్మని దెల్పియనూ

వ చ న ము—

అని దెల్పి కుంభజుండు గాఢ నిశ్చయంబున మున్ను గలగిపోయిన మొనలెల్ల నొక్క మొగముగ నొనరించి యనికి దలకొల్పిన గని దుర్యోధనుండు సమరోత్సాహ రహితంబగు మనంబుతో రాధేయుం జేరి యిట్లనియె.

జంఝూటి — ఆటతాళం

శరగురుని కృత్యమునకే మన - జాలనో రాధాత్మజా ।
అరులకే మేల్లేయు మాటల - తెరగు నున్నది చూడగా ॥శ॥
మోహరంబతి గాఢముగ తా - ముందుగా బన్నించియా ।
సాహసము విడనాడి పగతుర - సరగ జొర బంపించెనూ ॥శ॥
నరుని గెలిచెడి తలపులేదా - పరమ కోవిదమూర్తికీ ।
అరయ నాపై గీడు దలచిన - యట్లు దోచెను నేటికీ ॥శ॥

వ చ న ము—

దుర్యోధనుండా కర్ణునకు మరియు నిట్లనియె.

# రగడ

వం|్రటిగ జొచ్చియు నతుడు సైంధవుని । కంఠము దెగ నరికే
అతని కుంభజుడు వారింపగ లే । డది నిక్కము సుమ్మా
ముదుకని మాటలు నమ్మి సైంధవుని । మొనకు దెచ్చినామూ
యిట్టగు లెరిగిన సైంధవు నింటనే । బెట్టి వత్తుమయ్యా
ఫల్గునుపై నతి ప్రేమ గల్గెనా । భారద్వాజునకూ
గాన గురుని గొని పాండవేయులతో । కయ్యముదగదనినా
అనవిని కర్ణుడు దుర్యోధనునితో । నతని దూరనేలా
అతడు యోపినటు సమర మొనర్చెను । యూ చార్యుం డపుడూ
మనము ముందుగా జేయు పాప ఫల । మనుభవింపవలదే
అయోగ్యమనకను పాండు కుమారుల । నలసట బెట్టితిమీ
విషము బెట్టితిమి యిల్లు గాల్చితిమి । యింతిని యీడ్చితిమీ
కానల ద్రోసియు వారి నాశమును । గంటిమె యెప్పుడైనా
కుంతి సంతతికి నొక్కరి కైనను । అంతరాయ మున్నే
దైవము జంపెను మన సైంధవునిన్ । తగదు చింతసేయూ
పోరన విధియెటు నిర్ణయించునో । నారీతిని జరుగూ
గావున కయ్యమునకు వేనుదీయుక । గడను భూపాలా
అను నెడ నచ్చట పాండవ బలములు । నగ్గలికలతియూ
నీ సైన్యంబులు మార్కొని నంతనె । నిరు వాగుల కపుడూ
గడువరాని సంగ్రామము జరిగిన । గని నీ కొమరుండూ
సైంధవు చావున గలిగిన దుఃఖము । సైపజాలకతడూ
ప్రాణంబులపై నిరపేక్షుండై । బహుక్రూరత గడగీ
దాళ గనుంగొని ద్రోణకృపులు । రాధాత్మజు లెంతయునూ
వారింపగ నిలువక ద్రోచియు న । వ్వారల దలకడచీ
పాండవసేనల జొచ్చి క్రూరమగు । బాణచయము బర్వా
చతురంగంబుల పొలిపోకను రణ । క్షితినిం దొరగింపా
గని యాసేనల వీరులెల్ల సం । గరమున పతి గవియూ
అతడు భీమసేనాది రథికులను । నడలగొట్టి మరియూ

అంబరమగులగ నవ్వుచు సింహ నా । దం బొనరించగనూ
ధర్మజుండు క్రోధాత్ముండై తో । దండ మందు కొనియూ
సాయక మేయగ జాపము నుగ్గై । సరగధరం బడియే
వేరొక శరమున తనవు స్రుక్కి తా । తేరిమీద వ్రాలే
మూర్ఛిల్లుట గని పాండవ బలములు । మోదము లొప్పారా
చచ్చె జచ్చె కౌరవ రాజనుచును । శంఖారావములా
అద్భుతముగ మ్రోయించుచుండు రవ । మాచార్యుడు వినియూ
గదిసిన యడ దెలివంది నీ కొడుకు । కౌంతేయునిజూచీ
నిలునిలుమని రభసంబున దాకిన । నీ సుతుగని వారూ
దాకినంత నీ బలములు మార్కొన । దారుణ రణమయ్యే
అని సంజయు డిటుదెల్పిన విని కురు । జన వరు డిట్లనియే

వ చ న ము—

మరియు నాంబికేయుండా సంజయున కిట్లనియె.

శంఖరాభరణం — ఆటతాళం

యెఱిగింపుమయ్యా - సూత తనయు ।యె॥
యెరిగింపుమయ్య స - త్వర కుంభజుడు పగ ।
తురను వధించిన - తెరగెల్ల దెలియగ ॥యె॥
యిరు సైన్యములలో - పోరగల - వీరు లెవ్వారో
వెరపులేకను వార - లెత్తర బెనగిరో ।
శరలాఘవము లెట్లు - సల్పిరో వివరముగ ॥యె॥
యిలనుల్బ్బ పురి నీ - వెలసియు గౌరి - విభుడౌ శంకరునీ ।
తొలిబాము నెట్టి పూ - జలు సల్పితినో గాని ।
ఖలుని నా కడుపున - గని దుఃఖించగ వలసె ॥యె॥

వ చ న ము —

జెప్పుమనవుడు ధృతరాష్ట్రున కా సంజయుం డిట్లు జెప్పందొడంగె.

## రగడ

వుభయబలంబులు బరికొని పోరుచు । నుండ రయము మెరసీ
ధర్మరాజ ప్రముఖాది పాండవులు । దండనాయకులునూ

సాయకములు బరగించుచు గ్రమ్మరి । చాపగురుని మేనా
గని కర్ణుడు మొదలగు బలంబు లిరు । గడల నడువ గురుడూ
చెలరేగియు పాండవ సైన్యంబుల । నిల గూల్చుచునుండా
సామజ ఘోటక సారథి రథికులు । సమరభూమి బడినా
నెత్తు రేరులై బారగ సమరో । న్మత్తులగుచు వారూ
బోరుచుండ చాపాచార్యుం డతి । ఘోరాకారముగా
ధృష్టద్యుమ్నాదుల కేకయులను । దృఢతరముగ గొట్టీ
చిక్కినవారల చిక్కినట్లుగా । స్రుక్కించుచునుండీ
అతిప్రతాపశీలుండై సమరము । నందు దిరుగుచుండే
భానుమంతు జంపిన పగ మనమున । బూని యతని కొడుకూ
భీమసేనుపై వడిదాకియు నతి । భీకరాస్త్రములనూ
గప్పినంత బకమర్ధనుండు గని । కడువడి తన రథమూ
వాని రథముదాకగ దోలించియు । వానిపైకి నురికీ
గాలను గేలను గ్రుమ్ముచుండ పాం । చాలసేన గనియూ
సింహనాదములు జేయగ వినియు స । హింపక కర్ణుండూ
సోదర సహితముగాగ వచ్చి వృ । కోదరునిం బొదువా
గని యత డద్భుత విక్రమంబునను । జని ద్రుముడనువానీ
అరదముపై లంఘించి దర్పమున । నతని దరిమిపట్టీ
పిడికిటి పోటున జావం బొడిచియు । పిరిదివియక యతడూ
జయరాతుని యాతని సారథినిం । జంపగ నది గనియూ
కర్ణు డలిగి యొక శక్తి వైవ నది । కరువలి నందనుడూ
నొడిచిపట్టి రాధాత్మజు మేనను । బడవైచినయంతా
గని గాంధార మహీపతి నరికెరు । కడువడి భల్లమునా
అదిగని కౌరవ రాజకుమారకు । లంద రొక్క మొగినీ
జుట్టుముట్టి విశిఖంబులు బరపిన । జూచి వృకోదరుడూ
దుర్మదు తేరికి నురవడించి త । త్తురగ సారథులనూ
జంపిన నాతడు జని దుష్కర్ణుని । స్యందన మెక్కియునూ
నయ్యిరువురు నా భీముని తనువుచు । నొయ్యగొట్టినంతా

కోపతామ్రనయనుండై రథమును । గూలదన్ని మఱియూ
ద్రౌణి కర్ణ కృప కృతవర్మాదులు । దగ జూచుచునుండా
ఆ యిద్దరి నట కాల జేతులను । నంతం బొనరింపా
చూచువారు రుద్రుం డీ రణమున । జొచ్చెనేమొ యనుచూ
పాండవులకు దోట్పడగ వచ్చిన । భానుండో యనుచూ
పలువిధముల సేనలు వాపోవగ । పవనాత్మజు డపుడూ
కన్నుల కెంపొదవగ వేగమె జని । యన్నను వీక్షించీ
కేలు ఫాలమున జేర్చి మ్రొక్కె భూ । పాలుడు దమ్ముడునూ
ద్రుపద విరాటాదులు భీముని । మూర్తిజూడ వెరచీ
మారుమొగంబులతో నగ్గించిరి । మారుత నందనునీ॥

వచనము —

ఆయ్యవసరంబున సోమదత్తుండు తనకు సాత్యకి సన్నిహితుం డగుటయు నతనితో నిట్లనియె.

పూరికళ్యాణి — రూపకము

ద్రోహిసమరమున కెట్లు - దో తెంచితివో సాత్యకి ।
సాహసమున భూరిశ్రవు - జంపితి వన్యాయవిధిని ।
ఆహా బోయల చందం - బగు గాకను నృప ధర్మమే
బాహుబలుడ ననుమది ను - త్సాహంబును విడువరోరి ॥ద్రో॥
యీ రాతిరి నాచేతను - యేరీతిని బ్రతుక గలవొ ।
క్రూరా నిన్నస్త్రంబుల - గూల్చెద పగదీర్చుకొనెద ।
మేరమీరి నా చెంతకు - జేరితి విట నిన్నేడుతునే ।
ధారుణిలో నుల్చి పురా - ధ్యక్షుడైన శివుసాక్షిగ ॥ద్రో॥

వచనము—

అని పలికి సింహనాదంబుజేసి శంఖంబు బూరించిన నా శైనేయుం డిట్లనియె.

## రగడ

అప్పుడు భూరిశ్రవుని చావు నీ । కొప్పకుండె నేనీ
ఒప్పునట్లు నిన్నిప్పుడు జంపెద । తప్పక యీయనిలో

అని యీ విధమున వాదులాడుచును । నా యిర్వురు గదిసీ
శరముల నేట్లాడగ దొడగిన నా । సమయంబున సీదూ
తనయుడు తురగస్యందనములతో । తక్షమే వెడలీ
సోము దత్తునకు దోట్పడినంతనె । జూచి సౌబలుండూ
తన బలంబులం గూర్చుక జనినా । తనికి దోడుపడియె
పలువు రొకనిపై గవిసినంతగని । పాంచాలాత్మజుడూ
ధృష్టద్యుమ్నుం డధిక సైన్యముల । ధీరత గైకొనియూ
వారల మార్కొని నంతపోరు బలే । ఘోరంబై యొప్పె
సోమదత్తుడాయడ తొమ్మిది బా । ణము లా సాత్యకిపై
గొట్టిన గని నవసాయకములచే । గొట్టిన కౌరవుడూ
తేరుపైని మూర్ఛనుగూరిన తన । సారథి గను గొనియూ
తొలగదోలుకొనిపోయె రథంబును । తొందరపాటుననూ
అది గని ద్రోణకుమారుడు సాత్యకి । మదమణంతుననుచూ
వచ్చుచున్న నాలోన ఘటోత్కచు । డెచ్చు కోపముననూ
దానవ సైన్యంబులతో వచ్చియు । దాకు నంతలోనా
సంధ్యాసమయంబైన ఘటోత్కచు । సాయక కోట్లలకూ
తొలగిరి మగటిమిగల వారెల్లరు । కలసికి దూరముగా
గని సుస్థిరుడై గుకునుతుండు నొ । క్కరుడు గదిసి దనుజా
బాణనిహతికై దెరలక దనుజుని । పై నారాచములా
పది యురమున నాటించిన దానవ । పతి యలుకనుబూనీ
చక్రము విసరిన నడుమ దాని యా । చార్య సుతుడు నరికే
అపుడు ఘటోత్కచ దనుజుని తనయుం । డంజనపర్వుండూ
అశ్వత్థామను దలపడి బలు క్రూ । రాంబకములు వైవా
బెదరక యంజనపర్వునిచే విలు । పది తునియలు జేసీ
విరథుని జేయుట కరవాలము గొని । విసర దాని ద్రుంచే
గదగొని వేసిన తుమురుజేయ నా । గక నాదనుజుండూ
వేరొక రథమున వచ్చినంత గని । క్రూరాస్త్రంబుననూ
శిరము ద్రెంచి నరనందను డచ్చట । చెచ్చెర వెడలియునూ

పాండవ బలముల బరిమార్చెదనని । పరుగులిడుచునుండా
గని ఘటోత్కచుడు నిలునిలు మెచ్చటి । కరుగవచ్చు నీకూ
అన విని యశ్వత్థామ యాతనికి । ననియె నిట్టులనుచూ
వలదురన్న కడు పిన్నవాడ విది । వలదు తండ్రినగుటా
నిన్నుజూచి యలుగంగ రాదునే । నన్నమాట వినియూ
పోరు మొగులతోనన విని దనుజుడు । పుత్రశోకమునసూ
ఎక్కడి తండ్రివి నీవు నాకు నే । నెక్కడి తనయుడనూ
కౌంతేయులకుం బుట్టి పగతురను । గని సహింపగలనే
అనుచు యురుసు లంతంత బాణములు । నా గురుసుతునేయా
అశ్వత్థామన్నిటి దునుమాడిన । నాఘటోత్కచుండూ
ఆగ్రహమున రారాజు సైన్యముల । నందరి సమయించీ
యురవడించి జన నరనాథుండట । వెరపు జెందియుండా॥

వచనము—

గని గురునందనుండు నృపవరా యీ కయ్యంబుతో నీకేమి పని నీవు సంభ్రమింపకు మక్కడ దానవులను మానవులను నేనడంతు ననిన దుర్యోధనుండు సంతసించి సౌబలుంజూచి యిట్లనియె.

బేగడరాగం — ఆదితాళం

వినుమో మామా సౌబలా – నే దెల్పుమాట ॥వి॥
వినుమా ద్రోణి బాణ – వేగోద్ధతిని పాండు ।
జననాథు తనయులు – సైపజాలకయుండె ॥వి॥
అరద బృందముతో స – త్వరనేగి పగతుర ।
శరముల ద్రుంచి జయమొందు మీవేళ ॥వి॥

వచనము—

అని యవ్వేలనుజూపి కృపకృతవర్మకర్ణ వృషసేనులను దుశ్శాసన ప్రముఖులైన కొందరి తమ్ములను నిరూపించి వీరును నీవునుం గూడు కొని గవియుండని పనిచిన నతండును బింకంబు తోడంబోయె నశ్వత్థామ భీమ నందనుల సంగ్రామంబు భీమంబయ్యె నట్టియెడ నా ఘటోత్కచుండు.

## రగడ

అంపగమిని ద్రోణాత్మజు తనువు చ । లింపగ జేసియునూ
తచ్చాపము విరుగంగ నేయనా । తండొకవిల్లెత్తి
బాహుబలంబున దనుజ సైన్యముల । బడల్బడగ నేయా
నొచ్చుట జచ్చుటగని దుర్యోధను । డచ్చెరు వందగనూ
దానవ సైన్యంబుల నురుమాడగ । ధర్మజు సైన్యములూ
మార్కొన జాలక జూచుచుండ న । మ్మారుత తనయుండూ
దర్పంబున పరిఘంబు వైవగా । ద్రౌణి బట్టుకొనియూ
దానవుపై విసరిన యాతడు బల్ । ధైర్యంబున దొలగే
ధృష్టద్యుమ్నుని రధముపైకి । తా ధీరత నేగిననూ
ఆసాధన మాతని రధసారధి । యశ్వంబుల గూల్చె
అపుడు ఘటోత్కచు డాద్రుపదాత్మజు । డ రదంబున నుండి
శరపరంపరల బెనగుచుండ నా । గురు తనయుడు నవ్వి
నారాచంబులగొట్టి వారలను । గాలించుచు మరియూ
యేకాక్షౌహిణి బలముల గూల్చెను । నేడ్తెర గురుసుతుడూ
అప్పుడు నిర్జరబృందము లెల్లను । నతని బొగడుచుండా
పాండవాగ్రజుడు గని సాత్యకి గొని । పవనాత్మజుగూడీ
మార్కొని నంత ఘటోత్కచుండు దా । మై మూర్ఛను దెలిసీ
వేరొక స్యందనమెక్కి కడంగిన । వెంట ద్రుపదసుతుడూ
వచ్చి నంత నిరువాగులకును నట । హెచ్చు కయ్యమయ్యె
సోమదత్త బాహ్లీకాదులు నడి । భీమసేను దాకా
యిరువాగులు బోరిరి ఘోరంబుగ । విడువక యనిలోనా
అప్పుడు సాత్యకి సోమదత్తులును । నఖ బెనగుచునున్నా
ముద్గరమును గొని భీముని తనయుడు । మోదినంతలోనా
సోమదత్తుడా వ్రేటున కడలియు । సోలి వ్రాలునంతా
తనయుడు మూర్ఛను గూరుట గన్గొని । తండ్రి బాహ్లికుండూ
అల శైనేయుని దలపడినంతనె । యా వృకోదరుండూ
ఆకురువృద్ధునిపై శరమేసిన । నాతడు రోషమునా

శక్తివైవ భీమునిపై నాటిన । చల్లగ సోలియునూ
అంతలోనే దెలివంది ముద్గరం । బా భీముడు గొనియూ
విసరివైవ బాహ్లీకుని శిరమట । వేయి వ్రక్కలయ్యె
కులిశహతిం దెగు శైలము కై వడి । కూలినంతలోనా
మన సేనలు వెరవక్కులై బారగ । మనుజాధిపు డపుడూ
వారుణాస్త్ర మైంద్రాస్త్రము లాదిగ । వరపి నంతలోనా
అయ్యస్త్రములన్నింటిని దర్మజు । డయ్యె యస్త్రములా
వారించిన తన ప్రతిన నెరపుటకు । భార్గవాజుండూ
ఐంద్రాస్త్రంబు ప్రయోగించిన । నయ్యస్త్రంబట్లగుటా
మించు కోపమున బ్రహ్మాస్త్రము బరగించు నంతలోనా
ధర్మజుడా బ్రహ్మాస్త్రంబున నే । దానిని సమయింపా
అంతలోన పాంచాల నందనుం । డతని కడ్డపడినా
గని కుంభజుడా ద్రుపదు సేనపై । గదిసి మహోగ్రుండై
దోలుచున్న గని భీమార్జునులతి । తొందరపాటుననూ
విశిఖంబుల నగ్గురుని నొంపగని । వేపాండవ బలమూ
మాత్స్య కేకయ ప్రముఖ బలంబులు । మనసేనల గవిసీ
గండడగించియు పేర్చినంత గని । కౌరవేశ్వరుండూ
రాధేయుని గని విన్నమొగంబున । రయమున నిట్లనియె
పాండవ బలములు పాంచాలాదులు । పైబడి మన వారీ
తరుముచుండ మన సేన బారె నీ । దర్పము జూపియునూ
గావగ తరి యయ్యెను నీవీయెడ । గాపాడుము కర్ణా
అన విని నేనొక్కండనజాలుదు । నర్జున భీములనూ
జంపి సర్వ రాజ్యంబు నిన్ను యే । లింప నున్నవాడా
గావున విజృంభింతురె వారలు । గనుము నాదు తెంపూ
అనియిటు బల్కి మహోగ్రతనుండెడి । యట్టి కర్ణుతోడా ॥

వ చ న ము—

కృపాచార్యుం డలంతి నవ్వుతో నతని కిట్లనియె.

మధ్యమావతి— ఆదితాళం

చాలు చాలులే - యీరజ్జులేల విడురాధాసుత ॥చా॥
చాలుచాలు కురు-సామ్రాజ్యము పతి-నేలించెదనని యేలబల్కెదవు ।
మేలు మేలు మహినేలింపగ నీ - కేల సాధ్యమగు పార్థుడుండ ॥చా॥
నిన్ను నీవెరుంగవు తను క్రొవ్వున-యిన్నేలవున ప్రేలుచుంటి విచ్చట ।
యిన్ని యేల ఘోషయాత్రనా డె-న్నెన్ని జరిగె నన్నెరుంగుదువు॥చా॥
అదియుగాక గోగ్రహణంబున కీ - వరిగి రథిక బృందములతోడను ।
మొదవుల బట్టగ బోయి నరునిచే - కదనంబున నోడి బారితివి ॥చా॥

వ చ న ము—

కర్ణా పాండు తనూజులు యెన్నండును నిన్నుబోరని వారివలె జూచి యిట్టి ప్రగల్భంబులు బల్కనేల వినుము.

రగడ

క్రీడియొకడెమును మనలందరినిన్ । నోడించెనుగాదే
యిప్పుడు నన్నలు దమ్ములు బంధువు । లెల్ల దోడుపడగా
గెలువనెట్లు సాధ్యంబగె నీకిట । వలవని పనియేలా
అని కృపుడనవిని తామ్రనయనుడై । యారాధాత్మజుడూ
నీపలుకుల కింతకు సైరించితి । నిక బలుకకు కృపుడా
గొప్ప వాడవని విడిచితి నాలుక । గోయుదు నిక్కముగా
అర్జును నద్దెస గలవారల । నందరిని బొగడుచుందూ
గురు తనయుని గురుమద్రేశ్వరునను । కొరగాములు జేసీ
అర్జును నద్దెస గలవారల నం । దరిని బొగడుచుండూ
అని మామను బల్కెడి పల్కులు విని । యశ్వద్థా మపుడూ
చాల కోపనయనుండై గ్రక్కున । వాలు బెరికి కొనియూ
రాధేయునిపై ధుమికి నంతనా । భూధవుడెడ సొచ్చే
కృపుడంతను నెడజొచ్చె నప్పుడా । నృపతికోడ గూడీ
అపుడు వారి కోపంబుల నుడిపియు । నా కురుపతి యపుడూ
అశ్వద్ధామను వీక్షించియు నో । యయ్యా మరచితివే

గురుడు నీవు మద్రేశ్వరుడును । గర్ణుడు కృప సౌబలులూ
నన్ను సర్వరాజ్యం బేలింపగ । నున్నవారు గానా
సంగరమున నిట్లలుగుట దగునే । క్షమియింపుడు మీరూ
అనవిని గర్ణుడు శాంతచిత్తుడై । యనికి గడగి మరియూ ॥
పాండవసేనలపై దాకిన నట । పాండవులందరునూ
కౌంతేయుల కష్టములకు మూలము । కర్ణుడె యటంచూ
వీనిం బొదువుడు పట్టుడు కట్టుడు । పోనీ కుండనుచూ
దలపడి నంతనె సూతనందనుడు । శిలుగులు నాటించీ
కరులు దురంగంబులు రథములు భట । వరుల గూల్చుచుండీ
వారి తనువులను రక్తములు రలగ । నారాచము లేయా
సైన్యంబులు బడుపాటు జూచి యా । సవ్యసాచి యపుడూ
క్రూరనారసంబులు నిగిడించిన । నా రాధేయుండూ
మూడు శిలీముఖము నరు మేనను । గాఢనేసినంతా
గినిసి యర్జునుడు ముప్పది శరములు । జొనిపి నంతలోనా
భుజ శిఖరంబులు నాటిచేతి విలు । భువిపై బడినంతా
నొండొక విలుగొని శరముల గొట్టెను । పాండవ మధ్యమునీ
గని కన్నుల గెంపొదవగ కర్ణుని । ధనువు విరుగనేసీ
సారథి శిరమును ద్రుంచి రథ్యముల । చావగ తోడియునూ
రథికుని యంగములను బెక్కమ్ముల । రయమున గ్రుచ్చిననూ
నొచ్చిపోయి కృపుతేరెక్కెను యపు । దుర్యోధనయతడూ
ఓడి బారు కర్ణుని గని సేనలు । నీడ జొప్పుచుండా
అట్టి సైనికుల గనుగొని కురు విభు । డనియె వారలకునూ
నే గలుగ వెరపేటికి మీరలు । నిలుడీ సమరమునా
గాండివితోడను తక్క పాండవుల । గండడ గించెదనూ
అపుడు పార్థుపై దారసిలం గని । గృపుడా తురముననూ
అశ్వత్థామను గని యిట్లనియెను । యయ్యో కురువిభుడూ
శలభమగ్ని మీదికి జను తెరగున । దలపడె నర్జునుతో
గావున పతి నిట నిలుపుమనిన విని । కలశభవుని సుతుడూ

కౌరవరాజా యేమి మూఁడెనో । కవ్వడిపై జనగా
యే సెటులైనను మాన్పెద నర్జును । నేడ్తెర నొకతు)టిలో
పోవలదన్నను గురుసుతున కురు । భూ విభు డిట్లనియే
నీ తండ్రియు పాండవులకు మేలొన । రించువాడైయెనా
నీవుపేక్షసేయుట మా భాగ్యము । గావలయును జుమ్మా
బంధువులెల్లను నాకై పొలిసిరి । బవరంబున నేడూ
పాండు కుమారుల దెసకు నీవు రా । వలవదు గురు తనయా
పాంచాలాదుల గెలువు నీవు నే । పాండవులనుదీర్తూ
అన విని యశ్వత్థామ నృపతితో । ననియె నిట్టులనుచూ
గురునకు నాకును పాండవేయులతి । కూర్మి బంధులైనా
రణములోన జుట్టరికము దలపగ । రాదు యెవరికైనా
నీ చెప్పిన పాంచాలుర దునిమెద । నితర బలంబులనూ
కృపుడు కర్ణుడును మద్రేశ్వరుడును । కృతవర్మలగూడి
గలచెద కౌంతేయులు మార్కొనినను । నిలువరింపగలనూ
అనుచుండగ పాండవమధ్యముడా । యనికి దరలుచుండా
పాంచాలురు కేకయ సేనలతో । ఫల్గును మించియునూ
మార్కొని నంతనె గురు తనయుడు బహు । మార్గణ పంక్తులనూ
పరిగించిన కోల్తలకా బలములు । బరచె దిక్కులకునూ
గని పదుండ్రు రాజులు నిలునిలు మని । గవియు వారి నెల్లా
శర పరంపరల గొట్టి వారలను । జముని పాలికనిపి
యార్చినంత నశ్వత్థామను గని । యత్యాగ్రహముననూ
ధృష్టద్యుమ్నుడు వాని దాకి యిట । ధీరత నిలుమనుచూ
కేకలు వేయుగ ద్రోణనందనుడు । కేరుచు నిట్లనియె
వెదకుచుంటిగాదే నీకొరకే । కదనంబున నిపుడే
బలి యిచ్చెద నీ ప్రాణంబులు నా బాణ సంతతికినీ
అనవిని ధృష్టద్యుమ్నుడు గురు నం । దనున కిట్టులనియే
నిన్నుగన్న తండ్రికి మృత్యువనై । యున్నవాడ నేనూ
నీ మగటిమి గనుగొని యెదదలగక । నిలుమీ యనిలోనా

అని నా యిరువురు పలు దెరగుల బో । రాడుచుండు నంతా
అశ్వద్ధామ శరాహతి గూలెను । యతని బలము లెల్లా
అప్పుడు గురుసుతు నెదుర నిల్వలే । కను ద్రుపదుని బలమూ
పలు దిక్కులకును పెల్లాచెదురై । పరువు లెత్తుచుండా
ధర్మజ భీములు బలసహితంబుగ । దరలి గవిసినంతా
కౌరవవిభుడా గురు సమేతుడై । గలసేనలతోడా
గదిసినంత బలు కయ్యంబయ్యెను । గాఢతరంబుగనూ
అంతఫల్గునుడు మన సేనలపై । పంతంబున గదిసీ
మగధ వంగ మద్రాది దేశముల । మగటిమిగల దొరలా
సవ్యసాచి గూల్చిన గని ద్రోణుడు । సక్రోధుండగుచూ
పాండవ సేనలపై దార్కొనియును । భల్లాస్త్రంబులచే
గొట్టుచుండ వగుడాకుల తీరున । పట్టుదప్పి రాలే
జలిగిభీమ నకులిరుగెలంకులను । యస్త్రగురుని దాకీ
శరజాలంబులు బర్వుచుండగా । గురుడు నెదుర్కొనియూ
వారి సైన్యముల నురుమాడగ గని । వాసవనందనుడూ
విశిఖతతులు బర్విన మన సేనలు । విచ్చలవిడి జనియే.

వ చ న ము—

అట్టియెడ సోమదత్తుండు సమరోల్లాసంబున పాండవ సైనికుల నిలు నిలు మని యదల్చుచు నిల్చిన గనుంగొని సాత్యకి యిట్లనియె.

శ్రీరాగం — చతురశ్రగతి

వచ్చినాడవా - మరలా యీ సంగ్రామమునకు ॥వ॥
చచ్చిన భూరిశ్రవునిం జ్ఞప్తికి-దెచ్చుకొమ్మా హెచ్చులు విడువక ॥వ॥
క్రూర నిన్ను బాణప్రకరంబుల - పాలుజేయ గాచియుంటి నిటు ॥వ॥
సోమదత్త నీవు వెడలు నపుడు - స్వామిపైని భారంబుబెట్టి ॥వ॥
వులిచి పురాధీశుడు శంకరులో।గలియు కాలమయ్యెనేమొ యిటు ॥వ॥

వ చ న ము—

యిట్లనుచున్న సాత్యకి సోమదత్తుల సంగ్రామంబు భీమంబయ్యె నట్టియెడ.

## రగడ

ఆ సాత్యకి విలు నర్ధచంద్ర బా । ణమున నరికివైచీ
ముప్పదే నుసితసాయకములదే । నొప్పించిన యతడూ
నొండొక విలుగొని సోమదత్తునిం । గుండె లవియనేసీ
ధనువు చెక్కలుగజేసి ధ్వజంబును । ధరపై బడగూల్పా
మరియొక విలుగొని వేటులాడునెడ । మారుతాత్మజుండూ
సోమదత్తుపై దాకి వేయునెడ । జూచి ఘటోత్కచుడూ
పరిఘమువైచిన నది దునిమెను యా । కురువరేణ్యు డపుడూ
అప్పుడు సాత్యకి హయ సారధులను । గొప్ప నారసములా
గూల్చి సోమదత్తుని ప్రాణంబులు । గొనె యొక శరముననూ
అమ్మె కురువృద్ధుని జంపించియు । నమ్మారుత సుతుడూ
యెప్పటట్లు భూరమణుల మేనకు । నరిగెను కురునాధా
చచ్చినట్టి యా సోమదత్తుగని । చయ్యన మనవారూ
సాత్యకిపై గ్రమ్మట గన్గొనియా । శమనాత్మజు డపుడూ
శైనేయునిగొని బారదోలెన్నా । సైన్యంబుల నెల్లా
అంత గురుడు విలు విరిచి సిడంబును । నవనిడొల్లనేసీ
తనువు నుచ్చిపోవగ నొక శరమును । తక్షణమే వైవా
అప్పుడు రోష మహోగ్రమూర్తియై । యా ధర్మాత్మజుడూ
వేరొక విలుగొని నెమ్మలగీరెడి । నారసములు వైవా
నోటను తనువున రక్తము గ్రమ్మగ । నొచ్చి రథముపైనా
మూర్ఛనొంది మరికొంత దడవునకు । మూర్ఛదేరి యతడూ
విజృంభించియు దైవత్యంబను । విశిఖం బేయుటయూ
శాంతింపగ జేసిన గని ధర్మజు । డంత విజృంభింపా
గని శ్రీకృష్ణుం డాతని కిట్లనె । కౌంతేయా వినుమూ
శరగురుండు నినుబట్టు ప్రతిజ్ఞను । నెరపు టెరుంగుదువూ
అతనితోడ బోరాడ దగదు నీవచట నిల్వరాదూ
మన భీముడు బోరాడు సమర మొంగ । మునకు జనుము నీవూ
గురుని జంప జనియించినట్టి వా । డరుగు నతనిబోరా

అనియిటు దెల్పిన విని ధర్మాత్మజు । డరిగె భీము మొనకూ
ద్రుపదు సైన్యములకుం జనె నప్పుడు । ద్రోణాచార్యుండూ
అంతట కురు పాండవులు ధీరులై । యద్భుతముగ బోరా
అంధకార మతి బంధురమూాచును । యావరించుచుండా
చిక్కనబడి నట్లయ్యె వారలకు । దిక్కుదోచకధిపా
అట్టితరిని పాండవు లుద్దండత । నెట్టన జూపగనూ
కౌరవ బలములు చీకాకునుబడె । కారుచీకటులలో
కానరాక యుండగ నాచార్యుడు । కడు ధైర్యంబుననూ
దుర్యోధను గొని తగు బలంబులతో । ద్రోణాచార్యుండూ
చక్కగ నొక వ్యూహరము నమర్చెను । నక్కురు బలములతో॥

వ చ న ము—

యివ్విధంబున దెల్పుచున్న విని ధృతరాష్ట్రునకా సంజయుం డిట్లనియె.

క ం దా ర్థ ము

సమరంబే విధిజేసిరొ - తిమిరము నలుదిశల గ్రమ్మ-దివిటులులేకా ॥
తమమున కెట్లుసహించిరొ-నమితంబగుశ్రమలుబొంది॥రనిదలతూనేనూ।
సైనికులాకౌరవరాజూతోనూ-శమననందనుడుత-త్సైన్యములనుగూడీ।
శ్రమకెట్టు లోర్చెనా - సరణి నెరింగింతు ॥వని॥

వ చ న ము—

అని యడిగిన సంజయుం డతనికిట్లను నాసమయంబున నక్కురు భూపాలుండు దమ కాలుబలంబుల నెల్ల నాయుధంబులు వెట్టి దివిటులు బట్టని యోగించిన.

## రగడ

రాజాజ్ఞను తమ సైన్యము లెల్లను । రయమున జనుదెంచీ
దివిటులుగొని వచ్చిన గని నరవరు । డవి యన్నిటి నపుడూ
అరదముకై దనుగరికి మూడు దుర । గంబున కొక్కటిచేయూ
దివ్వేలుబట్టగ నాజ్ఞనిడియు మరి । యవ్విభుకెలకులనూ

కేతనంబులకు దివ్వెలు బట్టగ । నాతడాజ్ఞ నిడియూ
మోహరంబునకు ముందట బార్శ్వం । బుల బిఱుంద వెలుగా
పొడవుగ దివ్వెల నెత్తి పట్టుమని । భూపతి దెల్పగనూ
అవ్వెలుంగునింగికి నేలకు నొక । టగుచు ప్రకాశించే
అప్పుడు నీ సైన్యంబులు శోభిలె । నస్త్రశతులతోడా
అచ్చట ధర్మజుడా సైన్యములకు । నాజ్ఞనిడినయంతా
గరదీపికలం గొనివచ్చిన నవి । యరదమునకు పదియూ
గజమున కేడును తురగమునకు నిరు । కరదీపికలేయూ
ఆ వెలుంగునకు తమముపాయ గని । యాత్మల బొంగగనూ
ఆతరి ద్రోణుడు మధ్యందిన మా । ర్తాండు పగిదినుండే
మనుజనాయకుడు దమ్ములతో ని । ట్లనియె మీరలిపుడూ
శల్యాని కృతవర్మ యోధులను । సరగ గూర్చుకొనియూ
ధీరచిత్తులై భారద్వాజుని । జేరి యతనికడకూ
ద్రుపదనందనుని జేరనీయకుడు । ద్రోణుడెల్ల వారీ
గెలుచు గాన మీరెల్లరు శరగురు । కెలననిలువవలయూ
గావున గురుడాధృష్టద్యుమ్నుని । కలనిలో బరిమార్చూ
రాధేయుం డర్జునుని గెల్చు సం । రావంబున వెడలీ
భీముని నేగెల్వగజాలుదునని । బిగ్గరబలికియునూ
చేయివీచి నంతనె మన సేనలు । చెచ్చెరగడగియునూ
పాండవసేనలును రవడించి యూ । భండవమున కెగయూ
యెన్నడెరుంగని సమరమయ్యె నా । యిరువాగులలోనా
అట్టి సమయమున ధృష్టద్యుమ్నుం । డాచార్యుని నెదిరీ
బెనగుచుండ గృతవర్మ ధర్మజుని । ధనువు విరుగనేయూ
నొండొక విలుగొని యా కృతవర్మను । గుండెలదర నేసీ
చాపము తుంటలుజేసి వెంటనే । శక్తివైచినంతా
వేరెశరాసనమెత్తి హయంబుల । ధారుణి బడనేసీ
సారధి కోదండంబుల గూల్చియు । కేరుచున్నయంతా
ధర్మజు డపుడు కృపాసనముగొన కృత । వర్మ నరికివైచే

కవచము పరియలు జేసి మేన సిత । కాండంబులు వైవా
దుర్భరమగుటను పాండవాగ్రజుడు । దొలగి చనియె ననికీ
భూవర యదిగని మన సైన్యంబులు । బొంగి రద్భుతముగా
అంతట కర్ణుడు సహదేవుండును । పంతంబుల గదిసీ
పెనగునప్పు డమ్మాద్రీతనయుడు । కను లెఱ్ఱగజేసీ
తొమ్మిది తూపులు రాధేయుని తను । దూరనేసినంతా
సక్రోధుండై తీవ్రకాండముల । సహదేవుని తనువూ
చొక్కగొట్టి రాధేయుడు విడువక । సారిది విల్లుంపా
మరియొక చాపముగొని సహదేవుడు । మార్గణములు వైవా
గని యాతడు ఖడ్గము ఖేటకమును । గైకొని వేయగనూ
బహుబాణప్రకరంబుల గూల్చెను । భార్గవ సూనుండూ
సహదేవుడు గద విసరిన నవ్వుచు । సమయించెను దానీ
పాండునందనుడు బెదరక శక్తిని । బరపినంతలోనా
రాధేయుండొక చక్రము వైచిన । సాధనములు రెండూ
సమముగ బోరుచు వ్యర్థమైన గని । సహదేవుడు దెరలీ
మది నిశ్చేష్టత జూచుచున్న న । మ్మాద్రీ నందనునీ
ఆలోకించుచు కుంతి వాక్యములు । నంతరాత్మ దలచీ
జంప నొల్లకను యా సహదేవుని । సమ్ముఖమున నిలిచీ
వింటికోపునం గడుపున బొడుచుచు । నిట్లనె నాతనితో
అల్లదె విన్వచ్చుడు గురుసేనతొ । నతి మగటిమితోడా
బోరుచుండె నాతనికడ నుండగ । బొమ్మని బలికియునూ
పోయెనతడు నంతట సహదేవుడు । బొగలుచు మదిలోనా
కర్ణు డాడు మాడలకు వ్రేటునకు । కడు మది నొచ్చియునూ
తన జీవితమున కెంతయు రోయుచు । తత్క్షణమే జోయీా
మరియొక స్యందనమెక్కె నప్పుడా । మాద్రీ తనయుండూ
ప్రక్కనున్న సైన్యంబులెల్ల నలు । దిక్కుల బారగనూ
అర్జునుండు గని నిలువరించె నట । నఖిలసైన్యములనూ
ంత నలంబసు డడ్డమువచ్చిన । నతని విరథు జేయూ

ఆతం డమిత భయార్తమూర్తియై । నరిగె ననికి దొలగీ
ఆయడ ద్రుపదుడు వృషసేనుడు ఘో । రాహవమును జేయా
యిరువురు శోణిత ధారల దడిసిరి । యిభపురి పరిపాలా
అప్పుడు కర్ణుని కొడుకు బెట్టిదుం । డై బెనగుచునుండా
పాంచాల బలములు వృషసేనుని । పై గ్రమ్మిన యంతా
అట్టి సమయమున నకులుడు శకునియు । నని బోరుచునుండా
శకుని రౌద్రమున నొక్క తూపుగొని । నకులు తనువు గుచ్చా
అతడు మూర్ఛనొందుట గని సౌబలు । డార్చె నద్భుతముగా
అంతలోన దెలి వంది పతాకము । నతని విల్లు విరచీ
తనువున నొక విశిఖంబు నుచ్చి జన । నినిచినంతలోనా
అరచావోయన మూర్ఛబడి నీ । మరది సౌబలుండూ
అదిగని సారథి దొలగ దోలుకొని । యరిగినంతలోనా
ద్రుమసేనుడు రాధాత్మజుపై కడు । దోర్బలమున గదిసీ
పటుబాణప్రకరంబు లుద్ధతిని । బరపిన కర్ణుండూ
అలిగి వాని శిర మొక్క శరంబున । నిలబడ గూల్చగనూ
కనలి ధృష్టద్యుమ్నుం డా కర్ణు । ధనువు విరుగనేయా
వేరొక విలుగొని బెనగుచుండగా । నా రాధేయునకూ
రారాజు మొదలైన రథికు లతి । రయమున దోట్పడినా॥

వ చ న ము—

అప్పుడు సాత్యకిం గవిసి కర్ణుం డిట్లనియె.

మధ్యమావతి – ఆటతాళం

నిలు నిలు నిలురా – యాదవవీరా ॥ని॥
చలమునవచ్చె యిూ – సమరము జొచ్చితివి ।
కలతజెంది నీవూ – పలుదెరంగుల బోక ॥ని॥
సమయమయ్యెనురా – యెట్లైనా నిక – సమయింతును గనరా।
కమలనాభుడు నీకు – గలడాని బొంగకు ,
యముని సన్నిధి కర – నిముసములో బంపెద ॥ని॥

దొలగకుమ్మోరీ - శైనేయ దోర్బలుడనని మీారీ ॥
యిలనుల్చి పురివాసు - డిందుధరుని సాక్షి ।
కులిశధారల నిన్ను - గూల్తు నిక్కముగాగ ॥ని॥

వ చ న ము —

యిట్లనుచున్న రాధేయుని సాత్యకి గవిసిన నయ్యిరువురకు నొక్క రూపున నక్కజంబగు కయ్యంబయ్యె నట్టియెడ వృషసేనుండు వచ్చి.

## ర గ డ

సాత్యకిపై క్రూరాస్త్రములేయగ । చయ్యన నాతండూ
పవితుల్యాంబకముల వృషసేనుని । బయల్పడగ జేయూ
రధమ్ముపైన మూర్ఛిలి బడినంతనె । రాధేయుడు గనియూ
పుత్రశోకపీడితుడై యాతడు । భూరి రోషముననూ
శినివరునానాస్త్రంబుల పీడితు । జేసినంతలోనా
మూర్ఛదేరి వృషసేనుడు తండ్రికి । ముదమున దోడ్పడియే
అప్పుడు నయ్యిద్దరు నేడ్తెరలను । నాశిని వరుగదియూ
గనుగొని సాత్యకి నయ్యికువుర నట । గండడగించగనూ
ఆతరిగాండివ దేవదత్త రా । వంబులు వీతేరా
అంగరాజు విని రారాజున కి । ట్లనియె కౌరవేశా
అల్లదె పార్థుడు తనమును మన సే । నల గలంచుచుండే
యితని గదియరాకుండ బోరుద । మిప్పుడు బలంబులతో
అర్జును డిటు రాకుండగ బోరిన । యభిమన్యుని పోల్కి
బోవువాడు గావున నదె నీకిట । భూవరవిజయంబూ
గలుగజేయు టది నిశ్చయ మీాతడు । కలకజెందెనేనీ
దెలిసిన పార్థుడు రాగల డతనికి । దెలియకమును యితనీ
యెదిరి పోంగల వీరుల కొందరి । నేర్చిపంపవలయూ
ననవిని దుర్యోధను డిది కర్ణుం । బని సౌబలుజూచీ
ఘదివేలేనుగులన్ని రధములతో । ఫల్గునుపై జనుమా
యనెడి తరిని దుశ్శాసన దుర్మ । ర్షణులు దోడుగాగా

జని క్రీడిని మార్కొని కయ్యంబును । సల్పుచుండు నపుడూ
పాండవు లన్నలదమ్ములందరిని । భండనమున బోదివీ
గెలువుమనిన గాంధార విభుడు న । క్కలనికి జనినంతా
యిచ్చట రాధేయుడు జేయంగల । వీరవరులగూడీ
సాత్యకిపై మార్కొని పలురీతుల । సాయకములు గురియూ
అతడు చెలరేగియు సామజముల । నవని బడగ నరికీ
హయముల శిరములు రథసంచయముల । నవని డొల్లనేసీ
శోణిత మేరులు బారకయ్యమున । వాని బారదోలే
సాత్యకి యద్భుత విక్రమమునకును । సకలబలముగలగా
గనినీ తనయుడు రథమును దోలక । శినివరుదాకగనూ
అయిరువురకును గడువరాని పో । రయ్యెను భూపాలా
అప్పుడు సాత్యకి నీసుతు తురగము । లను సూతుని జంపి
విల్లుదునుమ కురురాజతి భీతిని । వేరురథంబెక్కె
అంత నీదు సేనల దూలించెను । యా శైనేయుండూ
ఆయెడ సౌబలు డర్జునుతో బో । రాడు సమయముననూ
అత కొమారు దులూకు డుగ్రతను । హరు పార్థులమేనా
శరకోటుల నడరించినంత నా । సవ్యసాచి గనియూ
శకుని సారథినిజంపి హయంబుల । శకలంబుల జేసీ
అతనిజాప మిరుగంగనేసి నం । తనే యా సౌబలుడూ
ఆత్మ చలింపగబోయి వేగ తన యాత్మజు రథమెక్కె
మగటిమిగల యోధాగ్రేసరులను । మరలించిన యంతా
యెక్కడి సేనలు నక్కడికేగిరి । దిక్కులు నరయుచునూ
ధీరతపార్థుడు బేర్చి నంత విని । ధృష్టద్యుమ్నుండూ
కనలివచ్చి గురునింటి నల్లే । తాటని దెగనరికిననూ
ఆచార్యుడు నొండొక వింటను ది । వ్యాంబకములు వేయూ
నివిద్రించియు నెన్నెన్ని వేసినను । నవియు ద్రుంచుచుండే
తనువుల నొంచుచు మార్గణజాలము । లను జొన్పుచు వడిగా
సైన్యంబులు దైన్యంబులు నొందగ । సల్పుచుండు నపుడూ

కౌరవబలములు బెదరుహృదయముల । కాందిశీకు లైనా
పాంచజన్య సురదత్తశంఖములు । బహుళముగా మ్రోయా
పాండవ బలములు పెన్నంటిన గని । భాను నందనుండూ
కనుగొనలను కెంపొదవ భీషణా । కారుండై జొచ్చీ
శిరములు జేతులుకాళ్ళు దనువులును । ధరపై దొరగించీ
రథములు ఘోటకములు వారణములు । పృథివి డొల్లనేసి
దర్పోద్ధతి తద్భుజ సంరంభము । దగ్రతజూపుచునూ
వెరపున బరతెంచెడి వాహినుల । వెనుకొని తరిమెడినీ
రాధా తనయుని గని ధర్మజు డిం । ద్రాత్మజు కిట్లనియె ॥

వ చ న ము—

మరియు కౌంతేయాగ్రజుం డర్జునునితో నిట్లనియె.

శహాన — ఆదితాళం

యింద్రనందన వినుమా – యీ నడు రేయిలోన ।
సాంద్రముగాను రవి భువి – యందున వెలసెననగ ॥యిం॥
తలపూ జనించెను యూ – తని తేజమును గనగా
వెలిగెను కర్ణ శర రు – చులు దిక్కులందు నిండె ॥యిం॥
యితడూ సమరములోనా – యీదిక్కు వారినెల్లా ।
బ్రతుకానివ్వడని హృదయ – ఫలకమునందు దోసె ॥యిం॥
వీని కెట్లయిన ప్రతి వి – ధానామాచరింపుము ।
పూనిక నుల్చిపురి శ్రీ – భూతేశు సాక్షిగాను ॥యిం॥

వ చ న ము—

ధర్మజుం డిట్లనుచున్న విని సవ్యసాచి యచ్యుతు నాలోకించి.

# రగడ

రాజీవాక్షా కర్ణు డొనర్చెడి । రభసంబున కిపుడూ
మన సైన్యంబులు నోహటించగని । జననాథుండెంతో
భీతిలి యున్నా డాచార్యుం డిట । భీషణరూపుండై

మొనల దెరల్చెను నచ్చటికే జని । నిన సుతు నదలించీ
శరగురు వేగము వారించెదనో । సరసిజాక్ష నీవూ
తేరు నడుపుమన యర్జునునకు యా । దేవకి సుతుడనియే
నావాక్యంబుల నాలకించుమో । దేవనాథు తనయా
యిది నిసిసమయము దానవులకు బల । మెచ్చియుండుగానా
మన ఘటోత్కచుడు కర్ణుని నోర్చెడు । బనుపుద మాతనినీ
అతడు నెన్నియో మాయలు బన్నును । నస్త్రజాలములచే
అనుమానింపగ వలదు నీవు నే । నరుగుద మొక యడకూ
అని నరునకు వినుపించు ఘటోత్కచు । నచ్చోటికి బిలువా
సన్నాహంబున వచ్చి గృష్ణునకు । సాష్టాంగ మొనర్చి
నన్ను బిలుచు పని యేమని యనుటయు । నళినాక్షుం డనియే
పాండవసేనలు రాధాత్మజుచే । భండనమున నొచ్చే
గాన నీవు జని శౌర్యదర్పముల । కర్ణు నిల్వరించీ
మీ తండ్రులకును బ్రీతి గలుగు నటు । లాతని నోర్చియునూ
జయముగల్గగా జేయుము పాండవ । జననాథున కిపుడూ
అని యిటు శ్రీహరి దెల్పు వాక్యముల । కానందము బొందీ
అర్జును ననుమతి బొంది ఘటోత్కచు । డరిగె కర్ణుదెసకూ
అట్టి సమయమున జటానురాత్మజు । డలంబసుడువచ్చీ
దాకినంత నా యిరువురకును బహు । దారుణ రథమయ్యే
అప్పుడు భీమాత్మజు డుగ్రంబున । నలంబసుని బట్టీ
యురమును నొకపాదంబున ద్రొక్కియు । కరవాలముచేతా
శిరము నరికి ఘోరంబుగ నార్చుచు । వెరువక మస్తకమూ
కురుపతి తేరున విసరివైచియూ । నరపతి కిట్లనియే
నీ మిత్రుని తల నిదియే గనుగొను । నిన్ను నంగపతినీ
వరుసను ద్రుంచెద న న్నెరుంగలే । వాయుజ నందనునీ
అని యిటు బలుకుచు నసురవల్లభుం । డరుణ రథంబెక్కీ
గృధ్రకేతనము గ్రాలగ మనమున । కినుక గదుర వెడలీ
రాధాత్మజుపై దాకి క్రూర నా । రసములేయు నతడూ

చండతరంబుగ ఘూర్ణిల్లని నిశితా । స్త్రంబుల గప్పగనూ
అన్నిటి శకలంబులు జేసియు దా । నవు డతి రోషమునా
మాయాసైన్యము గల్పించియు బల్ । మార్గణములు నింపీ
శూల ముద్గర వ్రాతంబులచే । చొక్కగొట్టి మరియూ
ఫలల వర్షమును గురిపించగ కురు । బలముకెల్ల భారే
మానకకర్ణుడ వష్టంభంబున । మా యనుమాయింపా
గని హైడింబుడు చక్రము వైచిన । గ్రక్కున సమయించే
నూతనంతనుం డన్నిటి గూల్చగ । జూచి దానవుండూ
బలునారసముల గొట్టియు కర్ణుని । విలు విరుగగ నేయూ
అంత హలాయుధుడను నిశాచరుం । డతివేగమె వచ్చీ
దాకినంత దానిని సమయించెను । దర్పమెలర్పగనూ
యార్చినంత పాండవ సైన్యంబు । నద్భుతమోదము లా
తూర్య నినదములు సింహనాదముల । వార్యత మ్రోయగనూ
కౌరవ బలములు కడకదక్క స । త్వర పరుగులు నిడుచూ
అయ్యయ్యో యింద్రుడు బృందారకు । లందరు నిటువచ్చీ
పాండునందనులకుందోడై యీ । పగిది నొనర్చిరొకో
అనుచు వెగడుననుగల గంబడి ర । య్యవసరమున నధిపా
ధీయుతుడై రాధేయుం డొకరి । సహాయంబును లేకా
యెన్ని శరంబులు వేసిన గానీ । యన్ని యదృశ్యంబై
అవిగానగ రాకుండుటకును మది । కాశ్చర్యము బొందీ
మరల దానవుని మాయాశరముల । మందుచు సైనికులూ
యోర్వలేకకడు భీతిని సంగర । యోధులతో గలిసీ
నూతనందనుని మగటిమి నందరు । జూచియు నగ్గించీ ॥

వ చ న ము—

మరియు నంద రక్కర్ణు నుద్దేశించి యిన్నిశాచరుండిందర సమయింపకుండ గాచికొనుము నీవు బ్రతుకు మార్గం బూహింపు మని రాధేయున కిట్లనియె.

ముఖారి — అటతాళం

అంగరాజా యీ నిశాచరు - డందరిని సమయించుచుండెను ।
చూడగా ॥ ప్రతిహతిలేదుగా ॥అం॥
వీని సమయించుటకు యోచన - గాన రాదదియేమొ సూత ।
నందనా ॥యీరణ మందునా ॥అం॥
మరచినాడ వదేమొగానీ - మఘవు డొసగిన శక్తిలేదా ।
మాటికీ ॥సంశయమేటికీ ॥అం॥
భీమ పార్థుల కొరకు దాచితి - వేమొ శక్తిని యీ ఘటోత్కచు ।
నేయుమా ॥శరమిటుదీయుమా ॥అం॥
ప్రథమ గండము దప్పినను తదు - పరిని భీమార్జునులు నిన్నే ।
మందురూ ॥భయముల నుందురూ ॥అం॥
పరగనుల్చి పురీశుడౌ శం - కరుని వేడిమిపుడేనుదీకా ।
వేయుము బాయకా ॥అం॥

వ చ న ము—

సైనికు లిటు దెల్పుచున్నయడ నా రక్కసుండా మేటిమగని గీట డంచువాడై యా టోపంబున గదిసి.

## ర గ డ

కడిమి మెరయ రథ్యంబుల గూల్చెను । గదా పాతముననూ
అంత విరథుడౌటను నా కర్ణుని । నద్దనుజుడు దరిమీ
గదచే మోదిన భ్రమగొని సూతుడు । మదినిట్లని దలచే
చావు దప్పుటకు రథికలు దెల్పిన । సదుపాయము కంటే
వేరుగానరాదని నూహించియు । ఘోర శక్తిగవినా
మెరుగులడర నాలుకలు గోయుచును । మింటికెగయుచుండా॥
ఆశక్తిని దగ కేలనందుకొని । యార్చి వైరిగనియూ
విడిచినంత నాశక్తిరాగ గని । గడగడ వడకుచునూ
దెరని పార జొచ్చిన ఘటోత్కచుని । దరుము మృత్యువనగా
గగనతలంబున భూత సంఘములు । ఘల్లని క్రోయగనూ

వెంటనంటి దనుజాధిపు మాయను । కంటకమున మ్రింగీ
ఉగ్రాకారంబై ఘటోత్కచుని । యురము బగిల్చికొనీ
వీపున వెడలియు శక్తి యెగసి విను । వీధికేగినంతా
బోరగిలంబడి నాలుకజాచియు । నా రక్షోవిభుడూ
జెడుగరచుచును లాలలు గ్రమ్మగ । నసువులు విడనాడే
యిటు ఘటోత్కచుడు పడిపోయిన పి । మ్మట మనసైనికులూ
సింహానాదము శంఖనినదములు । జేయుచుండి రథిపా
బంధుర సఖులతో నీ పుత్రుడు స । ద్బంధు సమేతముగా
కడు యానందంబులతో గర్ణుని । గాగలించుకొనుచూ
తన రథమెక్కించుక జనెనని యా । జనవిభునకు దెల్పా
విని మోదంబున సంజయుతో నిట్లనె । ధృతరాష్ట్రుండూ
మాయాబలుడగు భీమనందనుడు । మరణించిన పిదపా
పాండవు లెంతటి శోకకోపముల । నుండిరో సూతసుతా
దెల్పుమనిన కురుభూపాలునకును । దెల్పె సంజయుండూ॥

వ చ న ము—

అని యడిగిన నమ్మహీపతికి నతం డిట్లను మృతుండైన హిడింబా సుతుం జూచి కౌంతేయు లత్యంత దీనమానసులై కన్నీరొలుక నిట్లనిరి.

పీలురాగం — ఆటతాళం

అయ్యో ఘటోత్కచా - యని గూలినావా ।
యిెయ్యెడ నీ సాహస - మెటు మరతు మయ్యో ॥అ॥
పరగ నీ శౌర్య సం - పద నెల్ల దలపా ।
పొరలి పొరలి దుఃఖ - శరధి గ్రమ్మెనురా ॥అ॥
నీ రూప కాయము - లారూఢతయునూ ।
యే రాజతనయూల - నెందుగానమురా ॥అ॥

వ చ న ము—

పాండవు లందరు కన్నీళుల నించుచు దీనవదనులై యున్నయెడ.

# రగడ

పాండుకుమారులు దుఃఖాబ్ధింబడి । నుందునట్టి వేళా
వనజాక్షుడు సంతోషార్ణవమున । మునిగి తేలుచుండీ
సింహనాద మొనరించి శంఖమును । చెచ్చెర బూరించీ
తురగ పగ్గములు నొగల ముడిచి సం । బరమున గృష్ణుండూ
నటన మొనర్చుచు నరుని స్యందనము । నడిమికి వే జనియూ
కడు యానందంబున నా పార్థుని । గౌగలించుకొనియూ
వీపు దట్టుచును యార్చి నంత న । వ్వీరుడు హరిగనియూ
చచ్చె ఘటోత్కచు డీ సంగరమున । సర్వసేనలెల్లా
గలగి బారుచుండగ గని మేమిట । కడు విషాదములనూ
గుందుచుండ నీ వెట్లు సంతసం । బందెదవో దేవా
యేమిటు సంతోషింపగ కారణ । మెరిగింపుము శౌరీ
అనుటయు గోవిందుం డిట్లనియెను । నయ్యింద్రాత్మజుతో
సురపతి కర్ణుని కుండలములు గొను । తరుణంబున నతడూ
ఆ కర్ణునకొక శక్తి యిచ్చె నది । యతని కడ నెయుండే
ఆమహాసాధన మతనికడన యు । న్నంతవరకు నిన్నూ
బ్రతికించుట బహుదుష్కరమనుచును । భయము జెందుచుంటీ
అది ఘటోత్కచునిపైన బోవనే । నంత సంతసిలితీ
అది రాధేయునిచేతనుండి న । శ్లైన రణములోనా
చక్రగాండీవంబులు ధరియించియు । సంగరమునకేగా
మనల జయించును గాని యాతనిన్ । మనము గెలువలేమూ
దేవసన్నిభుడు గాని యతడు మా । నవమాత్రుడు గాడూ
యింద్రుడు వేడిన కవచకుండలము । లిచ్చెదాత యనగా
నీ కొరకై నీ జనకుండిటు లొన । రించకున్న వానీ
యెట్టివారలైనను రాధేయుని । గొట్టజాలరయ్యా
గావున యీ హైడింబుడు జచ్చుట । కడు మోదమునాకూ
యెట్టివాడొ రావణుడు మున్ను పీ । డట్టివాడు విజయా
వీడిప్పుడు జావక యుండిన యెడ । వీనిజంపుటకనూ

పదపడిరయే రూపంబున్నైననే । పొలుపడగవలయూ
అందువలన వీ డిప్పుడు గూలుట । నతి సంతసకరమూ
శోకమునకు సమయంబుగాదు యిటు । జూడుము మన మొనలా
గలగబారపై కొనుచుండెను నట । కలశభవుని బలమూ
జాగరూకతతో మెలగవలయునని । జలజాక్షుడు దెల్పె
నన విని ధృతరాష్ట్రుడు సంజయుతో । ననియె నిట్టులనుచూ
పరుని జంపగల నుజ్వలశక్తిని । నెరిగి కర్ణుడెలా
యిన్ని దినము లానరుపై విడువక । మన్నించుట దేలా
అప్రయోజకము జేసె కయ్యమున । నారాధాసుతుడూ
భుజబల విక్రముడైన నరుడు రణ । భూమిని బడియున్నా
సూతనందనా యితర బలంబులు । జొత్తురెనని మొనకూ
తాను బిలిచియైనను నర్జునుతో । ధైర్యంబున బెనగీ
శక్తి ప్రయోగముజేసి పార్థునిం । జంపకుండె నేమో
యెవ్వరుకయ్యమునకు బిలిచిన తా । నేడ్తెరజనువాడూ
అతని తెలివి పౌరుషమేమాయెనొ । యర్జును ముందరనూ
యేకారణమున దప్పనడిచెనో । యెరుగబల్కు నూతా
నా కొడుకులు దుర్బుద్ధులగుటచే । నరయ దేమొ గానీ
నీ వైనను దలపవు యాశక్తిని । నీరజాక్షుడపుడూ
బుడుతని చేఫలమొకె నేర్పరి దా । నొడుచుకొనిన రీతి
యయ్యెనేమొ నెరిగించుము సంజయ । యనిన నృపతి కనియే
రాత్రివేళ రాధేయునితో రా । రాజు సోదరులునూ
నేను దగంజెప్పుదు మాతడు విని । పూనిక నిట్లనునూ
యెల్లిశక్తిచే జచ్చునరుండని । యుల్లమలర బలుకూ
మరియు కర్ణునితొ నిట్లందుము మే । మా విన్వచ్చుండూ
జచ్చిన లాభంబేమిలేదు యీా । శౌరినిగూల్చిననూ
మనకు దక్కు యీా రాజ్యంబంతయు । మఘువ్రదత్తమైనా
శక్తిచేత యీా శౌరింజంపిన । జగతినేలవచ్చూ
అనిదెల్పిన మాటలు విని కర్ణుం । డా హరి విజయులలో

ఒక్కని జంపెద జూచుచుండని । నొక్కి బల్కి జనియే
వేకువ సంగ్రామంబున కేగిన । వేళ శక్తిమాటా
మా కందరికిని రాధేయునకును । మనసుకు రాదయ్యే
దైవకతంబున నట్లు జరిగె మరి । దైవమొకడు గలడా
మాయామానుష విగ్రహు డనగా । మాధవుండు గాడా
యీ వృత్తాంతము యర్జునునకు బో । ధించు సమయముననూ
సాత్యకి హరితో నూతనందనుడు । శక్తి నిన్నినాళ్ళూ
కవ్వని మేన ప్రయోగింపమికిని । కారణ మేమనినా
కర్ణునకును తమ వార లీ పనిని । గరపుచుందు రెపుడూ
ఆమాటల కాతడు శక్తిని వే । యగ బూనినయపుడూ
మరుపు వచ్చుచుండగ నొనరింతును । దురమున యతనికినీ
అర్జును గావగ నట్లొనర్తు నే । ననిశము సమరమునా
అని పలికియు ధృష్టద్యుమ్నాదుల । నందరి గనుగొనియూ
సాత్యకి మీరందరు నా ప్రాణము । సాటివారు సుమ్మా
శక్తి భయము దీరెను యీ రాతిరి । చక్కగ నిద్రింతూ
అర్జును చావును దప్పె నేటి కీక । హాయిగ నుండెదనూ
అని గృష్ణుం డిటు దెల్పుచుండగా । నచ్చట ధర్మజుడూ.

వ చ న ము—

ఘటోత్కచుని చావునకు కనులవెంట భాష్పాంబుధార లడర తనువు వణంకుచు వివశుండై తేరిపైం జతికిలబడుటయు దామో దరుండు వచ్చి కరంబులం బొదివి యతని నాలోకించి యిట్లనియె.

తోడి — ఆదితాళం

సర్వమెరింగిన మహనీయుడ విటు - జనునె ధర్మతనయా ।
నుర్వీశుడ వీవే యిటువగచుట-యొప్పునె భీముం-డేమనుకొనవలె॥స॥
పామరజనునట్టుల శోకించుట - భావ్యమే కౌంతేయా ।
నీ మానస మెవ్వరెరుగజాలరు-యీమహి నీసము లెవ్వరు నృపులలో॥

ధరను నల్పిపురి గారీసుని స - త్కారుణ వలన నీకూ
నిరయము దప్పెను శక్తి భీమజుని - దొరగించియు జన - పార్థుడు
బ్రతికెను ॥స॥

వ చ న ము—

శ్రీకృష్ణుం డిట్లు దుఃఖోపశమన వాక్యంబులు బలుక విని ధర్మ జుండు కన్నీరు కరతలంబుల నొత్తుకొని మెత్తని మాటల ఘటోత్క చుని గుణంబులు నుగ్గడించుచు నిట్లనియె.

## ర గ డ

ఆ ఘటోత్కచుడు బాలుండైనను । యుతని బొగడ తరమా
కావ్యకవనమున నుండు నాడు మా । కతి మేలొనరించే
మరియు గంధమాదన యాత్రను నట । మాకు జేయు మేలూ
యింక ననేక సహాయము లొనరించి । సంకటములు బాపే
వాడు నాకు ప్రియ భక్తుండగుటను । వాని మరువ జాలా
యిక్కు మారు జంపిన దుర్జాతుని । విడువజాల కృష్ణా
అభిమన్యుని బద్మవ్యూహంబున । నతి చిక్కుల బరచీ
పలువురచే జంపించె నవ్వాడ । బ్బాలుని బాలిసుడూ
చనటి క్రూరకర్ముని రాధేయుని । జంపునంతవరకూ
శాంతి బొందగా నేరదు నామన । మింతయేల కృష్ణా
అని బలుకుచు డిగ్గన లేచియు ధ । ర్మజు డుగ్రాకృతితో
బలికె నిన్న మొన్నా రాధజునకు । కలనికి దోట్పడివా
శరగురునిం దెగటార్చగ భీముం । డనగగలడు నటకూ
నూతనందనుం డెన్నడకు నే । జొచ్చెద నిక్కముగా
అనుచు శంఖ నినదం బొనరించియు । ధనువు కేలనందీ
రథము నడప సూతుని నియమించియు । రయమున జనుచుండా
పద్మాక్షుడు తన తేరికి వచ్చియు । ఫల్గును వీక్షించీ
పార్థా కర్ణుని జంపెదననుచును । పాండవాగ్రజుండూ
మిక్కిలి యలుకను రయమున జనియెడు । నక్కయ్యంబునకూ

గావున ధర్మజునూరక జూచుట । గాదు సవ్యసాచీ
అనుచుండగ క్రోధంబున రథమూ । జనవరుండు నడుపా
అట్టి సమయమున వ్యాసమునీంద్రుం । డతి కరుణాన్వితుడై
ధర్మజు తేరికి సమ్ముఖంబుగా । దగ నరుదెంచియునూ
ఆదరించ నాహవానికి ప్రణతుండైనను దీవించీ ।
కరుణారస హృదయుండై యిట్లనె । కౌంతేయాగ్రజుతో
సురనాథుం డాకర్ణున కొసగిన । సురుచిర మహాశక్తి
అర్జును జంపగ దాచియుంచి నా । డమ్మహాస్త్రమతడూ
దానివలన యాపద వాటిల్లిన । దప్పింపగ వశమా
దైవము నీవాడై యుండుట యది । దప్పె నర్జుననకూ
ఆఘటోత్కచున కంత్యగాలమై । నతనిగొనియె శక్తి
దానివలన భయమెంతయు లేదిక । ధర్మరాజ నీవూ
మనుజపతుల దమ్ముల సైన్యంబుల । మరి సుహృజ్జనములా
గూర్చుక రణమొనరింపుము విడువక । కురుసైన్యంబులతో
అని యుధిష్టిరుని మనమునగల కల । తను మాన్పించియునూ
యేవలనను ధర్మంబు నిలుచునో । నావలజయ మగునూ
అని హితవును బోధించి వ్యాసముని । యనియె నిట్టులనుచూ
మనుజనాథ యిక నేను నాళ్ళకును । అనుమానము లేకా
రాజ్యలక్ష్మి నిను బొందగలదు ధీ । రాగ్రగణ్య వినుమా
నావాక్యంబులు నిశ్చయమని మది । నమ్ముము కౌంతేయా
అని యిటు దెల్పియు సాత్యవతేయుం । డరిగిన పిమ్మటనూ
శాంతచిత్తుడై ధర్మజుండు ధృ । ష్టద్యుమ్నుని గనియూ
ద్రుపదనంద నా రథిక వీరులగు । దొరలను గూడుకొనీ
ద్రోణునిజంపగ జనుము నీవు యా । ద్రోణుని జంపుటకై
అగ్నిని జనియించినవాడవు నీ । కనుమానంబేలా
హోమ్మని దెల్పిన సర్వసేన నా । కుక్కమ్మడిగా గొనియూ
పోయిన గని ద్రోణాచార్యుం డతి । భూరి సైన్యములతో
కదిసినంత నిరువాగులు దలపడి । కయ్యం బొనరింపా

అప్పుడు మూడవ యామంబౌటను । యా వాహిను లెల్లా
నిద్రాభరమున దూలగ జొచ్చిన । నీ సైనికు లపుడూ
దప్పిగూరి నిద్దురకు భరింపక । తనువు లలసియుండీ
డెందలమందున గొందల మందిరి । యందరు నారాత్రీ
అర్జునను నిజధర్మము విడువక । నడరి జేనగుచుండా
తీవ్రంబగుని ద్రాపరవశతను । దివియు లాపలేకా
దివియులు జల్లారుటచే ననిలో తిమిరమెక్కువయ్యో
అలసట జెందియు తమచే నాయుధ । ములను విడుచువారూ
పోవుచుండు వాహనముల నట్లే । బోనిచ్చెడివారూ
చొక్కి నిద్ర భరమున తా నిలిచిన । చోట నిలుచు వారూ
తమవారిని తామే నెదిరించియు । దగ బొడిచెడివారూ
కలనిలోన నెల్లెడలను దిరుగుచు । గాసిజెందువారూ
యిట్లనేక కష్టములకు పాల్పడు । నిరుబలముల గాంచీ
గాండివి పెద్ద యెలుంగున నిట్లనె । కలని డస్సినారూ
గావున నుభయబలంబులు నొక త్రుటి । కను గూరకవలయూ
నొడ లాయాసము దీరెడి చంద్రుడు । బొడిచి వచ్చువాడూ
తదుపరి బోరగ వచ్చును మీరలు । తగనిద్రను గొనుడూ
అన విని మనవారలు మేల్ మేలని । యధిపుల యనుమతినీ
విశ్రమించి రా పాండవసేనలు । విశ్రాంతిని బొందే
అప్పుడు గాండివి ధర్మపథమునకు । నమరగణము బొగడా
అనిలో సేనలు కరుణబూని మ । న్నతి గారవముననూ
జూచి సుఖాన్వితులను జేసితి వో । సురనాయక తనయూ
ధర్మమూర్తివగుటను నీ కమరులు । తగు వరములు నొసగీ
నీ మనోరథంబును నెరవేర్చియు । నిను జయింపజేయూ
నని కౌరవసైన్యంబులెల్ల దీ । వన లొసగియు నరునీ
కొనియాడుచు నిద్రించి రందరట । కురుభూపా రేయీ

వ చ న ము—

అంత చంద్రుండు తూర్పు దిఙ్ముఖంబున నలంకరించి వచ్చుచు

న్నంత కౌరవ పాండవులు మేలుకని యాలంబునకుం దొడంగె నప్పుడు కురురాజు గురునికడకుం జని యతని యస్త్రవీర్య శౌర్యంబుల నుగ్గడించి యిట్లనియె.

ముఖారి — ఆటతాళం

తలపవే నీదూ - కలనైనా మా మేలు ॥త॥
కలశజా ముల్లోకములు నిను - కయ్యమున నోడించగలరా ॥త॥
భండనమున నే - పాటివారలు నీకూ ।
పాండవుల కడు బెద్దజేసి య - ఖండముగ నగ్గించుచుందువు ॥త॥
పోటునకు నరుతో - బోరజాలవటంచూ ।
మాటిమాటికి బల్కెదవు యి - ప్పాటునా దౌర్భాగ్యమేమొ ॥ త॥
భారద్వాజ శిష్య - భావముతో నతని ।
గారవింతువుగాని పగతుర - తీరు జూపవు కపటవృత్తిని ॥త॥
యిల నల్పపురమునా - వెలయు ఫాలాక్షునీ ।
గెలిచెనని నీ మానసంబున - దలచి పిరికి జనించెనేమో ॥త॥

వ చ న ము—

సుయోధనుండు నిష్ఠురంబులాడుచు యేమి సేయవచ్చు ననవుడు నయ్యాచార్యుండు గనలి నతని కిట్లనియె.

## రగడ

నరనాథా నను మాటికి దూరుడ । జనునె రాజరాజా
వనజసంభవుం డెటులవ్రాసె నటు । లనుభవించవలదా
నా శిష్యుండనిగాదే నిర్జర । నాథుడు మన్నించి
కూరిమి మీరగ ఖాండవవనమును । గోలుపోయె నాడూ
చిత్రసేన గంధర్వులు నిను విడి । చేదరి బారె నాడూ
కాలకేయ నివాత కవచు లట । కూలరె యానాడూ
వలవని మాటలతో బనియేమని । కలశజుండు బలుకా
ఆగ్రహమున నక్కుంభవున । కనియె సుయోధనుడూ

సవ్యసాచి నోపగ లేకుండిన । జాలు నిలువు మిచటా
తగిన బలంబులతో నీ యోపిన । మగల బెనగు మేనూ
దుశ్శాసన సౌబల కర్ణుల నిట । దోడుగ గూర్చుకొనీ
పార్థుని జంపెద మన విని ద్రోణుడు । ఫక్కున నవ్వియునూ
అవ్వీరుని నవ్విధమున జేయుట । నది కర్జముగానా
గెలుతురు గావున పొండని పలికియు । కలశసంభవుండూ
పాంచాల సైన్యము లుండెడి దెస । కంచితముగ నడచే
అప్పుడు కౌరవపతి దుశ్శాను । లా కర్ణాదులతో
పాండవ సైన్యము లున్న దెసకు జనె । బహు తీవ్రంబుగనూ
వేకువఝామున కయ్య మొనర్చిరి । యా కవ్వని గదిసీ
అంతట దూర్పున సూర్యబింబ మ । త్యంత కాంతు లడరా
వచ్చుచుండగా శ్రీ కృష్ణుడు వి । వ్వచ్చుని వీక్షించీ
రెండు దెరంగుల సైన్యము లిప్పుడు - గండుమిగిలిపోరే
గావున యీ మూకలన్నింటిని । కడకుద్రోచి పార్థా
తరుమవలయునని దెల్పిన విని యా । తం డొడబడి యపుడూ
తన యరదంబును బరపుచుండగా । గని భీముం డపుడూ
బరవసంపుమాటల భీభత్సుని । బురికొల్పిన యంతా
గడగిన గాండివి గని దుర్యోధన । కర్ణ సౌబలులునూ
జుట్టుముట్టి పెల్లేసినవంత నరు । డట్టహాసముననూ
రేచియు నందరి కన్నిరూపులై । యేట్లాడగ నపుడూ
యిరువాగులు మార్కొని వెనుదీయక । దురము సల్పుచుండా
ద్రోణాచార్యుండా సమరమునకు । దోర్బలమును జనగా
పులినిగన్న హరిణముల తెరంగున । బోయిరంత దిశలా
అదిగని ద్రుపదవిరాట కేకయులు । నాచార్యుని గదిసీ
జుట్టు ముట్ట నక్కుంభసంభవుడు । జురజుర జూచుచునూ
అచ్చటి ప్రజల నెల్లర దునుమాడియు । నమిత యుగ్రముఖుడై
క్రొవ్వడరిన పాంచాలుని మనుమల ముగ్వుర దునిమియునూ
భీకరాకృతిని క్రూరాస్త్రంబుల । కేకయులను ద్రుంచీ

దొడ్డనారసంబుల మత్స్యాధిపు । ద్రుపదుని ధరగూల్చా
గనుగొని ధృష్టద్యుమ్నుడు కొ్రధా । కారత నిట్లనియే
యీ ద్రోణుని జంపకనే విడిచితి । నేని నిశ్చయముగా
వరలు నా కులాచారము విడిచిన । వాడ నగుదు నేనూ
అని పలువురు వినబాసయిచ్చి తా । నాహావ వేడుకనూ
పాంచాల సేనలగూడియు గురు । పై గవిసినయంతా
కురుపతి కర్ణాదులు నడ్డముజని । గూడి పెనగుచుండా
వుభయ బలంబులు బురికొని బోరిరి । విభముల చందమునా
సంకుల సమరంబై చెల్లెను యీ । సర్వసేనలకునూ
ఆయెడ సూర్యుండు దయాచలమున । నరుణాంశులతోడా
వచ్చినంత లోకములు వెలింగెను । వసుమతీశ వినుమూ
అప్పుడు రెండు దెరంగుల వారలు । నాహావమున దొలగి
కాలోచిత కృత్యంబులు దీర్చుక । కయ్యమునకు గడిగి
పోరుచుండిరే యండతాకునకు । నోరువలేకపుడూ
తనువులు డస్సియు మొగములు వాడియు । జనములు వెనుదియకా
పౌరుషములతో బోరుచుండి రా । యిరువాగుల బలమూ
అట్టియెడను ద్రోణార్జును లిర్వురు । నని భూమిని విడకా
బోరుచునుండిరి శస్త్రాస్త్రంబుల । పూర్ణరోషములనూ
దుర్యోధన దుశ్శాసను లాయెడ । దోర్బలమున గడగీ
కవలను దాకిన భీమసేనుపై । కర్ణుడు మార్కొనియే
అంత వారలకు ఘోరంబగు క । య్యాబయ్యెను భూపా
నకులుడు దుర్యోధనుని నొంచె త । త్ప్రికటశరంబులచే
సహదేవుడు దుశ్శాసను సూతుని । సమయించిన నతడూ
సూతకృత్యమొనరించుచు శరముల । జోనుపుచుండు నంతా
సహదేవుడు యాతని తురంగముల । సాయకముల గొట్టా
భయమున రథ్యము లారథ మిూడ్చుక । బరలినంతలోనా
భీమ కర్ణులట బోరుచుండనతి । భీమంబై దోచే
గదలచేత బోరాడుచుండిరా । కర్ణభీము లచటా

అప్పుడు రాధాత్మజుడా భీముని । యశ్వంబుల దునిమే
అంతవాయుజుండా నకులుని రథ । మల్లన నెక్కగనూ
విమవక బోరిరి నరగురు లిరువురు । వివిధశరాహతులా
సమర విహారము సల్పుచుండిరా । సవ్యసాచి గురులూ
గురుశిష్యుల పోరాటముఁగని యం । బరమున సురలెల్లా
తమ హృదయంబులలోన వింతగా । దలచుచుండి రధిపా
ఆచార్యుం డప్పుడు బ్రహ్మాస్త్రం । బరి బోసియు నతఁడూ
భక్తి సమంత్రక పూర్వకంబుగా । బ్రహ్మాస్త్రము విడువా
క్షితిశైలంబులు గడగడ వడకెను । దిశల వెలిగెనగ్ని
గలగబారె నంభోనిధులెల్లను । కడుభీతియు గల్గె
దేవ సంఘములు సంక్షోభించెను । దివిభోరున మ్రోసే
అంతరంగమున నుంతయైన భయ । మెంతలేక నరుడూ
వినయ విధేయుండై బ్రహ్మాస్త్రము । విడిచినంతలోనా
భారద్వాజుని బ్రహ్మాంస్త్రంబును । వారించిన యంతా
గెలుపోటమిలేకా యిర్వు రణ । కేళి సలుపుచుండా
సందడి కయ్యంబయ్యె నట్టి తరి । శరగురుపార్థులుఁనూ
కయ్యము మానియు ద్రుపదు సైన్యములు । కౌరవ సేనలపై
దాకి రంతలో దుశ్శాసను డతి । దర్పంబున వెడలీ
ధృష్టద్యుమ్నునిదాకి యోర్వకను । ధృతిజెడి నటు దొలగే
ఆ పాంచాల సుతుండు ద్రోణుపై । నడరి నంతలోనా
మాద్రికుమారులు దోర్బల కృత వ । ర్మయు నడ్డము సొచ్చే
పెనుగుచుండ కురుపతి సాత్యకి మా । ర్కొనిన నిర్వురకునూ
పోరు ఘోరమై జరుగుచుండగా । భూవరు విలుదునివిా
మేను నొవ్వనేసిన సుయోధనుడు । దాని కోహటించీ
దప్పి దీర్చుకొని మరల సాత్యకిని । దాకి బెనగుచుండా
యోర్వక మరల దొలంగజూచు । దుర్యోధనునిం గాంచీ
ఆ సాత్యకి దెస కరుగుచుండ గని । యా బకాంతకుండూ
దోర్బలమున జని రాధేయునిపై । తూపులు నడరింపా

అవి ఖండించియు భీము సారథిని । నవియసేసినంతా
కోదండము నిరుతుంటలుజేయు వృ । కోదరు డల్గియునూ
గదగొని త్రిప్పుచు విసరివైవగా । కర్ణుని సారథియూ
అరదముతో పొడిపొడియైనను దల । కక నా కర్ణుండూ
శరవ్రాతం బడరింపగ బలములు । వెరచి పారుచున్నా
ధర్మజుండు మాత్స్యాది బలంబుల । దరలించుక వేగా
ఆచార్యుని దెస కరుగువేళ మ । ధ్యాహ్నంబై వచ్చె॥

వ చ న ము—

ఆ సమయంబున నకుల సహదేవ సమీర నందనులు నర్జును నుద్దేసించి యెలుంగెత్తి యిట్లనిరి.

మధ్యమావతి - ఆదితాళము

అమరేశనందనా-యర్జునా-శ్రమల బెట్టుచుండె-శరగురుండు రావే॥అ॥
సమరమందు వెనుకముందు జూడక ।
సకలావని నాథుల తత్సేనల ।
నమితఘోర మొనరించుచుండె శర ।
సమితి బరపి యెదురులేక గూల్చె న॥
గోలుమసగి పాంచాల బలంబుల-నేలకు గోలకు దెచ్చుచుండె గురు ।
డేలకో దెలియగజాలము ద్రుపదుల-పాలశమనుడిటువచ్చె నేమొ॥య॥
నీవు గడగి యీ కౌరవబలముల । జేవజేడగ జేసియు మమ్మందర ।
గావుము నుల్చి పురీశుండౌ శివ । దేవునిసాక్షిగ బ్రదుకజాల ॥మ॥

వ చ న ము—

ఇట్లనుచుని కేకలు వేయుచు బలంబులు గుములై యాచార్యునిపై గ్రమ్మినగని పటుప్రదరజాలంబుల పొడిసేయ నమ్మహాత్మునాలోకించి ధర్మ తనయ భీమసేన మాద్రీ తనయులు గూడుకొని తమలో.

## ర గ డ

సామజముల దేహల నురుమాడుచు । సారథులను నరికే
తురగంబుల దొరలను భటజనులను । దొరగజేసె భువినీ

నెత్తుట దేల్చెను సర్వబలంబుల । నిత్తరి కుంభజుడూ
మన మాతనిపై నేగిన నందరి । మర్ధించగగలడూ
ఆచార్యుని నిట నిలువరింపగా । నలవియగునె మనకూ
నరుడు ధర్మపరుడై యూరక నట । నరయుచున్న వాడూ
కర్యమునకు తెంపున జొరడనుచును । కలవరపడుచుండా
వారి తెరంగు గనుంగొని యప్పుడు । వారిజనాభుండూ
రధము దోలుకొని వారల కడకును । రయమున నేతెంచీ
కవ్వనితో నిట్లని వివరించెను । కంసమర్దనుండూ
దేవదానవులకైన నలవిగా దీ । మహాత్ముననిలో
గెలుచుట కెవ్వరు బూనుకొందురీ । కలశజు మార్కొనియూ
దీనికి తగు నౌషధము దెల్పెదను । బూనవలయు మీరూ
యేమన నశ్వద్ధామ జచ్చెనని । యెరిగించిన యంతా
వినినయంతనే యాయుధములు దిగ । విడనాడియు గురుడూ
నిశ్చేష్టుండైయుండగ జంపుట । కిదియే నుపాయంబూ
యింతకన్న వేరే సదుపాయం । బెందుగానరాదూ
మీలో నెవరైనను నట్లాడిన । మేలొదవును మీకూ
అచ్చటనుండిన జనులందరు స । మ్మతమున మేలనిరీ
పార్ధుం డొడబడ డాయను దానికి । పాండవాగ్రజుండూ
కడువిషాదమున బలుకుట యెట్లని । నడలుచున్న యంతా
అంతకుమున్నుగ భీముని చేతను । నశ్వద్ధామ యనెడూ
భద్రదంతి బడిపోయిన నెపమున । బక విరోధివేగా
ధనురాచార్యునితో ననె యశ్వ । ద్ధామ జచ్చె ననుచూ
ఆవార్తను విని గుండె ఝల్లుమన । నాచార్యుడు బెదరీ
కొడుకు యస్త్ర వీర్యాది గుణంబుల । కును ధైర్యము నొందీ
ఆ వార్తను పెడచెవిని బెట్టి తా । నని విడువక నప్పుడూ
ధృష్టద్యుమ్నుని నారసముల నతి । ధృతిని గొట్టుచుండా
అంతలోన పాంచాల బలంబులు । నతని కడ్డపడినా
యిరువదివేవురు రధికుల గూల్చియు । శరగురుండు వడిగా

మాత్స్యబలంబుల కురికి విశిఖముల । మర్దించుచు మరియూ
అయిదు నూర్లయరదంబుల పదివేల్ । మదమాతంగములా
అన్ని తురగములగూల్చి రాజలో । కంబులపై కురకా ॥
వచనము —

రాజుల గుములం జొచ్చు నప్పుడు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజగౌతమ కశ్యపవశిష్టాది ప్రభృతిమునివర్గం బాతనిపాలి కేతెంచి యిట్లనిరి.

బిల్హరి — చతురశ్రగతి

ఆగుమాగు మాచార్యా – ఆలము సేయుట తగదిక ॥ఆ॥
ఆగమ పారాయణుడవు – నవని బ్రాహ్మణుడ వైతివి ॥ఆ॥
కర్మరహితఘోరంబా – కయ్యం బీలాగు సేయ ।
ధర్మమనుచు దోచెనేమొ – తమ రెరుంగనిది గలదే ॥ఆ॥
యింతకుమును సంగరమం – దెట్టెల జేసితివో ।
పంతముడుగు మీ కాలము – పరిపూర్ణంబయ్యె నేడు ॥ఆ॥
మామాటలు చెవినిడుకొని – మార్గణపంక్తులు జాపము ।
భూమిపైన నిడి శాంతిని – బొందుము మేమేగెదమిక ॥ఆ॥
నిరతము శ్రీవుల్చి పురిని – నెలకొని భక్తులగాచెడి ।
పరశివుడభవుడు గంగా – ధరునిలోన గలియగలవు ॥ఆ॥
వచనము —

ద్రోణాచార్యున కిట్లు బోధించి యమ్మునీంద్రులరిగిన నాబ్రాహ్మణుండా మహానుల వాక్యంబు లాకర్ణించి భీమసేను మాటలు దలంచి యగ్రభాగంబునకు వచ్చియున్న ధృష్టద్యుమ్నునిం గనుంగొని వికల చిత్తుండును శోకాయత్తుండును నగుచు నిజపుత్రుండు జచ్చుట బ్రతుకట యజాత శత్రువలన దెలియువాడై యతని నడిగె. నయ్యవసరంబున వాసుదేవుండు ధర్మజున కిట్లనియె.

## రగడ

శరగురుడీయ పరాహ్ణ సమరమును । సల్పిన యట్లైనా
భండనమున చావక బ్రతుకుదురే । పాండవు లితరులునూ

గావున మమ్మాతరి నొప్పింపక । గాచికొనుము రాజా
ప్రాణరక్షణోపాయమునందు న । బద్ధమాడితేనీ
యేయసత్యదోషము రానేరదు । యెటులనైన నీవూ
అతని కొడుకు మరణించె నటంచును । యనుము ధర్మరాజా
అని పనిచినయడ భీమసేను డ । య్యుగ్రగజుతోననియె
మాళవాధిపతి యింద్రవర్మయను । మానవేశునకునూ
అశ్వద్ధామను కుంజర మొక్కటి । యతని కడనయున్నా
అది నాచే యుద్ధంబున జచ్చిన । యట్టి నెపంబుననూ
అశ్వద్ధామ హతంబని జెప్పితి । నానుడి నమ్మకనూ
యోచన జేయుచునుండె కొంతదడ । వోర్పున శరగురుడూ
నీజయంబు మదిగోరిగాదె యీ । నీరజనాభుండూ
వుపదేశించిన వచనంబులు నీ । వుల్లంఘించకనూ
అట్లాడిన నీమాటలు డిమ్మియు । ననిసేయం నకనూ
అన విని నయ్యిరువురు దెల్పిన । వాక్యమ్ము లాలకించీ
యేది యెట్లు గానున్నదో నట్లగు । నేమిసేతు ననుచూ
సమ్మతించి ధర్మజుడు కుంబజుని । సామీప్యము జేరీ
ఆయన వినగా పెద్దయెలుంగున । నరిచె ధర్మజుండూ
అశ్వద్ధామ హతాయని బలికియు । నటు పిమ్మట మరియూ
ఆయన చెవికిని వినరాకుండగ । నటకుంజర మనియే
ధర్మజు డీవిధి బలికినంత విని । ధనురాచార్యుండూ
పాండు తనయులకు ద్రోహుడ నైతిని । భండనంబులోనా
అని మనమున యోజించుచు నుండగ । నకాలములోనా
రథ చక్రంబులు శిలరూపంబున । పృథివి నిల్చిపోయే
మునులు జెప్పిపోయిన వాక్యంబులు । ముఖ్యంబని దలచీ
చేష్టలుడిగి నిక్షిప్తాంగుండై । జ్యేష్టుని వగనుండా
అతని వధింపగ నగ్ని జనించిన । నప్పార్షతు డపుడూ
సమయ జనితమగు నుత్సాహంబున । శరగురుపై గవిసీ
శరముల మితముగ వేసిన యంతను । చాపాచార్యుండూ

ఉల్లమునందున సమరకాంక్ష నిడి । యున్న కుంభజుండూ
పగతుని యుల్లాసమును సహింపక । బహురోషాన్వితుడై
ధృష్టద్యుమ్నుని బాణములన్నియు । తృంచివైచి మరియూ
మానసబలమున ప్రకృతి బాణములు । పూనిక సంధించీ
సూత కేతు రథరథ్య చాపముల । చూరుజేసి నంతా
గదగొని ధృష్టద్యుమ్నుడు విసరిన । కడిమి మెరయనరుకా
శరగురుండు యాతని కరవాలము । శకలంబులుజేసీ
తనువు ఖండ కాండముల నొవ్వ నే । సిన పాంచాలుండూ
శరగురు కోల్తల కోర్వలేక స । త్వర కృపకర్ణులతో
బెనగుచు సునిశితశరములః గురుపై । జొనుపుచుండు నంతా
పరుగున భీముడువచ్చి కుంభజుని । బారికి దప్పించీ
గొనిపోవుచు నుండగ పోపొమ్మని । కుంభజుడా యెడనూ
ముందురీతి నిశ్చల భావంబున । మునివలె గూర్చుండే
ఆ రీతిని నాలుగు దివసంబులు । నరయ నొక్కరాత్రీ
ఐదు దినములలో నామహాత్ము డిరు । వది గడియలలోనా
యిరువదివేల రథంబుల సేనల । నిలను డొల్లనేసే
కాననమును దహియించు వహ్నిగతి । కౌంతేయుల బలమూ
ఖండనమున శరకీలల చేతను । భస్మము గావించే
అట్లొనర్చితుద కామహనీయుం । డస్త్రంబులు విడిచే
శాంతింబొందిన చిత్తము తోడుత । సైన్యంబుల జూచీ
ఓహో కర్ణా! వోసుయోధనా! । ఓ కృపాదులారా!
పోరిలోన నన్నెప్పు డొత్తి ప । ల్కుదురు మీరలెల్లా
గావున నాచే నైనంతకు నిట । కయ్య మొనర్చితినీ
యింక నేను నిశ్చింత వృత్తి నీ । యిహము విడుచువాడా
సుగతికిజేర దలంచితి మీరలు । మగటిమి వీడకనూ
బాణములను బాణాసముల నెడ । బాయక మనుడనుచు
పలికి శరశరాసనములు వీడియు । పరము జేరదలచీ

తన రథమున గూర్చుండి యోగ ని । ష్టను బూనుక నతడూ
తేజోమయుడై యుండె నపుడు కురు । రాజా శరగురుడూ ॥

వ చ న ము—

అట్టియెడ ధృష్టద్యుమ్నుండు కృపాణ పాణియు పాదచారియునై భారద్వాజు దెసకుం గలియుటయు నుభయ సైన్యంబుల నాహాకారంబు లెసగెనంత.

శ్రీరాగం — ఆదితాళం

కంటినయ్యా - కౌరవ భూపాలానే ॥కం॥
గంటినయ్యాగురు-ద్రోణిరథముపై-బంటు తనముమూని మౌనవ్రతుడై।
యుంటజేసి చిరకాలముగా తను-వంటి యున్న తేజ మెడలగనే ॥కం॥
పరమపావనంబౌ యా తేజము-ప్రకటజ్యోతి రూపంబున నెగసియు ।
పరమ స్థానంబునకుజేరి యా - పరశివులో నైక్యమైన కన్నుల ॥కం॥
శౌరి నరుడు కృపుడా ధర్మాత్మజు - లురుతరశీల పవిత్రులగుట త ।
ద్గురు దేహమునుండి వెడలుజ్యోతిని-దరిశించిరి పుణ్యమతులునల్వురు ॥
గానరాదు తక్కిన బలములకును - గానరాదు కౌరవపాండవులకు ।
స్థాణురూపుడై నుల్చిని వెలసిన-శంకరులో గలిసిన వెలుగుననే ॥కం॥

వ చ న ము—

అప్పుడు సురసంఘంబులుజూచి సంతసంబులం బొదలిరి నట్టియెడ ధృష్టద్యుమ్నుండు.

## రగడ

కఠిన మనంబున ధృష్టద్యుమ్నుడు । కరవాలము గొనియూ
ద్రోణాచార్యుని రథముపైకి తా । దోర్బలమున ధుమికీ
చచ్చిన శవ కేశంబులు కరమున । సరగబట్టుకొనియూ
ఖడ్గంబున మెడద్రుంచివైవనట । గను వారందరునూ
మానుమానుమని పెద్ద వెలుంగున । బూని కేకలేయా
అర్జునుండు నటు వచ్చి వలదు వ । ల్దనుచు నరచుచుండా

కౌంతేయుడు దివిముట్టు నటుల కే । కలు వేయుచునుండా
వినకా ధృష్టద్యుమ్నుడు ద్రోణుని । తను మస్తకములనూ
కాలదన్ని ధర గూల ద్రోసె పాం । చాల నందనుండూ
శతవృద్ధుం డగు ద్రోణాచార్యుడు । హాతహూటను గనియూ
పాండవ బలములుపై కొనగని నీ । బలములు వెరచరచీ
కని గనకుండగ బరతెంచిరి నలు । గడలను మనవారూ
అప్పుడు నీ కొడుకులు దిఙ్మానల । నడరి ఖిన్నులైరీ
ఆయెడ దుర్యోధన దుశ్శాసను । డా కర్ణుడు కృపుడూ
మద్రేశ్వర కృతవర్మలు మొదలగు । మహీపతు లందరునూ
కరితండంబుల తురగగుముల ముం । దరగా నిడుకొనియూ
కటకట యిదియే మన్యాయంబని । కలవరపడువారూ
యింతవైపరీత్యంబు బుట్టెనిది । యెందుక నెడివారూ
శతవృద్ధుండిట మడిసె నింక మన । గతి యేమనువారూ
యీ పుణ్యుండేగెను దిక్కెవరని । వాపోయెడివారూ
యేమిసేయ గలవారము మన కిం । కేమి యనెడివారూ
మరలిమరలి చూచుచు జనువారలు । తెరువు నడుచువారూ
తలచీరలు సవరించుచు నిలువక । దొలగి బోవువారూ
ఒకరి నొకరు నిలునిలుమని బలుకుచూ నొయ్యన జనువారూ
కాలునిలువకను దూలుచుండి పలు । గడల కరుగువారూ
సైన్యము లీవిధి గోడుజెందుచును । జనుచుండెడివేళా
మరియొక మాకతొ బెనగుచునుండెడి । శరగురు నందనుడూ
నీ సేనలు నిట్లగుట నెరింగియు । నీ కొడుకునుజేరీ
దుర్యోధన మన సైన్యము లనికిని । దొలగి బారుచుండే
కృపకర్ణులు మొదలైన యోధు । లిట్లేపు దరిగియుండే
లేటమొగంబుల నున్నవారు నీ । వేటికి యిటులుండా
అనియిటు లడిగిన యశ్వత్థామకు । జననాథుం డపుడూ
ఆచార్యుడు మరణించిన వార్తను । యతడు జెప్పబోయీ
నోరురాక డగ్గుత్తికతో విభు । డూరకున్న యంతా

కృపు డట వెలవెలబాఱుచు కుపతి । కిట్లనె దుఃఖమునా
అపరిమితంబుగ పాండవ పాంచా । లాదుల ద్రుంచుటయూ
గని పాండవబలములు సైరింపక । గని కనకనుబర్వా
భీముడు యశ్వద్ధామ జచ్చెనని । బిగ్గరగా బల్కా
ఆమాటలు విని కుంభజుండు తా । నాత్మను నమ్మకనూ
ధర్మజు నడిగిన భీమునిచేతను । ధరను గూలియున్నా
కుంజర నెపమున యశ్వద్ధామ హాత । కుంజరమని బలుకా
ఆమాటలువిని యాయుధంబులను । నవనికి దిగవిడిచీ
ఆచార్యుడు నట యోగనిష్ట ను । న్నంత నటకువచ్చీ
ధృష్టద్యుమ్నుడు గురుని రథముపై । ధీరత నెగసియునూ
తచ్ఛిరోజములు బట్టి ఖడ్గమున । తరిగివైచె శిరమూ
ధర్మాత్మజను లిర్వురు వారింపగ । తప్పకటులొనర్చె॥

వ చ న ము—

ఇట్లెరింగించి కుంభజుండు బడినతరి మన బలంబులు విరిగె మేము నిరుత్సాహులమైతిమి యేనుంగు పేర నెపంబుగా నట్టి మాట బుట్టుట కృష్ణకృత్యంబగు కపటోపాయంబు గానోపునని కృపుం డంతయు నేర్పడం బలికెననుటయు ధృతరాష్ట్రుండు సంజయు దిక్కు మొగంబై.

మోహన — ఆదితాళం

జనకు డాలమున దెగిన వార్తవిని - నూతా - సూతా ॥
మనసులోన నెటు శాంతి వహించెనో - నూతా - నూతా ॥జ॥
వరదివ్యాస్త్రవిదుండు బాహుబల । వర్ధనుండూ ।
పురుహూతునకు సరి బోల్పగవచ్చూ - దురమునందు ॥జ॥
(శ్రీ)రామునితో సరి సేయందగు - ధీరూ డతడూ ।
యేరీతిని సైరించెనో తండ్రి - మరణం బిపుడూ ॥జ॥

వ చ న ము—

సంజయా ధృష్టద్యుమ్నుం డట్లొనర్చిన నక్కొడు కెట్లుజేసెనో వినవలతుం జెప్పు మనవుడు నమ్మహీపతి కతం డిట్లనియె.

## రగడ

కృపుని వాక్యములు విని దన కన్నుల । గెంపు గదురుచుండా
కన్నుల జలములు గ్రమ్మఁదెరగా । కరతలమున నొత్తి
ద్రోణనందనుం డనియె సుయోధను । తోడ నిట్టులనుచూ
నా దివ్యాస్త్రంబుల గల శక్తియు । నాదు బాహుబలమూ
నాశౌర్యం బిక గాల్పగ నేటికి । నా తెలివదియేలా
దిక్కుమాలి నా తండ్రి పగతుచే । నిక్కలనిం దెగియే
నేను లేనిచో నట్లొనర్చె వా । డేమి దలంచెనొకో
యిందుకు మూలము ధర్మరాజు తా । నెట్లగునో గనుడీ
నేనొక బాస యొనర్చెద కౌరవ । భూనాయక వినుమూ
నా దివ్యాస్త్రంబుల పాండవులను । నారాయణుడాది
నోహటించి శరకీలల కోర్వక । నొదిగి యుండజేతూ
తురగస్యందన వారణంబులను । ద్రుంగజేతు సుమ్మా
సురసంఘంబులు దోడై వచ్చిన । దురమున విడిచెదనే
జనకుని పరిభవమును విన్నంతినె । జనియించెను కలతా
యెటులైనను పగదీర్చుకొనెద న । న్యెంతని దలపకుమా
హరివేడియు నా జనకుడు నొక్కమ । హాస్త్రంబును బడసే
అదియు నా కొసగెను దివ్యాస్త్రం । బరుల జంపకున్నే
ఆసాధనము బ్రయోగించెద జయ । మందజేతు రాజా
అని యిటు గురునందనుడు దెల్ప విని । యద్భుతమోదమునా
కౌరవపతి దమ్ములు సేనలు శం । ఖంబులు బూరించీ
సింహనాదములుజేసి మరలిరని । జెప్పిన సంజయుడూ
ధృతరాష్ట్రుండ నేమన బలములు న । ద్భుతముగ వెడలగనీ
పాండుపుత్రు లేమేట్లొనర్చి రా । భండనమున ననినా
సంజయు డిట్లను నుభయ సైన్యములు । సమరమునకు జొరగా
ధర్మజు డర్జునుతో నిట్లనియెను । ద్రోణిబడిన పిదపా
వెరపున జనుసేనలు సమరమునకు । మరలివచ్చుటేమో
అనవిని ధర్మజునకు నిట్లనియెను । సమరాధిపు సుతుడూ

తండ్రి నధర్మంబున తల్రదుంచిన । తద్వార్తను వినియూ
తనయుం డశ్వద్ధామ యనాథై । యని యూరక యున్నే
అద్భుత విక్రమ శాలియైన నా । యశ్వద్ధామ నెదురా
యెవ్వరికైన దరంబె లోకమున । నితని బోరగెలువా
జన్మకాలమున నీతడు నుచ్చై । శ్రవము భంగినరచే
పుడమినెల్ల గంపించె నప్పుడా । భూమి ప్రజలు వినగా
అశ్వద్ధామను పేరున నరచెను । యాకాశవాణీ
గావున నాతడు వచ్చు రణమునకు । కారణమాతండు ॥

వ చ న ము—

అని యిట్లుజెప్పి వెండియు.

కళ్యాణిరాగం – రూపకము

అన్నా యీలాటిమాట – లాడుదు రే ధర్మాత్ములు ।
నిన్నెంతో ప్రేమించెడి – నీతి కోవిదుండు గురుడు ।
యెన్నగ శిష్యుండవు నీ – వెంతో ధార్మికుడవనుచు ।
పన్నుగ సత్యవ్రతుడని – నిన్నడిగె మహోదయమున ॥అ॥
నీవు ధర్మహానికోర్చి – నెరిబల్కినవార్త వినయు
భావంబున నిజముగాగ – భారద్వాజుడు దలచెను ।
భూవర యి ట్లనృతముచే – బొందవలె నే రాజ్యంబును ।
నేవిధముల బరికించిన – వెలితియైతి మీా జగమున ॥అ॥
పరమద్రోహ మొనరించెను – పాండవాగ్రజుం డందురు ।
భరియింపగరాని నిందల – పాలైరీ పాండుసుతులు
ధరచప్పిడి పున్నయు చో – దరిని నేలిన గారీశుని ।
కరుణలేమి ననృతంబాడగ – గలిగెనేమొ యెరుగంగరాదు ॥అ॥

వ చ న ము—

అర్జునుం డిట్లనుచున్న విని భీమసేనుం డత్యాగ్రహంబున నిట్లనియె॥

## రగడ

అడవులనుండెడి తపసులలాగున । నుడివెద వీ విపుడూ
పడతి ద్రుపదసుత నాటి సభను తా । బడిన పాట్లకెల్లా

యే న్యాయము ధర్మము గలిగుండెనో । నెఱుగవె యింద్రసుతా
అట్టివారి కెన్నెన్ని యొనర్చిన । నఘముగలదె మనకూ
కురుకుమారు లందరు నన్నెఱుగుదు । రరమరేమి లేకా
కురుకుమారులందరిని నేను మరి । కొంత యెఱుంగుదునూ
గాన వారి బొలియింపక విడుతునె । కయ్యంబున నేడూ
అని యనుచుండగ ధృష్టద్యుమ్నుం । డర్జునునకు ననియే
శక్తిలేని సైన్యంబుల నెల్లను । జంపె శరగురుండూ
యేమి ధార్మికుండై యటు జంపెనో । యెఱుగరాదు పార్థా
అదియుగాక నే నగ్గురు జంపగ । నగ్నిబుట్టినాడా
అది యెఱుంగకను నన్నిట్టుల సెడ । నాడ న్యాయమౌనే
పితృసఖుండగు భగదత్తుని జం । పితి వది ధర్మంబే
కురువృద్ధుడు భీష్మాచార్యుని నని । గూల్ప బాడియౌనే
పుణ్యకార్యమని దోచెనె నీమది । పురుహూతాత్మజుడా
ప్రతివీరుని రణమందున జంపుట । పాపహేతువౌనే
ధర్మజుండు బొంకడు నే నెంతయు । ధర్మము దప్పనుగా
గావున శిష్యుని వంచన జేసిన । కలశజుండు జచ్చె
యింకనీవు సైన్యంబుల నెల్లను । శంకలేక గెలువూ
అని యిటు దెల్పిన విని ధృతరాష్ట్రుం । డనియె సంజయునితో
మునికుల జాతుండైన ద్రోణు న । ట్లనిలో దెగటార్చి
ఆరీతిని బల్కెడి దుర్మార్గుని । నచటివారలెల్లా
కనలి యేమి యొనరించిరో చక్కగ । వినిపింపుము సూతా
అనవిని సంజయు డా ధృతరాష్ట్రున । కనియె నిట్టులనుచూ
నిట్టూర్పును నిగిడించి కన్నులను । నీరునింపి నరుడూ
రోతమాట లిటు బల్కుటకును మన । సే తీఱన యొప్పే
నరుడిటు లాడిన మాఱు బల్కకను । హరి ధర్మాత్మజులూ
తలలువంచుకొని బలుకకున్న సా । త్యకి కోపంబుననూ
ద్రుపదాత్మజునిం గని నీ నాలుక । తునియలుగాదయ్యో
నీశిరంబు బ్రద్దలు గాదయ్యెను । నీచమానసుడవై

గురుని పరాభవ మొనరించియు నీ । తెరగున బల్కెదవూ
మిగిలినపనికై జేయునదేమిక । మించె కాలమిపుడూ
యీ రాజేంద్రుని సన్నిధి బ్రతికితి । విక మాట్లాడిననూ
నోరు జీలికలుగా జేయించెద । మూకుబల్కితేసీ
గంగకొడుకు మారేయకున్న శి । ఖండి గూల్చె నతనీ
తద్విధాన మిట్లొనరించుండని । తాతబనిచినంతా
తాతయాజ్ఞ మనుమం డొనరించెను । తగదె యర్జునునకూ
నీవు శిఖండియు బుట్టితి రెట్లో । నీచగుణంబులచే
పాంచాలవంశంబును కీర్తికి । బాపితిరన వినియూ
నవ్వుచు ధృష్టద్యుమ్నుం డప్పుడు । నతని విలోకించీ
సైరించిన ధెసుగవు సాత్యకి నీ । చారిత్రము దలపా
అన్యశరంబున కరముందెగిపడి । నట్టి భూరిశ్రవునీ
జంపినట్టి యవివేకివి నిట్టుల । జనునెబల్క నీకూ
అక్కడ భూరిశ్రవుడు నీవు రొ । మ్మెక్కి ద్రొక్కినపుడూ
యేమిజేయగా జాలవైతివీ । వెందులకిటు బలుకా
వలవని మాటలివేల బల్కెనను । నలిగించెద విపుడూ
కురుబలంబుల వెవచ్చుచున్న విటు । దురముసేయ రమ్మా
అని పల్కిన ధృష్టద్యుమ్నుని గని । యాశైనేయుండూ
అరుణలోచనుండై కోదండం । బరదంబుననిడియూ
గదచేగొని ధృష్టద్యుమ్నునిపై । కడువడి ధుమికియునూ
నామాటల కెదురాడితేని నిను । నరికెద నిక్కముగా
అని గద ద్రిప్పుచు గవిసినంతగని । వనజనాభుడపుడూ
మారుతాత్మజుని బొమ్మన నాతడు । తేసుడిగ్గ నురికీ
జని యారడుగుల దూరంబున నా । సాత్యకినిం బట్టా
అంతలోన సహదేవుడు వచ్చియు । నతని కిట్టులనియే
వలదు వలదు మీలో మీరిట్టుల । కలతజెందమేలే
అలుకదక్కడని బలుకుచుండగా । నా ద్రుపదాత్మజుడూ
వడమూడి[illegible] నిట్లనియెను సాత్యకి । విడువుము కౌగిటనూ

అడిచిపడుచున్నాడు పీని నిట । మడియించెద సుమ్మా
యిరువురు వైరములాడుచుండు తరి । విని హరి ధర్మజులూ
నయ్యిరువుర శాంతింపగ జేసిరి । నతి ప్రయత్నములనూ
అప్పుడు భేరిమృదంగ శంఖకా । హళములు మ్రోయగనూ
పాండవ కౌరవబలములెల్ల నొం । డొండుల దాకియునూ
పోరుచుండి రయ్యిరువాగులు సం । పూర్ణ క్రోధములతో
ఆయెడ నశ్వత్థామ సుయోధను । కనియె నిట్టులనుచూ
అనృతము బల్కియు బ్రతుక దలంచిన । నా ధర్మజుమూకా
లన్నియు నేమైయుని బడియెదరో । కన్నారగ గనుమా ॥

వచనము—

అని దుర్యోధనునకుం జెప్పి నియతుండై నారాయణాస్త్రంబు ప్రయోగించినంత ధరాతలంబు దిద్దిరం దిరిగె రవి కిరణంబులు సంకుచితంబు లయ్యె దిశావితానంబు వడంకె మిన్నదిర్చె పాదప సంతానంబు గ్రక్కదలె యిట్లు భీకరాకారంబైన యద్దివ్యసాధనంబనేకాకారంబులై కౌంతేయ సైన్యంబంతయు నొక్కపాయగా గలిసినం గని తెంపున తత్సైని కనికరంబులు వివిధవిశిఖంబుల మగిడించిన నిలువక నింగికిని నేలకును నడుమ నొక్కటియై యమ్మహాస్త్రంబు చతురంగంబుల ద్రుంగించుచు పై గ్రమ్మిన సేనలు పరవం దొడంగిన యప్పుడు నరుం డూరకున్న నారాయణుండును నతండు వినుచుండ ధర్మనూనుండు సాత్యకి ధృష్టద్యుమ్నుల నాలోకించి యిట్లనియె.

తోడి — ఆదితాళం

ఆసలేల ధర్మజుడు గెల్చునను-యాసలు మానుడి-యాత్మలలోపల ।
ఆసభలో పాంచాలిని బట్టుక-గాసిజేయ జూచుచుండె నరుడట ॥ఆ॥
ఆవచ్చెడి యుజ్వలాస్త్రమెదుగుగ-నరిగెద సందియమించుక లేకను ।
మీవాహినులటుబారిపోండు యా-వా-సవాత్మజుని కోర్కెదీరుసిక॥ఆ॥

వచనము—

ధర్మజుం డిట్లన విని జనార్దనుండు సత్వరుండై

# రగడ

పెద్దయెలుంగున నెల్ల సైనికుల । బిలిచి యిట్టులనియే
సామజములు హయములు రథంబులను । సరగున డిగ్గియనూ
ఆయుధచయముల నట విడనాడియు । నందరొక్క మొగినీ
అవనీగతులై యున్న నిరాయుధు । లకు మోసములేదూ
అమ్మహాస్త్ర మేమియు జేయదు మి । మ్మది యెట్లంటేనీ
దీనికి ప్రతిఫల మింతెగాని దీ । నిని యొసగిన వారూ
యీవిధాన మొనరించె నటంచును । శ్రీవరుండు దెలుపా
ఆ మాటలకును సంతసించి వా । రట్లొనర్పబూనా
భీముడు వచ్చియు డిగకుడనుచు కడు । బిగ్గర నరచియునూ
దివ్యాస్త్రంబుల శక్తిని మాన్చెద । తీవ్రశరంబులచే
గద విహారమున నరి ప్రకరంబుల । మదమణగించెదనూ
అని రభసంబొనరించుచు శంఖం । బల్లన నొత్తియునూ
తామసమున గద చేకొని యశ్వ । ద్ధామ నెదుర్కొనినా
అవ్విధుం డదలించుచు నారాయ । ణాస్త్రము నిగిడింపా
అగ్నిజ్వాలావృత నెనేకబా । ణములై వాయుజునీ
స్యందనంబుపై బొదివినంత గని । సైన్యము లెల్లరునూ
వాహనములు దిగి యాయుధములు నిల । వదలిన మూకలనూ
బాధింపక నట భీమసేను దెస । బఱవిడుచుండగనూ
నరుడు గనుంగొని సత్వరంబుగా । వరుణాస్త్రంబేయా
అశ్వద్ధామ ప్రయోగాస్త్రంబును । నడగజేయ నున్నా
గనుగొని గురునందను డా యస్త్రము । కడు ప్రబలము సేయా
అగ్నికీలలం గ్రక్కుచు భీముని । యరదముపై జనియూ
చుట్టుముట్ట యెటు జనుటకు లేకను । జూచుచున్నయంతా
గని కృష్ణార్జును లిర్వురు తేరును । కడువేగమె డిగ్గి
రిత్తచేతులను నిలిచియుండి వా । రిద్దరు గనుగొనుచూ
వారుణాస్త్ర మహిమాతిశయంబున । వహ్ని గాలకున్నా
భీముని యరదము మీదనుండకను । భూమిని ద్రోయగనూ

దిగకాతడు బీరంబున నుండగ । నగధరు డిట్లనియే
కరువలి నందన యిమ్మహాస్త్రమును మరలించుటకిలలో
సాధ్యము గాదని దెలిసిగాదె యీ । స్యందనంబు దిగుటా
శక్యమైన మేమూరకుందుమే । సమయించక దీనీ
గావున జెప్పెడి బుద్ధిని విని । గ్రక్కున దిగిరమ్మా
అని యిటు బోధించియు నిరాయుధుని । గా నొనరించియునూ
హరి నరులిదువురు దోడ్పై భీముని । యరదము దిగద్రోయా
అప్పుడు పాండవ సైనికులెల్లను । నతి ధైన్యము నొందా
శాంతి బొందె నారాయణాస్త్రమా । శౌరిగనుచునుండా
అంత కమల నాభుండు వారి బల । మంతయు బురికొల్పి
శస్త్రాస్త్రంబులు వాహనంబులును । సరగగొను మటంచూ
దెల్పినంత వారట్లు సల్పి బురి । కొల్పుక సైన్యములూ
కురుసేనలపై జొచ్చి తూర్యములు । ఘోషింపగజేయా
ఆ సంరంభము జూచి సుయోధను । డా ద్రోణికిననియే
యింకనైన యద్దివ్యాస్త్రంబును । నింపుమట యనినా
మరల ప్రయోగించిన యా యస్త్రము । మనల జంపు ననినా
వినిదుర్యోధను డాత్మను గుందెను । జననాథాయనినా
సంజయుమాటలు విని ధృతరాష్ట్రుడు । సందేహించుచునూ
విను సూతా నారాయణాస్త్రమట । వృథయైపోయిననూ
ద్రోణి సుయోధను లెట్లొనరించిరొ । తగ దెల్పుము సూతా
అనవిని గురుసుతు డా పాంచాలను । తున్నిపై గలిసియునూ
యిరువదేను మార్గణములు బరపిన । వెరువక నాతండూ
శరపరంపరల నొప్పించిన యా । చార్యుని తనయుండూ
ధృష్టద్యుమ్నుని కేతు హయంబుల । తేరు జాపములనూ
సారథినిం ధరగూల్చినంత గని ! సాత్యకి యటు రాగా
ఒక్కశరంబున మూర్ఛ బుచ్చి తా । నక్కటికములేకా
ధృష్టద్యుమ్నుని ఫాలతలంబున । ధీరశరం బేయా
అరదమునపై సోలిన గని వాయుజ । నరులు రో[illegible]మునసూ

బాసటవై కురుబలముల నెల్లను । బారి సమరు చుండా
శంఖం బొత్తుచు గలగిపారు తన । సైన్యంబుల నిలిపి
నరుడా యశ్వత్థామను గనుగొని । సరగ నిట్టులనియే॥

వచనము—

అర్జునుండు మరియు నిట్లనియె.

మోహన—చాపుతాళం

పారిపోక నిలునిలు మిట - బ్రాహ్మణోత్తమా ।
భారద్వాజ తనయ నీ యు - పారశక్తిని జూపి ।
భండనము సేయక ॥పా॥
నీదు బాహుబల సంపద - నీ శౌర్యమునూ ।
నీ దివ్యాస్త్రముల మహిమ - నీ దినము జూపక ।
నిట్లుంట రణమున ॥పా॥
కురుపతికెదస నీకు గలుగు - కూర్మి జూపియూ ।
దురము సేయ కిటు దెరలుట - పురుషత్వమే యిది ।
శరగురునందన ॥పా॥

వచనము—

అర్జునుం డిట్లనుచున్న విని గురునందనుండు.

## రగడ

పావక శరము ప్రయోగించిన నది । పాండవబలములనూ
జుట్టుముట్టి కాలాంతకు రీతిని । నెట్టన గూల్చుచునూ
యెట్టకేల కక్షౌహిణి సేనల । ధిట్టతగూల్చగనూ
కురు సైన్యంబులు నుబ్బియార్చుచును । హారినరు లీయడనూ
చచ్చెచచ్చెనని గేకలువేసిరి । సర్వకురు బలములూ
అప్పుడు పార్థుడు బ్రహ్మాస్త్రంబును । నభిమంత్రించియునూ
విడిచినంత యాగ్నె యాస్త్రంబును । విఫలత గావింపా
సంతసమందుచు దేవదత్తమూ । సవ్యసాచి బట్టె

పాంచజన్య మూ । వెంటనె శ్రీహరి బహుళంబుగ మ్రోసే
అది గని పాండవసేనలు సంతస । మొదవనొక్క మొగినీ
సింహనాద భేరీరావంబులు । జేసి రద్భుతముగా
దీనవదనులైయుండిరి కౌరవ । సేనలు దిశలా
గురునందను దివ్యాస్త్ర బలములే । కునికి సిగ్గుమాలీ
సమరమునకు నిక జొరవంచును త । న । చాపము బడవైచీ
అరదంబును దిగి తొలగిపోవు నెడ । నాగములేద్యుండూ
వేదవ్యాసుడు నశ్వత్థామకు । వేగను పించగనా
భయసంభ్రమములతోడ వినతుడై । పాదములకు మ్రొక్కి
డగ్గుత్తికతో మానిరాయనా । సిగ్గుబోయె నేడూ
అరయనాదు యాగ్నేయాస్త్రము వృధ । యైచనియెను దేవా
యేమి మాయయో యెరుగగరాడది । యేమి కాలమహిమో
దేవాసురగంధర్వజాతులకు । దివ్యసాధనంబూ
సాధ్యముగానిది మనుజుల నేలకొ । జంప బూనదయ్యే
ననవుడు వ్యాసమునీంద్రుడు దెల్పెద । వినుమని యిట్లనియె
అఖిలలోక రక్షణకై విష్ణువు । యవని నుద్భవించీ
తపముజేసె మైనాకచలంబున । దర్పాంతకు గూర్చి
ఆదిదేవు డొనరించు తపంబున । కాత్మ మెచ్చుకొనుచూ
శంభుడు పొడసూపిన పద్మాక్షుడు । స్మరహారునిం గనియూ
సాష్టాంగముగా మ్రొక్కి నిలిచి తా । సద్భక్తినిజూచీ
ఫాలంబున కరములు జోడించియు । ప్రస్తుతి జేయుచునూ
దేవాస్థావర జంగమాదులును । నీ వలనం గలిగే
నిఖిలలోకములు నిఖిలజీవములు । నీవేగద దేవా
నీమూలంబున ముల్లోకంబులు । నెగడుచుండె శంభో
అని యనేక విధముల ప్రస్తుతిజే । సిన రుద్రుం డపుడూ
కరుణారసమున నాలోకించియు । కంజాక్షుని కనియే
నీవు సురాసురగంధర్వాదుల । నెల్ల గెలువగలవూ
అస్త్రశస్త్రముల నగ్నిజలంబుల । నశనినార్ద్రిమునసూ

స్థావరజంగమ శుష్కంబులచే । చావులేదు నీకూ
అనిలో దొడరినయపుడు నీవు న । న్నైన జయించెదవూ
అని వరమిచ్చిన కారణంబునను । హరిజయ మందెనుగా
అతనియందు జనియించిన నరుడును । అట్టివాడుగానా
వారలేగదా కృష్ణార్జునులకు । వేరుగలదె యెపుడూ
నీవు తపో విద్యావిభవుండవు । నేదెల్పెద వినుమూ
అట్టి పూర్ణమానసుల జయింపగ । నెట్టులగును ద్రౌణీ
పూర్వజన్మ ఫలమర్చన ఫలములు । బొందవలయు భువిలో
తారతమ్యమౌగ ననుభవింపగా । దగును మానవులకూ
అని సాత్యవతేయుడు బోధించిన । విని పులకాంకితుడై
అశ్వద్ధామ సమాహితుండునై । నమిత భక్తితోడా
శివునకు తనలో వందనమిడి కే । శవునిం గొనియాడీ
వ్యాసమునీంద్రున కభివందనములు । జేసిన నమ్మునియూ
అంతర్ధానంబై జనినంతనె । యశ్వద్ధామ మరలీ
వచ్చిరథారూఢుండై సేనల । నిచ్చ బారజూచీ
భానుండస్తాద్రికి నేగుట కురు । పతికడ కేతెంచీ
సాంధ్యాకాలంబగుట దెల్పి తమ । సైన్యంబుల నెల్లా
దివియింపగ నియమింప సైన్యములు । దీనవదనములతో
శిబిరంబుల కేగిరి కౌరవు లా । సేనతోడగూడీ
అంతట పాండవబలములు మనముల । సంతసములతోడా
సింహనాదములు తూర్యనినదములు । జెలగనుల్లసిలుచూ
సేనలమరలించుక శిబిరములకు । జేరిరి పాండవులూ
తదుపరి వేదవ్యాసుడు నరునకు । దరిశన మిచ్చిననూ
గనుగొని వినయ విధేయుండై వం । దన మొనరించియునూ
అర్ఘ్యపాద్యపూజా విధానముల । నారాధించియునూ
పారాశర్యుని సామీప్యంబున । భక్తితో గూర్చుండీ
ముక్తిసాధనుండౌ యాతాపసి । మోమును వీక్షించీ
అయ్యానా నొక సందియంబుగల । దది యెట్లంటేనీ

కయ్యమునకు జని పగతుర గొట్టెడి । కాలంబున నెవరో
నాముందర నొకడై యాపుడమిని । నడుగులిడక యుండీ
అగ్నిజ్వాలలు వెల్గుశూల మొక । టరయుచేత గొనియూ
నను నెదిరించెడి వారినెల్ల త । ద్ఘన శూలముచేతా
తెగటార్చుచు నుండగ వెనుకను నే । దివ్యశరంబులచే
చంపినాడనను కొందు జయంబుదు । సమకూరుట కొరకై
అప్పురుషుండెవరో యని దలచెద । నాత్మగతంబుననూ
గావున నా మహనీయుండెవరో । కరుణ దెల్పుమనినా॥

వ చ న ము —

అంత సాత్యవతేయుండా అర్జునున కిట్లనియె.

కాంభోజి — జంపెతాళం

అతడెవ్వరో యనుచు – నాత్మనెంచెదమేమొ ।
హితవునను నిన్ను బ్రోచు – యీశ్వరుడు పార్థా ॥అ॥
నిఖిల లోకంబులను – నిండియుండెడివాడు ।
అఖిలాంతరాత్మకుడు । న భవుడో పార్థా ॥అ॥
పరమయోగుల హృదయ – పంకజాదిత్యుండు ।
పరమేశ్వరుడు గౌరి – పతి యతడు పార్థా ॥అ॥
పాపభూషణు డట్టి – రూపమున నీ ముందు ।
జూపట్టె నీజన్మ సా – ఫల్యమయ్యె ॥అ॥
యిలనుల్చి పురమందు – వెలసి పున్నయనేలు ।
నలిమలల్లుని కరుణ – గలదయ్యె పార్థా ॥అ॥

వ చ న ము—

సాత్యవతేయుం డిట్లు దెల్పి యక్కరుణా కరుండు శరణాగతుల రక్షించి సకలైశ్వర్యంబు లొసంగునని దెల్పినవిని.

## ర గ డ

వ్యాసమహాని దెల్పిన వాక్యములకు । తా సంభ్రమముననూ
చరణములకు సాష్టాంగ వందనము ॥ సల్పి యర్జునుండూ

పూజించిన గని వ్యాశసమౌని సం । పూర్ణహృదయుడగుచూ
ఆశీర్వాదముజేసి జనియె నపు । డా మౌనీంద్రుండూ
అనుచు సంజయుడు ద్రోణయుద్ధ క్రమ । మంతయు కురుపతికీ
జెప్పినటుల జనమే జయనృపునకు । జెప్పె మౌనివరుడూ
ఆవైశంపాయనుని వలన వినె । నతడు సాంగముగనూ
అట్టి ద్రోణుచరితంబు వ్రాసి విని । నట్టి పుణ్యులకునూ
యిట్టి చరిత్రము నంకితమును గొను । నట్టి ధన్యుడైనా
పోలుపుగ చప్పిడి వంశసంభవుడు । పున్నయచౌదరికీ
ధరనునుల్చి పురినెలసిన గౌరీ । ధవుడు చంద్రధరుడూ
సకలశుభంబుల నొసగుచుండు నా । చంద్రతారకముగా ॥

వచనము —

యివ్విధంబున జనమేజయ భూవరుండు శ్రీమదాంధ్రమహాభార తంబున గల ద్రోణయుద్ధ క్రమంబంతయు సాంగముగా వైశంపాయన మునీంద్రుని వలన విని తదుపరి సుఖాసీనుండై యుండె.

(సంపూర్ణము)



